చిత్రించారు రచయిత. అసలైన భారత నారిలోని అంతరంగమూ - అంతరంగంలోని అనురాగమూ - అనురాగంలోని ఆదర్శమూ - జానకిలో మనం సందర్శింపగలం.

కథానాయకుడైన రాజయ్య జీవితం ఆదర్శమూ, అమూల్యమూ అయిన పవిత్ర ప్రేమకు ప్రతిబింబం. అనంతుని కష్టసహిష్ణుత్వం మన రాజయ్య స్వార్థరహిత ప్రేమతత్వంలో సమైక్యాన్ని పొందింది.

సంభాషణలు సహజంగా సరళంగా నడిచాయి. మధ్యమధ్య అవకాశం కలిగినప్పుడల్లా రచయిత హృదయంలోని భారతీయత ప్రస్ఫుటంగా ప్రకటితమౌతూనే వచ్చింది.

పాత్రచిత్రణం, కథాకథనం, భావప్రకటనాదికం, మనోహరంగా వున్నాయి. మొత్తంమీద చెప్పాలంటే ఈ నవలలోని ఇతివృత్తం ఆడంబరత్వంపై నిరాడంబరత్వం సాధించిన జయశ్రీ అనవచ్చు. ఈర్ష్యా ద్వేషాలపై శాంత్యహింసలు సాగించిన జైత్రయాత్ర అనవచ్చు.

మహాభాగివారు జగమెరిగిన బ్రాహ్మణులు. ఈయన గద్య పద్య నిర్మాణంలో సమాన ప్రతిభ సంపాదించిన సాహితీ సవ్యసాచి. వీరి విజయధ్వజమూ, ధర్మసామ్రాజ్యమూ ఇంతక్రితముందే ఆంధ్రావనిలో అశేషఖ్యాతిని ఆర్జించుకొన్నాయి.

వీరి ఈ స్వాతంత్ర్యోత్తర నవల 'నాగరాజు' కూడా ఆంధ్రసాహితీ సుధాసరసిలో తేలియాడి రసజ్ఞరమాపతుల నాల్కలూత లూగింపగలదని ఆశిస్తున్నాను.

— కరుణశ్రీ

# నా గ రా జు

అది ఒక యారామము. అందు రకరకాల ఫలవృక్షములున్నవి. బాలభానుఁ డప్పుడే యుదయాచల శిఖరము నెక్కి లోకమువంక తొంగిచూచుచున్నాఁడు. తమకుఁగల ఫలవైభవమునకు గర్వపడక తరురాజములు తలలువంచి భువన బాంధవునకు జోహారులు సేయుచుండ లతాంగనాకులము లానందపారవశ్యమున సన్నని మేనులసియాడఁ బువ్వులు దోయిలించినవి. గుత్తులు గుత్తులుగా వికసించిన యెఱ్ఱగన్నేరులు తలలెత్తి కర్మసాక్షికి స్వాగత మొసంగినవి. తను కుంకుమ కాంతులు నలుగడల వ్యాపింపఁ గాశీ రత్నములు రంగురంగుల మేలిముసుఁగులు దొడిగిన రాధామనోహరాల తోఁగూడి హారతి పట్టినవి. పికములు పాటలు పాడినవి. మయూరములు నృత్యములు చేసినవి. ఆ వనలక్ష్మి బంగారు కిరణకాంతిలో ధగధగ మెఱసినది.

ఆ యారామమున నొకమూల - వీధి దాపునఁగల యొక చిన్నగుట్ట మలుపున - ఒక పూరియిల్లు గలదు. అందు నాలుగైదు గదులున్నవి. ఒక గది పండ్లకొట్టు. ఆ గదితలుపు తెఱచియే యున్నది. లోనికిఁ బోదము రండు. అదిగో! ఎవ్వరో యొక బాలిక గంపలనిండ మామిడిపండ్లు పేర్చుచున్నది.

"నీవా పున్నమ్మా! ప్రొద్దు ప్రొద్దుననే వచ్చినావే? రా లోప లికి రా" అని లోనికిఁ గొనిపోయి, యొక మంచము వాల్చి, తాను దగ్గరగాఁ గ్రిందఁ గూర్చున్నది.

పున్నమ్మ నలుబది యేండ్లకుఁ బై బడిన వయస్సు గలది. సగము సగము నెఱసిన కురులతో వార్ధక్యము తోఁచి చూచుచున్న యీ ప్రాయములోఁగూడ నామె చక్కదనము తగ్గిపోలేదు. కగ్గిపోలేదు. దబ్బపండువంటి యీ శరీరచ్ఛాయ-మెడనిండ మిలమిల మెఱసిపోవుచున్న యీ బంగారు నగలు-ముడుతలు లేకుండ చాల నాజూకుగాఁ గట్టిన యీ ఖద్దరు సిల్కు చీరె - నవనాగరక ముట్టిపడుచున్న యీ తలకట్టు - మెఱుఁగు పూతలతో మిసమిస లాడుచున్న యీ కోలమొగము - ఆమె వయస్సును మఱపించుటయే గాక - ఆమె పట్టణ వాసియని - ఈ కాలపుఁ బోకడలు తెలిసినది యని - రూఢి సేయుచున్నవి.

ఆమె మంచముమీఁదఁ గూర్చుండి, యిల్లు నలుమూలలు పరికించుచు, "జానకమ్మా! ఏదో తొందర పనిమీఁద ఉన్నట్లున్నదే?" యని ప్రశ్నించినది.

జాన:- అవునమ్మా! రెక్కలమ్ముకొన్నవారికి విశ్రాంతి యెక్కడిది? ఈనాడు విజయవాడకు పండ్లు పంపాలని నాయుడుగారు కబురు చేసినారు. అందుకని గంపల నిండ పండ్లు పేరుస్తున్నాను.

పున్న:-ఈపని కూడా నీవే చేయవలెనా?

జాన:- మఱెవ్వరు చేస్తారు?

పున్న:-మీ నాయన ఉన్నాఁడుగా!

జాన:- ఆయన పెద్దవాఁడైనాడు. ముసలితనము ముంచుకు వస్తున్నది. మా అమ్మాయి పోయినప్పటినుండి ఆయనకు సుఖము దూరమై పోయినది. ఎంత కాలమని నిబ్బర పడఁ గలఁడు? ఈ రోజులలో ఒక రెక్కమీఁద ఇన్ని పొట్టలు నిండఁగలవా? ఎడతెగని చాకిరివల్ల ఆరోగ్యము చెడి ఆయన మంచము పట్టినాఁడు.

పున్న:-అయ్యో! మందెవరిస్తున్నారు?

జాన:- దిగుళ్ళతో కృశించే వారికి మందేమిటి? అదిగాక మాబోటి బీదవారికి మందులెవరిస్తారు? రోగాలు ఊరక వచ్చినవని డాక్టర్లు ఊరక వస్తారా? నోసిళ్ళలో రూపాయలు క్రుమ్మరించుటకు మావల్లనవుతుందా? పల్లెవారి రోగాలకు పసరు మందులే గతి.

పున్న:-మీ గ్రామానికి క్రొత్తగా వచ్చిన డాక్టరు మధుసూదనరావుగారు బీదలకు ధర్మవైద్యము చేస్తారని విన్నానే? ఆయనవద్దకు పోలేదూ?

జాన:- ధర్మమనేది యెంతవఱకు పున్నమ్మా! మందు ఖర్చులైనా ఇచ్చుకోవద్దూ? అదిమాత్రం మాకుసాధ్యమా? ఇంతకూ ఆయనగారు గ్రామంలో లేడు. బస్తీకి వెళ్ళి పదిరోజులైనది.

:-మఱి నీ వీ పనిలో మునిగివుంటే రోగిదగ్గఱ దిక్కెవ్వరు? దేవుఁడే దిక్కు.

పున్న:-అదేమిటమ్మా అట్లనెదవు? మీ కష్టసుఖాలలో పాలు పంచుకునే రాజయ్యనన్నా తోడు రమ్మనక పోయినావా?

ఈ మాట వినుసరికి జానకి మనస్సు ఉలికిపడినది. ఆమెకుం దెలియకుండగనే ముఖము జేవురించినది. మేనుగగుర్పొడిచినది. ఇదియంతయు క్షణికము. జానకి తన్నుదాను సంభాళించుకొని "రాజయ్యగూడా గ్రామములో లేడు. మా నాయునుగారి కూతురు రేపు మద్రాసునుండి వస్తుందట! ఆమెను తీసుకొని వచ్చుటకై విజయవాడకు వెళ్ళినాడు. మా కర్మానికి రాజయ్య మాత్రము ఏమిచేయఁగలఁడు? ఎవరు చేసినకర్మ వారనుభవింపక తప్పదుగదా?" యని పలికినది.

పున్న:-ఈ వేదాంతాల కేమిలే జానకమ్మా! ఇల్లెంత కాలమని యీ బీదతనము వెళ్ళబోస్తావు? దేనికైనా మితి అనేది ఉండాలి.

జాన:- నిజమే. వెళ్ళబొయ్యేక చేసేదేమున్నది? కలిమిలేములు రమ్మంటే వచ్చేవికావు. పొమ్మంటే పొయ్యేవి కావు. విధిశాసనము దాటరానిది.

పున్న:-ఇదంతా మీ రాజయ్య సిద్ధాంతము కాబోలు! పిచ్చిదానా! ప్రయత్నిస్తే మనకు సాధ్యముగానిదేమీ లేదు. ఎవ్వరికీ కలిమిలేములు పుట్టుకతోనేరావు. మీ నాయుడుగారు పుట్టుకతోనే ధనవంతుఁడైనాడా? జానకమ్మా! నామాటవిను. ఎవ్వరికైనాసరే సిరి

చెప్పరాదు. నీ యదృష్టము పండినది. నేటినుండి
నీవు – నీ ముసలి తండ్రి – సుఖపడే రోజులు వచ్చినవి.

జాన:– మావంటి గర్భదరిద్రుల కంటెటి యదృష్టమా పున్నమ్మతల్లీ!

పున్న:–నిజమమ్మా! నామాట నమ్ము. అమ్మగారికి నీయందు పరిపూర్ణానుగ్రహము కలిగినది. నీ యదృష్టము బయటపడినది.

జాన:– ఏ యమ్మగారికి? సరిగా చెప్పు పున్నమ్మా!

పున్న:–మాఅమ్మగారికి. రాజమ్మపేట జమీందారిణి – హేమలతాదేవిగారికి.

అని చెప్పి మౌనము వహించినది. జానకి సంభ్రమాశ్చర్య నయనములతో పున్నమ్మ ముఖమువంక ఎగాదిగా చూడసాగినది. తన మొగమే యెఱుఁగని జమీందారిణికి తనపై నింతటి యనుగ్రహ మేల కలిగెనో యామె బోధపడకుండెను. ఆమె పసిహృదయములోఁ బరిపరి విధములైన యాలోచనలు పరువులెత్తినవి. కాని యేమియు నిర్ధారించుకొనలేక, చెప్పుటకు మనసు పట్టలేక, జానకి నోరు తెరచి "పున్నమ్మతల్లీ! జమీందారిణికి నీవు నచ్చిన పరిచారికవు. మనసుకెక్కిన దానవు. నీకుఁ దెలియని విషయాలుండవు. మీ అమ్మగారికి నామీద నింతదయ కలుగుటకుఁ గారణ మేమో చెప్పవూ?" అని యడిగినది.

పున్న:–మీ బీదతనమే కారణము. నీతండ్రి ముసలివాఁడనీ, నీకింకను పెండ్లి కాలేదనీ, మా అమ్మగారు జాలిపడి

నీకు వెయ్యిరూపాయల మూట పంపినది; ఇది చాలక పోతే మీ నాయుడుపేట చెఱువు క్రింద రెండెకరముల మాగాణి, ఈ పండ్లతోట, యిస్తామని కూడా చెప్పినది. నీయదృష్ట మేమోకాని జానకమ్మా! మా దేవిగారు ఇంత గొప్ప సహాయము ఎవ్వరికీ చేయలేదు.

జాన:- మీ అమ్మగారి సహాయమును మే మెన్నటికీ మఱచిపోము. ఆ దేవిగారికి మా నమస్కారాలు చెప్పు. బ్రతికి ఉన్నంత వఱకు మేమా తల్లికి ఋణపడి ఉంటాము.

పున్న:-వట్టి నమస్కారాలు చాలవు. మీరు కూడా క్రియా రూపములో మీ కృతజ్ఞతను ప్రకటించుకోవాలి.

జాన:- అందుకు మే మెప్పుడూ సిద్ధమే.

పున్న:- మా దేవిగారికి – ఏ దేమి పాపమోకాని – మంచి తల కట్టు లేదు. ఇందువల్ల ఆమె సౌందర్యము చాల దెబ్బ తింటున్నది.

జాన:- అవును. ఆడదాని చక్కదనానికి తలకట్టేకదా ప్రధానము? ఇన్ని బస్తీలు తిరుగుతుంటారు. జుట్టు పెరిగే మానెలు చిక్కలేదూ?

పున్న:-ఆ ప్రయత్నాలన్నీ అయినవి. ఏమీ లాభము లేదు. ఈలోపాన్ని నీవే చక్కబెట్టాలి. అది నీ చేతిలో పని జానకమ్మా!

జాన:- ఇందుకు నేనేమి చేయగలను పున్నమ్మా!

పున్న:-ఏమి చేయగలవో చెప్పనా? మరేమీ అనుకోకు. నీ బారు వెంట్రుకలు కత్తిరించి యిమ్ము. మా అమ్మ

గారు చక్కని టోపా కట్టించుకొని తన సౌంద్ర్య లోపాన్ని సరిచేసుకుంటుంది. నీ కింత సహాయము చేసిన దేవిగారికి ఈ మాత్రపు సహాయము చేయుట నీవిధి సుమా!

జాన:- ఎంతమాట? ఆడదానివై పుట్టి నన్నిట్లడుగుటకు నీకు నోరెట్లు వచ్చినది పున్నమ్మా? భారతరమణికి జుట్టు లేక పోవుట అమంగళచిహ్నమని యెఱుగవా?

పున్న:-ఎఱుగుదును. భారతరమణివి నీవే కాదు - నేనుగూడ భారతరమణినే. ఎందరెందరో మన భారత మహిళలు వేంకటేశ్వరస్వామికి వెండ్రుకలిచ్చుచున్నారో! అది అమంగళ మనిపించుకొన్నదా? పిచ్చిజానకమ్మా! నీ వెండ్రుకలు మరల ఒక్కసంవత్సరములో పెరుగ గలవు. కాని యింతద్రవ్యమును నీ జన్మలో సంపాదింపగలవా? చక్కగా ఆలోచించుకొని మాట్లాడుము.

జాన:- నీవు చెప్పిన పోలికనుబట్టి నీ హృదయమెట్టిదో - నీ దేవిగారి తత్వమెట్టిదో - చక్కగా బోధపడినది. ఆలోచించుకోవలసిన దేమీ లేదు. మీ ద్రవ్యము నా కాసించి యీ తుచ్ఛమైన పని కొప్పుకోను.

పున్న:-నీ వెవ్వరినో ప్రేమించి - నీ అందానికి దెబ్బ తగులు తుందని - ఇట్లంటున్నావులే. ఇందాక నీలో గలిగిన మార్పునుబట్టి నీ ప్రేమరహస్యాన్ని నేను గుర్తించక పోలేదులే జానకమ్మా! నా మాట విను. అయూచి

తముగా నీ యింటికి లక్ష్మి వచ్చుచున్నప్పుడు నీకై నీవు తలుపు మూయుట తగదు.

జాన:- అదంతా నీకు అప్రస్తుతము పున్నమ్మా! మీ రిచ్చు ద్రివ్యము మా కక్కఱలేదు. మీ దేవిగారి దయ అంతకంటెను అక్కఱలేదు. మా రెక్కలు చల్లగా ఉన్నంత వఱకు మా కెవ్వరూ పెట్టనక్కఱలేదు. ఎంత బీదవార మైనా మాకుగూడా వ్యక్తిత్వమున్నది. చీము నెత్తురు లున్నవి. మేము మీ ధనవంతుల చేతి కీలుబొమ్మలము గాము.

పున్న:-చివరమాట విను. ఈ నాయుడు పేటకు మా అమ్మ గారే యజమానురాలు. మీ రందఱు ఆమె భూము లమీఁద బ్రతుకువారే. ఆ దేవి పట్టుబట్టినచో ఈపాటి కోర్కె నెఱవేఱుట లెక్కలోనిది కాదు. కానీ అందాక వద్దు. మళ్ళీవస్తానులే. ఈ లోపల చక్కగా ఆలోచించుకో. అమ్మగారి ప్రాపకము పోగొట్టుకొ నుట మాత్రము అంత తెలివైనపని కాదు.

అని చెప్పి పున్నమ్మ మంచమునుండి లేచినది. జాన కమ్మ మౌనముతో నామెను సాగనంపి, వీధితలుపు గడి వైచి, వచ్చి యెంతో బరువెక్కిన మనస్సుతో మరల పనిలో ప్రవేశించినది. ఎట్లో కొంత సేపటికి పని ముగించుకొని, పండ్ల గంపలు తయారైనవని చెప్పుటకుఁగాను నాయుడు గారి యింటికిఁ బోయినది.

గ్రామీణు లందఱు జమీందారీ భూములమీఁద బ్రతుకు వారే; సొంత భూము లున్న వారు చాల తక్కువ.

అది యడవులతోను, కొండలతోను, నిండిన ప్రదేశ మగుటచేత నాయుఁడు పేట కలపవర్తకమునకుఁ జాల ప్రసిద్ధి కెక్కెను. గ్రామీణులలోఁ గొంతమంది రాజమ్మపేట జమీ లోని యడవులు – కొండలు – పాటపాడి విరివిగా కలప వర్త కము చేయుచుందురు. మఱికొంతమంది తోఁటలు పాటపాడి పండ్ల వ్యాపారము చేయుచుందురు. ఏ కొద్దిమందిమాత్రమో భూమిని సాగు చేయుచుందురు. నీటివసతి చక్కఁగా నుండుట చేత వరి ముక్కారు పండును. రకరకాల పండ్లతోఁటలు — చెఱకుతోఁటలు — ఆకుతోఁటలు — చక్కఁగా ఫలించును. మొత్తముమీఁద నా జానపదుల సుఖజీవనమున కేలాటి కొఱఁ తయు లేదు. కాని వారు స్వాతంత్రజీవులు మాత్రము గారు. జమీందారుల నిగ్రహానుగ్రహములఁబట్టి వారి యదృష్ట చక్రము తిరుగుచుండును.

కోటకు — నాయుఁడు పేటకు — దాదాపు రెండు మైళ్ళ దూరము. రాకపోకలకు సరియైన రాజమార్గము లేదు. కాని యిరుకైన డొంక దారి మాత్రమున్నది. అదికూడ రెండు చిన్న గుట్టలను చుట్టిపోవును.

కోటలో నున్న వారికి నాయుఁడు పేటనుండియే ఆహార పదార్థములు సరఫరా యగుచుండును. అప్పుడప్పుడు ప్రతి నిధి తనిఖీలకు–జమాయిషీలకు–నాయుఁడు పేటకు వచ్చి పోవు చుండును. తఱచుగా నా మార్గమున నెవ్వరు సంచరింపరు.

నాయుడుపేటకు నైలుదూరములో స్టేషనుగ్రాండుట్రంకు నుండి విజయవాడకుఁ బోవునట్టియొక పెద్దరస్తా గలదు. ఈ రస్తాపై జరుగు వ్యాపారమున కిదియే రాదారి. బస్సీకపోవలెనన్ననుఁ— రైలు ప్రయాణము చేయవలెనన్నను — ఈ మార్గమే శరణ్యము. రాకపోకలకు మోటారుబండ్ల సౌకర్యము లున్నవి.

విజయవాడకు—నాయుడుపేటకు దాదాపు ఏబది మైళ్ళ దూరము. ఆ గ్రామీణుల కలపవర్తకమునకుఁగాని, పండ్ల వ్యాపారమునకుఁగాని విజయవాడయే కేంద్రస్థానము. నాయుడుపేటవారికి విజయవాడ కొట్టిన పిండి. అనుదిన మటనుండి వచ్చువారికి—ఇటనుండి పోవువారికి — లెక్కయుండదు.

వేసవికాలములో నాయుడుపేట నీలగిరివంటిది. కొండల నిండ పేటిబుగ్గ లుండుటచేతను, సహజముగా సువిశాలమైన చోళని యడవులుండుటచేతను, గ్రామము నలువైపుల పూలతోఁట లుండుటచేతను; అచ్చట గ్రీష్మతాపము కొంచెమైననే యుండదు. విజయవాడనుండి యెందరెందరో యచ్చటికివచ్చి వేసవిదినములు హాయిగాఁ గడుపుచుందురు. జమీందారీ కుటుంబమువారు గూడ వేసవిలోఁ గోటకువచ్చి మకాము చేయుచుండుట పరిపాటి.

నాయుడుపేటలోఁగల కలపవర్తకులందరిలోను మంగపతిరావునాయుడు చాలా పేరుమోసినవాఁడు. ఆయన తాతగారైన లక్ష్మణస్వామి నాయుడుగారి పేరుమీఁదనే యీ గ్రామము నిర్మింపఁబడినది. ఆ వంశీయులు మొదటినుండియు జమీలోని యెక్కువభాగము పాటపాడి విరివిగా కలప వర్త

కము చేయుచుందురు. చిన్నచిన్న కౌలుదారులు వారిచేతి క్రిందఁ జాలమంది కలరు.

మంగపతిరావు నాయుడుగారి తండ్రి హయాములో వ్యాపారము కొంత దెబ్బతిన్నను ఈయన హయాములోఁ జక్కఁగాఁ గలిసివచ్చినది. పలుకుబడిలోనేమి, సిరిసంపదలలోనేమి, ఆ గ్రామములో నతనిని మించినవారు లేనేలేరు. ఆయన కోస్తావ్యాపారమునుగూడ చేయుచుండును. ఆయనకు సొంత సేద్యముగూడఁగలదు. జీతగాండ్రు – పాలేగాండ్రు— కూలివాండ్రు చిన్న చిన్న కౌలుదార్లు – ఆయన చేతిక్రింద నెంతోమంది బ్రతుకుచుందురు. ఆయన కలప వ్యాపారముతోఁ బాటు పండ్ల వ్యాపారము చెఱకు వ్యాపారము మొదలైనవికూడ చేయుచుండును. ఆయన పట్టినదెల్ల బంగారమే!

మంగపతిరావు వయస్సు ఏబది ఏండ్లు. అయినప్పటికిఁ గాయకష్టము చేయువాఁడు గనుక మంచి కండపుష్టికలిగి అంతవయస్సుగలవాడుగాఁ గన్పడడు. సహజముగా నతఁడేమంత రూపసి గాడు. చామనచాయరంగు — పుచ్చుకాయంత బొజ్జ– బట్టతల–కొంచెము కొంచెము నెఱసిన గడ్డము– పొడుగాటి బుఱ్ఱమీసము— చూపుల కేమంత అనాకారిగా నుండడు. సిరిసంపదల గలవాడు గనుక దర్జాకు లోటులేనివాఁడు. అంతగా జదువుకోక పోయినప్పటికి వ్యాపార విషయములలో మంచి ప్రజ్ఞ గలవాఁడు. ఇంగ్లీషు చదువు రాక పోయినప్పటికి బస్తీకి పోయినప్పుడా వెలితి గన్పడకుండ నటించు చుండును. ఆయన యెచ్చటికిఁ బోయినప్పటికి

సొంత కారుమీఁదనే పోవుచుండును. కారుమీఁద పోవుటకు వీలు లేనప్పుడు గుఱ్ఱము నెక్కి పోవుచుండును. కాలు క్రిందఁ మోపి నడువకున్నను అతఁడు సుకుమార శరీరము గాఁడు.

ఆయన భార్య మంగమ్మ. నలుబదియేండ్లను మించిన వయస్సుగలది. భర్తకుఁ దగిన భార్య. ఇది అంతయు నాయు యదృష్టమే యని మంగపతిరావు భావన. ఆ దంపతులకుఁ జాలకాలము వఱకు సంతానము కలుగలేదు. బిడ్డలకొఱకై మంగమ్మ యెన్నో నోములు నోచినది. ఎన్నెన్నో ముడుపులు గట్టినది. చివరకు నాయుడుపేట నానుకొనియున్న నాగుల దిబ్బ వద్ద వెలసిన సుబ్రహ్మణ్యస్వామి యనుగ్రహము వల్ల వారికొక యాడుబిడ్డ గలిగినది. పురుష సంతానము లేనే లేదు. ఆ యాడుబిడ్డతోనే యాదంపతులు తృప్తిపడి తమ యిల వేల్పు అయిన సుబ్రహ్మణ్యస్వామికి గుడికట్టించి, యాపిల్లకు "నాగమణి" యను పేరుపెట్టి యాదేవునిపట్లఁ దమకుఁ గల భక్తిభావమును బ్రకటించుకొనిరి. గ్రామీణు లా పిల్లను నాగమ్మ యనియుఁ బిల్చుచుందురు. ఆమె కప్పు డిరువది యేండ్లవయస్సు. మద్రాసులో ఇంగ్లీషువిద్య నభ్యసించు చున్నది.

ఆనాఁడు— పగటి భోజనములైన తరువాత— నాయుడు దంపతులు — క్రింది యంతస్తులోని ముందు హాలులో — ఒక సోఫామీఁద గూర్చుండి — తాంబూలము సేవించుచు నేదో ప్రసంగములో మునిఁగియున్నప్పుడు జానకి పండ్ల గంపల సంగతి చెప్పుటకై యచ్చటికి వచ్చి—లోపల భార్యాభర్తలు

మాట్లాడు కొనుచుండుట చూచి-లోనికిఁబో వెలిచి -వాఁకిట వరాండాలో వారికిఁ గన్పడకుండ నొక స్తంభము నానుకొని నిలఁబడి- వారి ప్రసంగము వినుచుండెను.

మంగ:-ఏమండీ! మన అమ్మాయి రేపు వచ్చుట నిజమేనా?

నాయు: ఆఁ! వేసంగి సెలవు లిచ్చినారనీ, రేపటి మెయిలులో విజయవాడకు వస్తున్నాననీ, కారుపంపమనీ, వ్రాసినదిగా? మన రాజయ్య కారుతీసుకొని విజయవాడకు వెళ్ళినసంగతి నీకు తెలియదా యేమి?

మంగ:-తెలుసు. రాజయ్య నాతోఁగూడ చెప్పిపోయినాడు. మన పెద్ద జీతగాడు పెద్దిరెడ్డికూడా వెంటవెళ్ళినాడు. అయితే రేపు ఎప్పటికి వస్తారు?

నాయు: బహుశా సాయంకాలానికి రావచ్చు.

మంగ:-మఱి వారికి భోజనము?

నాయు: స్నానానికీ-భోజనానికీ-యిబ్బంది లేకుండ రాజయ్య తన బావ గారింటికి తీసుక వెళ్తానన్నాడు. అమ్మాయిని హోటలుకు పంపుట బాగుండదని నేను గూడా సరే అన్నాను.

మంగ:-వారింట్లో అమ్మాయికి తగిన మర్యాద జరుగుతుందా అని నా యనుమానము.

నాయు: ఒక పూటకు ఎట్లయితే నేమి? రాజయ్య తెలివి తక్కువ వాడుకాదు. అమ్మాయి విషయములో మన కంటె ఎక్కువ శ్రద్ధవహిస్తాడు.

మంగ:-సరేకాని అమ్మాయి చదువు పూర్తి అయినట్లేనా?

నాయు: ఆఁ! ఈ యేడు పరీక్షలో గెలిస్తే పూర్తి అయినట్లే.

మంగ:—మరి పెండ్లిమాట యేమైనా తల పెట్టినారా? అమ్మా-
యికి యుక్తవయస్సు గూడ వచ్చినది. ఇంకను
ఆపుట బాగుండదు. ఈడు మించిన తరువాత మంచి
మనువులు దొరకుటకూడా చాలకష్టము. మన
అమ్మాయి చదువుకూ, మన సంపదకూ తగిన వరుడు
దొరకాలంటే ఎంతో గట్టి ప్రయత్నము చేయాలి.

నాయు:అమ్మాయి పెండ్లి విషయములో అంతగా కష్టపడవల-
సిన పని లేదనుకుంటాను. తగిన వరుడు మన దగ్గిరనే
వున్నాడు. ఈ సంగతి నీ కిదివరకే చెప్పుదామను
కొన్నాను. కాని అమ్మాయికూడా వస్తున్నదికదా
యని వూరకున్నాను.

మంగ:—నాకు తెలియకుండ మన దగ్గర ఎవ్వరున్నారండీ!

నాయు: నీకు తెలియకేమి? తెలుసు. నా నోటితో చెప్పించా-
లనుకున్నావు.

మంగ:—నిజముగా నాకు తెలియదు. నామాట నమ్మండి.

నాయు: అయితే విను. మన నాగును రాజయ్యకే యివ్వ
దలఁచుకొన్నాను. నీవు కూడా ఇందుకు కాదనవను
కుంటాను. రాజయ్య నా మేనల్లుడన్న సంగతి నీకూ—
నాకూ— ఈ గ్రామస్థులందరికీ తెలుసు. అతడు కూటికి
పేద కాని కులానికీ— బుద్ధికి— పేదకాడు. నిజానికి నా
వ్యాపారమంతా అతని చేతి మీదుగా జరుగుచున్నది.
ఈ ఆస్తి అంతా అతడు సంపాదించినదే. మనకు మగ

పిల్లలు లేనే లేరు. ఏ పరాయివానికో ఈ యాస్తి యావత్తూ కట్టబెట్టే బదులు అతనికే అప్పజెప్పి పిల్ల నిస్తాను. ఇద్దఱూ మన కళ్ళ యెదుట ఉంటారు. ఇంత కంటె మనజన్మకు కావలసిన దేమిటి?

భర్త చెప్పినది వినుసరికి మంగమ్మ మొగము వెల వెల పోఁబోయినది. ఈ సంబంధమును గుఱించి యామె కలలో నైనను అనుకోలేదు. తన కుమార్తె చదివిన చదువుకు— తమకుఁగల హోదాకు— రాజయ్య యేమాత్రము తగడనియే యామె యూహించినది. ఎంత మేనల్లు డయినప్పటికి ఎంత బుద్ధిమంతుఁ డయినప్పటికి — పల్లెటూరి సంబంధ మామెకు నచ్చలేదు. తన బిడ్డకుఁ గాఁబోవు మగఁడు పట్టణవాసిగా— పెద్ద ఉద్యోగస్థుడుఁగా—ఇప్పటి వేషభాషలు కలవాఁడుగా— తమకు దీటైన ధనవంతుఁడుగా— ఏ జమీందారీ కుటుంబమునకో చెందినవాఁడుగా—ఉండవలెనని ఆమె గాఢ వాంఛ. కాని భర్తమాట కెదురు చెప్పలేదు. అందువల్ల నామె మౌనము వహించినది. భార్యమనసు కొంతవరకు గ్రహింపఁ గలిగిన నాయుడు మరల సంభాషణము సాగించినాడు.

నాయు: నేను చెప్పినది నీకు రుచింప లేదనుకుంటాను.

మంగ:—నాకు రుచించిన నేమి? రుచింపకున్న నేమి? మీకు రుచించిన చాలు గదా? మీ మాటకు అడ్డమున్నది?

నాయు: అట్లనకు. నేనీ సంబంధమును స్థిరపరచుటకు ప్రబల కారణమున్నది. ఆ రోజులలో నా చెల్లెలు కూఁటికి

లేక మలమల మాడి ప్రాణాలు కోలుపోవునప్పుడు నన్ను చూచి "అన్నా!" యని కంటనీరు పెట్టుకొని భర్తను రెండేండ్ల వయస్సుగల తన కొడుకును, నా కప్పగించి మరణించినది. ఆ పిల్లవానిని నేనే పెంచి నావు. అతని కయిదేండ్లు వచ్చునప్పటికి మన నాగు పుట్టినది. మన సంపదకూడా హెచ్చినది. మన వ్యాపారము చక్కగా కలిసి వచ్చినది. మొత్తము, ఆ పిల్లవాడు మన యింట్లో కాలు పెట్టినప్పటినుండి మన కొఱతలన్నీ తీరిపోయినవి. నా బావను వ్యాపారములో భాగమిచ్చి కూడా వచ్చిన లాభమంతా నేనే కాజేసినాను. ఆయనకు మిగిలింది నష్టము కష్టము తప్ప మరేమీ లేదు. ఇంత జరిగినప్పటికి, నా మోసము తెలిసినప్పటికీ- ఆయన నన్ను పల్లెత్తు మాటన లేదు. భాగమని నన్ను ఎన్నడూ అడుగ లేదు. చివరకు రోగగ్రస్తుడై చనిపోవునప్పుడు నిన్ను-నన్ను పిలిచి - మంచము దగ్గర నిలబడియున్న అయిదేండ్ల యీడుగల నాగును- పదేండ్ల ఈడుగల తన కొడుకు రాజయ్యను- చూపిస్తూ "వీరిద్దరిని యేనాటికైనా నా ఒక్కటిగా చెయ్యి. నేను సుఖంగా మరణిస్తాను. ఈ నా చివరికోరిక కాదనకు" అని యేడ్చినసంగతి నీకు మాత్రము తెలియదూ? "వ్రాసిపెట్టి వుంటే తప్పుతుందా?" అని నీవుమాత్రము అనలేదూ? నేను చేసిన మోసానికీ- అన్యాయానికీ-ప్రాయశ్చిత్త

ముగా నా భావకోర్కె నెరవేర్చాలని నే నప్పుడే నిశ్చయించుకొన్నాను. నా చూపులలో నే నా భావము అంగీకారాన్ని తెలిపాను. ఆనాటి నా మూగ వాగ్దానమును ఈనాడు చెల్లించకపోతే నా పాపానికి ప్రాయశ్చిత్తమే వుండదు: ఇందులోవున్న రహస్య మిదియే!

మంగ:—మీ వాగ్దానానికని పిల్లగొంతు కోస్తారా?

నాయు:అట్లుచేయను. ఈ సంగతంతా అమ్మాయికి చెప్పుతా. ఆమెకూడా యిష్టపడితేనేయీ పెండ్లి. లేకపోతేమరొకటి. ఆమె సుఖానికి నేను అడ్డురాను. మంగమ్మ నుఱు మాటాడక తృప్తురాలై నట్లొక్క దీర్ఘనిశ్వాసము విడిచినది. అంతటితో నా ప్రసంగ మాగిపోయినది. మంగపతినాయుడు—ఒక పెద్దబరువు తొలంగినట్లు—సులాసాగా చుట్ట ముట్టించుకొని వరండాలోనికి వచ్చినాడు.

ఆ సంభాషణ మంతయు విన్న జానకి—అ చేలకో కాని—తడిసిన కన్నులతోఁ గొయ్యబొమ్మవలె — నిశ్చేతనయై స్తంభము నానుకొని నిలబడి యుండెను. ఆమెను గాంచినంతనే మంగపతినాయుడు చికితుఁడై "అట్లున్నావేమి జానకీ! నీవు వచ్చి యెంత సేపైనది? మీ నాన్న క్షేమైనా ప్రమాదముగా నున్నదా?" అని ప్రశ్నించెను. జానక మాట్లాడ లేదు. ఆమె మనస్సు బాహ్య ప్రపంచములోఁ బరుగులు వాఱు చున్నట్లున్నది. నాయుడు ప్రశ్నించిన సంగతి కాని, తన యెదుటనున్న సంగతి కాని, యామెకుఁ దెలియదు. అదొక చలనము లేని వెట్టిచూపు.

మంగపతి మఱింత భయపడి — దగ్గఱకుఁబోయి— ఆమె బుజముతట్టి — "జానకీ! మాటాడవేమి? మీ నాన్న కెట్లున్నది?" అని మఱల ప్రశ్నించినాఁడు. ఈ సారామెను స్మృతి గలిగినది. ఆమె మనస్సు బాహ్య ప్రపంచములోనికి వచ్చినది. వెంటనే యామె తన యెదుటనున్న మంగపతిని ద్వారముచెంత నిలబడి తనవంక చూచుచున్న మంగమ్మను— చూచి— తనస్థితికిఁదానే సిగ్గుపడినట్లు — ఒకవిధమైన తొందర పాటుతోఁ గన్నులు తుడుచుకొని, చీర సవరించుకొని, కంపమాన హృదయముతో మాట — రాని యొయ్యారముతో — ఎంతో కష్టముమీఁద — "పండ్లగంపలన్నీ తెచ్చినారు. ఆ మాట చెప్పుటకే వచ్చినాను" అని పలికినది.

నాయు: పండ్లగంపల కేమిలే. మీ నాన్న కెట్లున్నదో ముందు చెప్పు.

జాన:— ఏమీ తగ్గలేదు. చాలనీరసించి పోయినాఁడు. నాగతి యేమి కానున్నదో?

నాయు: భయపడకు జానకీ! నీవు నా రెండవబిడ్డవు. నా నాగు తరువాత— ఈ జీవితములో నీవే నాకు కావలసిన దానవు. డాక్టరుగారు వచ్చినారా?

జాన:— లేదు, వచ్చిమాత్రము ఏమిప్రయోజనము? మానాన్న మందు త్రాగనంటున్నాడు.

నాయు: అతనిమాటల కేమిలే. ఇది మొదలు రోగిని ఒంటరిగా విడచిరాకు. వెళ్ళమ్మా వెళ్ళు. కొండప్ప చేత పండ్లగంపలు తెప్పించుకొంటానులే. జానకీ! నాగు

రేపు వస్తుంది. ఈ సంగతి నీకు తెలుసుననుకొంటాను. ఆమె వచ్చినతరువాత నీకు తోడుగా ఉంటుందిలే. మానాగును చూచినాడంటే మీ నాన్న రోగమంతా మాయమైపోతుంది. పోఅమ్మా పో! ఏదైనా అవసరముంటే గంగినీడు ద్వారా కబురుపంపు. నీవు మాత్రము రోగిని వదలి రాకు.

జానకి మఱేమియు ననలేదు. కృతజ్ఞతా సూచకముగా మంగపతికి నమస్కరించి బరువు లెక్కిన కాళ్ళతో— పరిపరి విధములఁ బరువులిడుచున్న యాలోచనలతో — స్వగృహమునకు మఱలిపోయినది. ఆనాఁడు ఎగుమతి చేయవలసిన సరుకులను సరిచూచుకొనుటకై నాయుడు కలప డొడ్డికిఁ బోయినాఁడు.

౩

ఉదయము ఎనిమిది గంటలైనది. విజయవాడ పట్టణమంతయు మేలుకొన్నది. వచ్చేపొయ్యే ప్రజలతో బజారులన్నియుఁ గిటగిట లాడుచున్నవి. కాఫీహోటళ్ళలో కనకవర్షము సంతతధారగాఁ గురియుచున్నది. కాని ముంగిటనే యున్న బిచ్చగాండ్ర చిప్పలలో నొక్కబిందువైనను పడుటలేదు. రైలుకుఁ బోవుచున్న అమాయిక జానపదులు— ఏదో బండికూత విని— మోయలేని నెత్తిమూటలతో కట్టుకొన్న గుడ్డలు జార— పరుగు పరుగునఁ బోవుచున్నారు. వారినిఁ జూచి గుఱ్ఱపు బండ్లలోఁ బోవుచున్న నవనాగరకులు గొల్లున

నవ్వుచున్నారు. త్రొక్కుడు బండ్లమీఁద బోవుచున్న పోకి ల్లాలు- ముందున్న వారినిఁ గూడఁ జూడకుండ-తప్పుదారినిఁ బోవుచు, అడ్డము వచ్చినారని అమాయిక ప్రజలను అదలించుచు, తెచ్చిపెట్టుకొన్న తెలివియంతయుఁ బెల్లమగునట్లు - " కళ్ళులేని పల్లెటూరి మొగాలురా " యని వెక్కిరించు చున్నారు. ఆ జానపదులతోఁ బాటు మనముగూడ స్టేషనుకుఁ బోవుదము రండు.

విజయవాడ రైలుస్టేషనుచాల పెద్దది అందమైనదికూడ. షుమారు అరమైలు పొడుగు ఉండును. అందులోనే భోజన శాలలు- అల్పాహార శాలలు-పండ్ల దుకాణములు- విశ్రాంతి దుకాణములు- తంతి తపాలా ఆఫీసులు అన్ని విధములైన సౌకర్యములున్నవి. అది పెక్కు రైలుమార్గములకు కూడలి స్థానమగుటచేత వచ్చేబండికి — పొయ్యే బండికి తెంపు వుండదు. ప్రయాణీకు లిరువది నాలుగుగంట లిసుక వైచినను రాలకుందురు.

అదుగో! టిక్కెట్లు ఇచ్చు కిటికీలవద్ద ప్రయాణీకులు గుంపులు గట్టి టిక్కెట్లు తీసుకొనుటలో తమ బలాబలములు తేల్చుకొనుచున్నారు. ఆ త్రొక్కిళ్ళలో సందు గనిపెట్టి జేబులు గొట్టువారు తమ వృత్తికి మెఱుఁగులు దిద్దుకొను చున్నారు. ఎఱ్ఱటోపీలవారు లాఠీలతోను, కొరడాలతోను, ప్రయాణీకులను అదలించు చున్నారు. టిక్కెట్లు తీసుకొన్న వారు మూటముల్లె సర్దుకొని ప్లాటుఫారముల మీఁదికిఁ బోవు చున్నారు. మనముగూడ పోదము రండు.

అది మద్రాసునుండి వాల్తేరుకుఁ బోవు రైలుబండి ఆగుచోటు. ప్రయాణీకులు కొన్నివందల మంది ఉన్నారు. ఇంకను బండివచ్చుటకు గంట కొట్టలేదు, చెక్క వంగ లేదు. ఎవరికివారు తీరికగాఁ గూర్చున్నారు. మనమింక కొంచెము ముందుకు పోదము. అదిగో! ఆ సీటి పంపుకు దగ్గరగా నిల బడియున్న వ్యక్తినిఁ జూడుఁడు. అతఁడే రాజయ్య-మంగపతి రావు మేనల్లుడు. ఈ రోజుననే నాయుడుగారి కూతురుఁడు— నాగమణి- మద్రాసునుండి యీబండిలో వచ్చును గనుక ఆమె కొఱకు కారుతీసుకొని వచ్చినాడు. వెంట పెద్దిరెడ్డి కూడ ఉన్నాఁడు. రాజయ్య వయస్సు ఇరువదిరెండుయేండ్లు. చూపుల కతఁడంతగా నాజూకు. మనిషి గాకపోయినను మొరటు మాత్రము కాఁడు. ఎఱ్ఱని మేనిరంగు-కండపుష్టిగల శరీరము- విశాల ఫాలభాగము - నెత్తురు జీరలుగల పెద్ద కన్నులు-కోరమీసము- అంట గత్తిరించిన తలకట్టు — చిన్న పిలకజుట్టు-చేతులకు బంగారు మురుగులు - చెవులకు ఒంటిరాయి పోగులు- అతని యాకార మాకర్షణీయముగనే యుండును. అతఁడు ముదురు పానములోఁ బడ్డ పనినాగరకుఁడుగాఁడు. కేవల మడుఁగునబడ్డ గ్రామీణుఁడును గాఁడు. పల్లెపట్టణములఁ గూడలి యైనవాఁడు. పాతకొత్తలతనిలోఁ జేరిపోయినవి.

ఏదో గాలికి నేర్చుకొన్నది తప్ప అతని కింగ్లీషు చదువు రాదు. రాకపోవుటే కాదు_అతని కా చదువంటే యెక్కడ లేని తలనొప్పి. అత డాంధ్రమును జక్కగా నభ్యసించి

నాఁడు. భారత భాగవత యుద్ధగ్రంథములను అనర్గళముగాఁ జదివి యర్థము చెప్పఁగలఁడు. తురకముగూడ ధారాళముగా మాట్లాడఁగలఁడు. నాయుఁడు పేటలో నతనిని మించిన పండితుఁడు లేడు. అఁతడు ప్రతిదినము పత్రిక చదువును. ప్రపంచ విషయము లన్నియు నతనికి ముఖస్థములు. నిజము చెప్పవలెనన్న అతఁడు సాటిలేని దేశాభిమాని. పదహారు అణాల ఆంధ్రుఁడు. అతనిభాషలో — వేషములో — తీరులో — అన్నింటిలో — భారతీయతతో మేళవించిన యాంధ్రత్వము తొణుకుచుండును.

దేశాభిమానము గలవాఁడు గనుక రాజయ్య ముదుగు ఖద్దరు ధోవతి ధరించినాడు. దారపు గుండీలు కుట్టిన ఖద్దరు చొక్కా తొడిగినాఁడు. పచ్చని రంగు ముంచిన ముదుగుదుప్పటి పైనఁ గప్పినాఁడు. నాయుఁడు పేటలో కుట్టిన నల్లవాళ్ళ చెప్పులు కాళ్ళకుఁ దొడిగినాఁడు. అతనిలో గాంధి తత్వము కుదురుకొన్నదన్నను అతిశయోక్తి గాదు. నీటి పంపుదగ్గర నిలబడి రాజయ్య పెద్దరెడ్డితో లోకాభిరామాయణము ముచ్చటించుచుండగా రైలుబండికి గంటకొట్టినారు. చెక్క వంగినది. మరికొంచెము సేపటికి బండివచ్చి యాగినది. ఇఁకచూడు. ప్లాటుఫారమంతయు నొక పెద్దతుపాను చెలరేగినది. మహాసముద్రమువలె నల్లకల్లోల మైనది. లోపలనుండి దిగవలసిన వారిని దిగనీయకుండ వెలుపలనున్నవారు వాకిళ్ళు అరికట్టి నెట్టుకొనుచున్నారు. కొందరు—సామానులు లేనివారు కిటికీల గుండ

లోనికి దూరుచున్నారు. మఱికొందరు వాకిటనున్న వారితో కుస్తీపట్టుచున్నారు. ఈ త్రోపులకు నలిగిపోయి చంటిపిల్లలు గోల్లు మనుచున్నారు. కాఫీ—సోడా—చుట్ట బీడి — సిగరెట్ల వారి కేకలు మిన్ను ముట్టుచున్నవి.

ఆ జన సమర్దములో రాజయ్య— పెద్దిరెడ్డి-సంచు చేసికొని తిన్నగా స్త్రీలు కూర్చుండు మూఁడవతరగతి పెట్టె వద్దకు వెళ్ళి చూచినారు. అందులో నాగమణి లేదు. అట నుండి ఇంటరుక్లాసు పెట్టెవద్దకు వెళ్ళినారు. అందులోను ఆమె లేదు. ఇంతలో "హల్లో! రాజూ" అని యెవ్వరో చిరపరిచయులు తన్ను పిలుచుచున్నట్లువిని, తల పైకెత్తి దృష్టిసారించి, చూచినాఁడు. నాలుగైదు పెట్టెల దూరములో—రెండవ తరగతి పెట్టె కిటికీలోనుంచి తొంగిచూచుచు తన్ను బిలుచుచున్న నాగమణి యతనికిఁ గన్పించినది. బ్రతుకుజీవుఁడాయని వారిద్దఱు నా పెట్టెవద్దకు వెళ్ళినారు. మద్రాసునుండి ఆ పెట్టెలోనే తనతోఁ బ్రయాణము చేయుచున్న యువతు లందఱితోను కరస్పర్శచేసి నాగమణి క్రిందికి దిగినది. వెంటనే పెద్దిరెడ్డి పెట్టె లోపలికిఁబోయి సామానులు దింపసాగినాఁడు. అప్పుడొక యువతి మూర్తీభవించిన పాశ్చాత్య నాగరికతతో పెద్దిరెడ్డిని జూచి "ఏమిటి యీ పల్లెటూరికంపు" అని యీసడించుకొన్నది. ఆమాట లతనికి వినఁబడినవి. పెద్దిరెడ్డి జీతగాఁడై నప్పటికి మాట పడువాఁడు గాఁడు. అదిగాక విద్యా బుద్ధులలో—మట్టు [illegible]తో దలలో—రాజయ్య చేతిక్రింద తగినంత శిక్ష పొంది[illegible]టూకుల

అన్ని విధముల గురువునకుఁదగిన శిష్యుఁడు. కాఁబట్టి తన్ను చులకనగా మాట్లాడిన ఆ యువతినిఁ జూచి "అమ్మా! నా వద్ద పల్లెటూరి కంపు ఉన్నదా? ఎంతమాట? ఏ కంపైనప్పటికీ బస్తీవారి వద్దనే ఉండేది. నేను శుభ్రముగా స్నానము చేసి వచ్చినాను. నావద్ద ఏలాటి కంపుకు తావులేదు. పాపము! తెల్లవారులూ ముక్కు తుడుచుకొంటూ నాజూకుగా చీమిడి మూటగట్టిన మీా జేబుగుడ్డల కంపేమో చూచుకోండి" అని గంటెకాల్చి వాతపెట్టినట్లు జవాబు చెప్పినాఁడు

ఆ జవాబుతో నామెకు మరింత కోపము వచ్చినది. వెంటనే వాకలి దగ్గరకువచ్చి నాగమణిఁచూచి "ఎరమ్మా యీా మహాపురుషులు? చాల సరసులేనే! ఈ రోజులలో— చదువు సంధ్యలు లేకపోయినా — ఖద్దరు కట్టిన వారంతా పెద్దమనుష్యులే. ఎందుకూ కొరగాని ప్రతివాడికీ ఇదొకటి దొరికింది ప్రపంచాన్ని మోసంచెయ్యడానికి?" అని ఏమేమో అన్నది.

ఆమాటలు రాజయ్య గుండెలో నలుగులవలె గ్రుచ్చుకొన్నవి. కాని యతఁడు పెద్దిరెడ్డివలెఁ దొందరపడి కోపగించుకొనఁడు. అతనికున్న సహనశక్తి సామాన్యుల కతీతమనియే చెప్పవచ్చును. అందువల్ల నెంతో శాంతభావముతో "అమ్మా! నీవన్నమాట నిజము. ఖద్దరు గట్టినవారంతా పెద్దమనుష్యులు గారు. నిజమైన తన జాతీయతను జంపుకొని కల్లకుండ మెరుఁగు దిద్ది– నవనాగరికత పేర గంటకొక వేషము ఏజాతికి చెందినదీ తెలుసుకో లేనంతగా అంధాను చున్నారు.

కరణము చేస్తూ — పరవేష భాషాదాస్యమునకు హారతిపట్టు మీబోటి వారంతా చదువుకొన్నవారునూ కారు. తన సంప్రదాయమునూ—తన జాతినీ—తన దేశమునూ—గుర్తింప లేని చదువెందుకు? మీరందరు పవిత్ర భారత స్త్రీ జాతికి చెందినవారై—వీరమాతలై— దేశ సేవకులను గన్నప్పుడే మీజన్మ సార్థకమవుతుంది. మీరెల్లరూ జిజియాబాయి వంటి దేశమాత లైనప్పుడే భారత జనని సంతోషిస్తుంది " అని సమాధానము చెప్పుసరి కాయువతియేగాక తక్కిన యువతులును సిగ్గుతోఁ దలలు వంచిరి.

రాజ్యాయ సమాధానమునకు నాగమణికూడ సిగ్గుపడినది. అప్పటి ఆమె వేషమునందు పాశ్చాత్య నాగరికత యుట్టిపడుచున్నది. శిరోజములు నడిమికి రెండు పాయలుగా విడదీసి—వదులుగా సగమువరకు మాత్రమే జడలల్లి—రంగురంగుల సిల్కు రిబ్బన్లుగట్టి— వదలినది. పెదవులకు ఎఱ్ఱరంగు అద్దినది. మొగమునిండ తెల్లని మెఱుఁగు పూతలు పూసినది. నల్లని చారలుగల సిల్కుషర్టు— వదులుగానున్న లాగు తొడిగినది. పైన సన్నని జరీగీరలు మైజారు కప్పుకొన్నది. పాదములకు నగిషీపని చేసిన కాన్పూరు చెప్పులు తొడిగినది. ఆ వేషమునుబట్టి ఆమె ఏజాతికిఁ జెందిన యువతియో చెప్పలేము. కాని మాట్లాడు భాషనుబట్టి మాత్రము తెలుఁగు యువతియని గ్రహింపవచ్చును.

ఆ బక్కపలుచని శరీరము — పటకా బిగింపుతో మిక్కిలి సన్నగిలియున్న యా నడుము — అచివురుటాకుల

చెక్కిళ్ళు—బాదముకాయవలె సోగలైన యా కన్నులు—కోలయు, గుండ్రముకాని యాస్నిగ్ధవదన మండలము—వంపులు వంపులుగా పైకి ఎగదువ్విన తలకట్టు — ఆ లేత గులాబి యరచేతులు- ఆమె సౌందర్యవతియని, సుకుమారి యని చాటుచున్నవి. జానపదుల యింటి బిడ్డయని తెలియని వారెవ్వరు నామెను గూర్చి యనుకోరు.

ఇద్దఱు రైల్వేకూలీల సహాయముతో పెద్దిరెడ్డి సామానులన్నియుఁ దీసుకొనిపోయి కారులో పెట్టివచ్చినాఁడు. అంతలో బండి బయలుదేరు గంటగూడ మోగినది. నాగమణి తోడియువతులందఱి వద్దను సెలవు పుచ్చుకొన్నది. వారు ముగ్గురు బయలుదేఱి - వంతెనదాటి — కారులో నెక్కి— గవర్నరుపేటలోనున్న రాజయ్య బావగారి యింటికిఁ బోయినారు.

రాజయ్య బావ విజయవాడ మునిసిపాలిటీలో నొక చిన్న యుద్యోగి. ఏదో కొద్ది జీతము. అయినప్పటికి ఉన్నంతతోనే యింత పరువుగా బ్రతుకుచున్నాఁడు. గౌరవ మర్యాదలు తెలిసినవాఁడు. ఆయన కాపురమున్న యిల్లు చిన్నదైనప్పటికి రాజయ్య యిష్టప్రకారము నాగమణి కొఱకు ఒకగది ఖాళీచేసి యిచ్చినాఁడు. పెద్దిరెడ్డి సామానులన్నియుఁ దీసికొని యాగదిలో సర్దినాఁడు. ఆ వసతికి నాగమణి కూడ తృప్తిపడినది. రాజయ్య అక్కగారువచ్చి ఆమెను తగిన రీతిగా నాదరించినది.

పదకొండు గంటలు కొట్టునప్పటికి భోజనాదికము లన్నియు ముగిసినవి. రాజయ్య ఒక కుర్చీలోఁ గూర్చుండి పత్రిక చదువుకొనుచున్నాఁడు. నాగమణి తన పెట్టెఁ దెఱచి సామానులు సర్దుకొనుచున్నది. పెద్దిరెడ్డి గదిముందు వసారాలో పండుకొన్నాఁడు. గృహ యజమాని ఆఫీసుకు వెళ్ళినాఁడు.

రాజయ్య కొంతసేపటికి పత్రికాపఠనము ముగించి— తన కెదురుగా మఱొక కుర్చీలోఁ గూర్చుండి యేదో పుస్తకములోని పుటలు త్రిప్పుచున్న నాగమణిఁ జూచి– "నాగూ! రాత్రి తెల్లవారులూ నిద్ర లేదేమో? కొంచెము సేపు పండుకోరాదూ?" అని అన్నాఁడు.

నాగ:– రాత్రి బాగానే నిద్రపోయాను. పగటి నిద్ర నాకల వాటు లేదు. సరేకాని రాజూ! ఇందాక ఆ యువతితో అంత కటువుగా మాట్లాడావే పాపము! ఆమె యెంత నొచ్చుకున్నదో?

రాజ:– నొచ్చుకుంటే నాకేమి? నిజ మాడుటకు నేనెన్నడూ జంకను.

నాగ:– అయితే గుణముకంటె వేషమే ప్రధాన మందువా?

రాజ:– అనను. నా అభిప్రాయములో రెండూ ప్రధానములే. వేషము బాహ్యము. గుణము ఆంతరంగికము. ఈ రెండునూ అవినాభావ సంబంధము గలవి–గుణవంతుఁ డెప్పుడూ బాహ్యమును మఱచిపోడు.

నాగ:– మఱచినందువల్ల కష్టమేమున్నది?

రాజ:- కష్టము లేదేమో కాని నష్టము మాత్రమున్నది. వేషము జాతీయతకు ముఖ్యమైన చిహ్నము. దానిని నీవు విసర్జించినప్పుడు నీజాతిని గూడ విసర్జించినట్లే. నీయందు జాత్యభిమానము - దేశాభిమానము - చచ్చిపోయినట్లే. అందుకనే మన పెద్దలు ప్రతి వ్యక్తికి జుట్టు - బొట్టు - కట్టు - అవసర మన్నారు. వీనిని బట్టి ఆయా వ్యక్తులు ఏజాతికి చెందినవారో మనము తెలుసుకో వచ్చును.

నాగ:- భాషను బట్టి తెలుసుకోవచ్చును గదా? వేషము మారిన నేమి?

రాజ:- అట్లు కాదు నాగూ! అమెరికా వారు - ఇంగ్లాండు వారు - ఆస్ట్రేలియా వారు - ఒకే భాష మాట్లాడుచున్నారు. కాని భిన్న జాతులుగనే పరిగణింపబడుచున్నారు. ఎవరి జాతీయత వారిదే. ఎవరి విశిష్టత వారిదే. ఒక్కమాట విను. నీ వేషమును నీ సంప్రదాయమును నీవు ప్రేమింపలేనప్పుడు నీజాతిని ప్రేమింపలేవు. జాతిని ప్రేమించలేనప్పుడు దేశాన్ని ప్రేమించలేవు. దేశాభిమాన సౌధానికి వేషము - సాంప్రదాయము - జాతి - అనేవి సోపానముల వంటివి. ఈ సోపానములను గాదని నీవా సౌధాన్ని అధిరోహింపజాలవు. నాగూ! గంటకొక వేషము వేసే పాడుబుద్ధి మనలో ఉన్నది కాని పాశ్చాత్యులలో లేదు. ప్రపంచములో ఏ మూలకు పోయినా వారి భాష కాని వేషము

కాని - యే మాత్రము మారదు. ఈనాడు మన దేశములో ఎంతోమంది తెల్లవారు బ్రతుకుచున్నారే. మచ్చునకొక్కరైన వేషము మార్చినవారున్నారేమో చెప్పు. వారిని చూచియైనా మనము నేర్చుకోవద్దూ? ఈ పాడు వ్యామోహము మనకేల?

నాగ:— అసలు నీకు ఇంగ్లీషు అంటేనే పనికిరాదు. ఈ నవనాగరిక వేషాలు నీకేలా నచ్చుతవి? నీసిద్ధాంతాలన్నీ మంచివి కావచ్చునేమో కాని యీ కాలానికి మాత్రము నచ్చవు. నీ వొక బి. సి. నాటి మనిషివి బావా!

రాజ:— అదిగో! ఆ భాషాదాస్యమే వద్దంటాను. నాకు ఏభాష మీదనూ కోపము లేదు. నీ యిష్టము వచ్చినన్ని భాషలు నేర్చుకో. కాదనను. కాని ఉగ్గుతో అలవడిన నీ భాషను మాత్రము మఱచిపోకు. తృణీకరించకు. అగౌరవించకు. నీ మాతృభాషలో మాట్లాడుట అవమానకరమని అనుకోకు. పరభాషలు నేర్చుకొనుట జ్ఞానాభివృద్ధికిగాని నీ భాష నీవు మఱచిపోవుటకు గాదు. నీ భాషను నీవు అభిమానించాలి. నీ వేషమును నీవు ప్రేమించాలి. నీ సంప్రదాయాన్ని నీవు మన్నించాలి. నీ జాతిని నీవు గౌరవించాలి. నీ వ్యక్తిత్వాన్ని నీవు కాపాడుకోవాలి. అంతేకాని పొరుగింటి పుల్లకూర రుచి అని మోజుపడరాదు. ఇద్దరు తెలుగువారు కలుసుకొన్నప్పుడు వచ్చీరాని ఇంగ్లీషులో మాట్లాడుకోవలసిన పనేము

న్నది? తమ సొంతభాషలో మాట్లాడుకోంటే తప్పా? అగౌరవమా? ఒక తెలుగువాడు — తెలుగువారి సభలో ఇంగ్లీషులో ఉపన్యసించవలసిన దుర్గతియేల? ఇదంతా తెచ్చిపెట్టుకొన్న వ్యామోహము కాదూ? నాగూ! మన భాషను మనమే గౌరవించకపోతే యితరులు గౌరవిస్తారా? ఈ పరభాషా దాస్యము ఎంత త్వరగా తొలగితే అంత త్వరగా మన జాతి బాగుపడుతుంది. నా మాటలు మనవారికి నచ్చనీ- నచ్చకపోనీ- ఇది నా సిద్ధాంతము.

రాజయ్య చెప్పినదంతయు వినుసరికి నాగమణి హృదయములో నొకవిధమైన మార్పుగలిగినది. ఒక్కసారి తన్ను తాను ఆత్మపరీక్ష చేసుకొన్నది. ప్రొద్దుటి తన వేషమును జ్ఞప్తికి దెచ్చుకొని సిగ్గుబరువుతో కుంగిపోయినది. అతని సిద్ధాంతము ఆమెకు నచ్చినది. ఆమె మరల సంభాషణను సాగించింది.

నాగ:— నీవు చెప్పినది నిజము రాజూ! నీ సిద్ధాంతముతో నే నేకీభవిస్తున్నాను. నీ వద్ద నేర్చుకోవలసిన విషయాలు చాలా ఉన్నవి. ఈ విషయాన్ని ఇంతటితో కట్టిపెట్టి మన యూరి విశేషాలేమో చెప్పు. అందరూ కులాసాగా ఉన్నారా?

రాజు:— ఆ! మన తోటమాలి సింగయ్యకు మాత్రము సుస్తీగా ఉన్నది.

నాగ:- ప్రియూరాద మేమియూ లేదుక దా? పాపము! జానకి ఒక్కతే కాబోలు!

రాజ:- అవును. ఆమెకు ఏమి తెవర్వరు తోడున్నారు?

నాగ:- ఇంతకూ మందెవరైనా యున్నారా? పాడు పల్లె టూరు. ఒక్క డాక్టరైనా ఉండడు.

రాజ:- ఇప్పుడాలోపము లేదు నాగూ! ఇటీవలనే మన పేటకు ఒక డాక్టరు వచ్చి వైద్యము చేస్తున్నాడు. ఆయన గట్టివాడనే అంటారు. నాకింకా ఆయనతో తగినంత పరిచయము కలుగలేదు. ఆయన తఱచు ఊళ్ళో ఉండడు.

నాగ:- సింగయ్యకు ఆయన మందిస్తున్నాడా?

రాజ:- లేదు. ఆయన ఊళ్ళోలేక పది రోజులయినది. ఏవో పల్లెటూరి కుప్పెమందులే అరగదీసి పోస్తున్నారు.

నాగ:- కోటలోని విశేషాలేమి?

రాజ:- ఏమున్నవి? మన జమీందారిణి - రూపలతా దేవి - వచ్చి దాదాపు నెల అయినది.

నాగ:- మీ భాషామందిరము చక్కగా సాగుతున్నదా?

రాజ:- ఫరవాలేదు. పరుగులెత్తక పోయినప్పటికీ కుంటి నడక మాత్రము లేదు. రాత్రిపాఠశాల కూడా చక్కగా పని చేస్తున్నది.

ఈ విధముగా వారు మాట్లాడుకొనుచుండగా గడి యారములో రెండు గంటలు మ్రోగినవి. వెంటనే రాజయ్య ప్రసంగము నాపి లేచి - ప్రయాణమునకు సిద్ధము గమ్మని

నాగమణిని హెచ్చరించి - వసారాలోనికి వచ్చి పెద్దన్నను లేపి - ఏదో పనిమీదఁ తాను బజారుకు వెళ్లినాఁడు. పెద్దన్న లేచిపోయి కారుడ్రైవరును తొందరించినాఁడు. అతఁడు చప్పున కాఫీ త్రాగి వచ్చి కారును సిద్ధము చేసినాఁడు. సామానులన్నియు కారులోనికిఁ జేర్పఁబడినవి.

అదేమి కారణమోకాని నాగమణి తన వేషము మార్చినది. మధ్యపాపట తీసి - చక్కఁగా తలదువ్వుకొని - వ్రేలాడు జడ వేసినది. చెవులకు రవ్వల కమ్మలతోఁబాటు పెట్టుకొన్నది. చేతులకు బంగారు గాజులతోఁబాటు రంగురంగుల రబ్బరుగాజులు తొడిగినది. వెడల్పు అంచులు - సన్నని జరీ గీరలు - గల స్వదేశీ నేతచీర ధరించినది. మల్లెమొగ్గలు నేసి కుట్టిన గుత్తపుచేతుల జాకెట్టు తొడిగినది. మొగమున నొసట బేడకాసు వెడల్పుగల కుంకుమబొట్టు పెట్టుకొన్నది. ఆ వేషములో నామె యందము మఱింత శోభించినది.

రాజయ్య బజారునుండి యేవో వస్తువులు తీసికొని తిరిగి వచ్చి - వాఁకిట మూర్తీభవించిన రమారామణీయకమువలె నిలఁబడియున్న మఱదలిని జూచి - యామె వేషమునకు విస్తుపడి "నాగూ! ఇదేమిటి?" అని అన్నాఁడు.

నాగ:- ఏమున్నది? పొద్దున - ఇందాక - నీవు చెప్పిన దాని సారాంశము.

రాజు:- బాగు బాగు. నీ విప్పుడు నిజముగా తెలుగు లక్ష్మి వలె ఉన్నావు. నా సిద్ధాంతము ఒక వ్యక్తి ద్వారానైనా ఆచరణలోనికి వచ్చినది.

నాగమణి మరేమియు మాట్లాడక మందహాసముతో రాజయ్యవంక జూచినది. ఆ చూపులో ఒకవిధమైన మధుర మోహన మంజులానురాగము తొణికినది. వారిద్దఱు లోనికి వెళ్ళి యా గేస్తురాలికి సమస్కరించి - యామె యాశీర్వాద మును బొంది - సెలవు గైకొనిరి. పిల్లలకని అక్కగారికి రాజయ్య కొన్ని మిఠాయి పొట్లము లిచ్చెను. తరువాత ఆమె వీధి వాఁకిలి వఱకు సాగనంపగా రాజయ్య-నాగమణి-ప్రయాణమైవచ్చి కారులో నెక్కిరి. పెద్దిరెడ్డి డ్రైవరు ప్రక్కనఁ గూర్చుండెను.

కారు బయలుదేఱినది. జనసమ్మర్దముతో నిండిన విజయవాడ పట్టణమును దాటి మహావేగముతోఁ బోసాగినది. దారిపొడుగునఁ గల వింతలను, క్రొత్తగాఁగట్టిన వంతెనలను, చలివేంద్రలను, జూచుచు వారందఱు నాఁటి సాయంకాల మూఁడుగంటలకు సుఖముగా నాయుడు పేట చేరిరి.

౪

నాగమణి నాయుడుపేటకు వచ్చి ఒక వారమైనది. ఇన్నిరోజులనుండి రాజయ్యకు తీరికలేదు. రేయింబవలు జానకితోఁగూడి సింగయ్యకు ఉపచారములు చేయుటతోనే అతనికి సరిపోతున్నది. ఆతఁడొక గడియసేపు కన్పడకున్న సింగయ్య అతనికోసము కలవరించుచుండును. అందుకని రాజయ్య మేనమామ యింటికి భోజనమునకుఁ గూడఁ బోకుండ అచ్చటనే తినుచుండెను. ప్రతిదినము నాగమణి వచ్చి చూచిపోవుచుండెను. జానకిని తన సొంత చెల్లెలివలెఁ

బేశిమించిన దగుటచేత నామె కష్టములోఁ దానుగూడ పాలు పంచుకొనుచుండును. మంగపతిరావు సింగరసుబ్బారావ శాస్త్రులు మధుసూదనరావు రెండు రోజులనుండి సింగయ్యను చూచివచ్చుచుండెను.

రోజులు జరుగుచున్నవే కాని ఆతని వ్యాధి తిరుగు ముఖమునకు రాలేదు. అతఁడు బాగుగా క్షీణించి పోయినాఁడు. కంఠస్వరముగూడ తగ్గఁజొచ్చినది. మంచములోనుండి పక్క లేవదీయ వలసినదేగాని అతనికై యతఁడు లేవలేఁడు. ఎక్కువగా మాట్లాడలేఁడు. నాయుడుగూడ అప్పుడప్పుడువచ్చి చూచిపోవుచుండెను. తన తండ్రిస్థితిఁ జూచినకొలఁది జానకి దుఃఖము పుక్కిలింత లగుచుండెను. ఆతండ్రి తప్ప—ఈవిశాల ప్రపంచములో నామెకుఁ గావలసినవారు మఱెవ్వరు లేరు. తనస్థితి యేమికానున్నదో యని యామె భయపడుచు లోలోపలఁ కుమిలిపోవుచుండెను. ఆమె నోదార్చు వారెవ్వరు?

ఉన్నట్లుండి ఒకనాఁటి వేకువజామున — అది సాగ లక్షణమో యేమో చెప్పలేము కాని — సింగయ్య తనను తానే చివాలున లేచి కూర్చుండి — 'రాజయ్యా' అని పిలిచి నాఁడు. మంచము దగ్గఱనే కలఁత నిద్రతో కునుకుచున్న రాజయ్య అదరిపడి లేచి—సింగయ్యను పడుండఁబెట్టి—"ఏమిటి మామా!" అన్నాడు. అంతలోనే ఆ గదిలో నొకమూల నిద్రించుచున్న జానకికూడా ఉలికిపడి లేచి మంచము దాపునకు వచ్చి—గుడ్లనీరు గ్రుక్కుకొనుచు—తండ్రిదిక్కు మొగమై నిలబడినది. అప్పుడు సింగయ్య ఒక విపరీతమైన ధోరణిలోఁ ప్రసంగింప సాగినాఁడు.

సింగ:- రాజయ్యా! మీకు వట్టి శ్రమతప్ప నారోగము నయమయ్యేదికాదు. ఈసంగతి నాకు బాగా తెలుసు. నాకు కాలము సమీపించినది. ఇక నేనెంతో సేపు బ్రతుకను. రేపో మాపో నాహంస లేచిపోతుంది. నాచావుకై నేను దిగులు పడటంలేదు. నా బిడ్డ కొరకే నేను బాధపడుతున్నాను. ఇది తల్లి లేని పిల్ల. ఎంతో ప్రేమతో పెంచాను. పెద్దదాన్ని చేశాను. ఈ జన్మలో దానికి నేనూ- నాకు అదీ- దిక్కు కాని మరెవ్వరూ మాకు దిక్కులేదు. ఆకాస్తమాట నాకు దక్కే యోగములేదు. చిన్నదాన్ని ఒక యింటిదాన్ని చేసి నా బరువు దించుకొందామని అనుకొన్నాను. గాని నాకా భాగ్యము దక్కలేదు. పాడురోగము ఇంతలోనే ముంచుక వచ్చినది. ఇంక నేను చేసేది యేమీలేదు. నేను ఈ దిగులుతోనే చచ్చిపోతున్నాను. నా మనస్సుకు ఊరటలేదు. రాజయ్యా! నేను పోయిన తరువాత నైనా సరే నా మనస్సుకు శాంతి కలిగించే భారము నీది. నిజము చెపుతున్నాను విను. జానకి నిన్ను మనసారా ప్రేమించినది. ఈ సంగతి నీకు తెలుసునో తెలియదో కాని దాని మాటలను బట్టి నేను తెలుసుకొన్నాను. నీవంటే దానికి దేవుడన్నమాట. దాని బుద్ధి యెటువంటిదో చిన్నప్పటినుంచీ నీకు తెలుసు. నీ చేతిక్రిందనే వ్రాయను చదవను — నేర్చుకొన్నది. తెలివితేటలు

అని సింగయ్య శోషవచ్చినట్లు స్మృతిదప్పి కన్నులు మూసినాఁడు. రాజయ్య, తన దృష్టిని మఱల్చి ఒక్కసారి జానకి ముఖమువంకఁ జూచినాఁడు. ఆమె చూపులలో నిరాశా దైన్యములు తొంగికిస లాడుచున్నవి. ఆమె మూర్తిలో మాత్రము ఒక యనిర్వచనీయమైన మధుర మోహనముగ్ధ ప్రేమ ప్రస్ఫుటమగు చున్నట్లుండెను. అతఁడు నేఁటివఱకు–ఎంత కలిసిమెలిసి తిరుగుచున్నను – జానకీ హృదయ కావ్యమును తెఱచి చూడలేదు.

నిరాశా నిస్పృహాలలో జానకి ముఖమును వెలవెలఁ బాఱినట్లు దిక్కులన్నియు దెల్లవాఱినవి. ఎడతెగని యేడ్పు చేత నామెకన్ను లెఱుపులెక్కినట్లు తూరుపు దిక్కు అరుణ రేఖలతో నెఱ్ఱవాఱినది. ఆమె భవిష్యజ్జీవితము నిరంతర పరిగాఢవిచారజ్వాలనశిఖాతప్త మగుననన్నట్లు గ్రీష్మ భానుని కవోష్ణ కిరణములు— తరుపత్రముల నుండి యప్పుడే తొంగి చూడ సాగినవి.

సింగయ్య కింకను స్మృతి కలుగలేదు. జ్వరము తీవ్రముగానున్నది. జానకి తండ్రి మంచమును వదలి రాలేదు. వారి యింటి ప్రక్కనేఉన్న కౌలుదారు —గంగినీడు ఎట్లున్నదో తెలిసికొందమని రాగా రాజయ్య అతనిద్వారా నాయుడు గారికి కబురు పంపినాఁడు. రాత్రి వారికిఁ దోడుగా అచ్చటనే పండుకొన్న కలపకోత మేస్త్రి – కొండప్ప – డాక్టరు కోసము వెళ్ళినాడు.

రాజయ్య కేమియుఁ దోచుట లేదు. వేదనామయముగ సింగయ్య చెప్పిన సంగతులు అతని హృదయమును గ్రుచ్చి వైచుచున్నవి. ఆ తుదిమాటలు అతని చెవిలో మారు మ్రోగుచున్నవి. జానకి తన్ను మనసార ప్రేమించినదన్న సంగతి రాజయ్యకు నిజముగాఁ దెలియదు. అతనికి — ఆమె పట్ల — అట్టి వాంఛ లేకపోవుటయే యిందుకుఁ బ్రధాన కారణము. అతఁడామెను పవిత్ర హృదయముతో ఒక స్నేహితునివలెఁ బ్రేమించినాఁడు. అట్టి దృష్టితోనే గౌరవించినాఁడు. నేఁడతనికి సింగయ్య తెలిపిన వార్త దిగ్భ్రమ గలిగించినది. ఈ సమస్య నెట్లు పరిష్కరింప వలెనో — ఇఁక ముందు జానకితో నెట్లు సంచరింప వలెనో — అతనికిఁ దోచుట లేదు.

అంతలో నాగమణి- ఆమె తండ్రి-ఆస్పత్రికి వచ్చిరి. మఱికొంతసేపటికి డాక్టరు కూడ వచ్చినాఁడు. ఆయన రాజయ్యతోఁ గలసి లోపలికి వెళ్ళి — రోగిని పరీక్షించి చూచి — పెదవి విఱచినాఁడు. లాభము లేదన్నట్లు ఆయన చూపులే చెప్పుచున్నవి. జానకి గొల్లుమన్నది. నాగమణి కూడఁ గన్నుల నీరు పెట్టుకొని - ఆమెను ఓదార్పఁ జొచ్చినది. సింగయ్యకు స్మృతి గలిగినది కాని మాట మాత్రము పడిపోయినది. అంతకంతకు ఆయాసము హెచ్చినది. ఆశ లేక పోయినప్పటికి డాక్టరు ఏదో మందు పోసి - నాయుడు గారితో కలిసి బయటికి వచ్చినాఁడు. వారిద్దఱు మాట్లాడు కొనుచు ముందుకుఁ బోసాగిరి.

నాయు: అయితే లాభము లేదంటారా ?

డాక్ట:- ఆశకూడా లేదు. ఎక్కువ కాలము బ్రదుకదు. బహుశా మాపటి లోపే.

నాయు: పాపము ! ఆ పిల్లకు దిక్కెవ్వరు ?

డాక్ట:- మరెవ్వరూ తోబుట్టువులు లేరా ?

నాయు: లేరండీ! ఆమె తల్లిచావుపిల్ల. ఏదో కష్టపడి పెంచాడు. పెద్ద చేశాడు. ఇంకా పెండ్లి కాలేదు. ఆమె వ్రాత ఏలా వున్నదో ?

డాక్ట:- ఆమె నోదారుస్తున్న ఆయువతి యెవరు? ఆమె అక్కగారు కాదూ ?

నాయు: కాదండీ! ఆ అమ్మాయి నా కుమార్తె. మొన్ననే మద్రాసునుండి వచ్చినది.

డాక్ట:- మీ అల్లుడుగారుకూడా వచ్చినాడా? ఆయన కేమి ఉద్యోగమండీ ?

నాయు: మా అమ్మాయికి ఇంకా పెండ్లి కాలేదు. మొన్న మార్చి నెలలో బి. ఏ. పరీక్ష పూర్తిఅయింది. ఇంకను పెండ్లి సంగతి......

డాక్టరు మరేమియు మాట్లాడలేదు. సెలవు పుచ్చుకొని వెళ్ళిపోయినాడు. "మీ అల్లుడుగారు కూడా వచ్చినాడా" ఆయన కేమి ఉద్యోగమండీ? " అని డాక్టరు అన్న మాటలు నాయుడుగారి చెవిలో మాఱుమ్రోగఁ జొచ్చినవి.

నాగమణి ఆపూట యింటికిఁ బోలేదు. జానకికిఁ దోడుగా అచ్చటనే యున్నది. గంగినీడు భార్యవచ్చి వంట

సార్థక నామము మాత్రముగాదు. దానిచుట్టును ఏ జెనిమిది గజముల యెత్తుగల మట్టి ప్రహరీ యున్నది. అది అచ్చటచ్చటఁ గొంతవఱకు శిథిలమైనది. ఆ ప్రహరీకి ముందు వైపున వెనుక వైపున రెండు సింహద్వారములున్నవి. ముందువైపు ద్వారము పురుషులకును వెనుకవైపు ద్వారము స్త్రీలకును — ఉపయోగపడు చుండును. వెనుకవైపు ద్వారమునానుకొని పూలతోటయున్నది. కోటలోని స్త్రీలు తోఁటలోనికిఁ బోవుటకది యే మార్గము. అది పురుషసంచారమంతగా లేని రహస్యద్వారము.

ఆ సౌధములో మూఁడంతస్తులున్నవి. ఒక్కొక్క యంతస్తులోఁ బెక్కు గదులున్నవి. క్రింది యంతస్తులోని గదులు జమీా వ్యవహారముల కుపయోగ పడు చుండును. రెండవ యంతస్తులో జమీాందారిణి పరిచారిక లుండురు. మూఁడవ యంతస్తులో జమీాందారిణి యుండును. ఒక యంతస్తు నుండి మఱియొక యంతస్తుకేగాక మూఁడవ యంతస్తునుండి సరాసరి క్రిందికి దిగుటకును మెట్లున్నవి. ఈ మార్గమున జమీాందారిణి— ఆమె పరిచారికలు— తప్ప పురుషులెవ్వరును సంచరింపరు.

ఒకనాఁడు — పగటి భోజనములైన తరువాత — మూఁడవ యంతస్తులోని యొక విశాల సుందర మందిరములో — మెత్తని పట్టు సోఫామీాఁద దిండు నానుకొని ఒయ్యారముగాఁ గూర్చుండి — జమీాందారిణి, రూపలతాదేవి — తాంబూలము సేవించు చున్నది. ఎదురుగాఁ

గూర్చుండి పున్నమ్మ ఆకులుచుట్టి యిచ్చుచున్నది. [illegible] లతాదేవి ఇరువదేండ్లు దాటిన ప్రాయముగలది. పసిమి మేని వన్నె శరీరము—మలచి నట్లున్న అవయవ నిర్మాణము- [illegible] ముంగురులు పూఁతలతో మిసమిస లాడుచున్న గుండ్రని ముఖము—సూటిగానున్న నాసిక- సన్నని కాటుకరేఖలుగల కన్నులు- దిద్ది తీర్చినట్లున్న భ్రూయుగ్మము— కంచుకమును బిగించుటచే తప్పించుకొనఁజూచు గురుకుచద్వయి కొంచెము స్థూలముగా నున్న నడుము— ఆమె సౌందర్యవతి యనిపించు చున్నవి. తలకట్టు మాత్రము ఆ సౌందర్యమునకుఁ దగిన నట్లుగా లేదు.

ఆమె మెడలో ఒంటిపేట ముత్యాలహారము మెఱయు చున్నది. చెవులకు రవ్వల కమ్మలున్నవి. చేతులకు నవరత్నములు [illegible] పొదిగిన పసిడిగాజులతోఁ గూడ రెండురంగుల రవ్వల గాజు లున్నవి. ఎడమచేతి అనామికకు - కనిష్ఠకును ధగధగ మెఱయుచున్న రాళ్ళ యుంగరము లున్నవి. కుడిచేతి నడిమి వ్రేలికి ఒక ముద్దుటుంగరమున్నది.

ఆమె సౌందర్యములో—నిసర్గ మాధుర్యము కంటె కృత్రిమ శోభ యెక్కువగా నున్నది. ఆమె మాటలలో పరిష్కృత కంటె నాకర్షణ శక్తియే పరిస్ఫుట మగుచున్నది. ఆమె వ్యక్తిత్వములోఁ గులీనతకంటె స్వేచ్ఛా ప్రవృత్తియే ముందంజ వేయుచున్నది. ఆమె వేష ధారణములో సినిమా పోకడలు షికారు చేయుచున్నది. ఒక్క-మాటలోఁ జెప్పవలెనన్న—ఆమె యీనాఁటి నాగరకతకుఁ బట్టుగొమ్మ.

పున్న:-ఆమె తండ్రిచనిపోయి నెలరోజులైనా కాలేదు. పుట్టెడు దుఃఖములో మునిగిఉన్న ఆ పిల్లతో నేనీ సంగతి యేమని ముచ్చటించేది ?

రూప:-అయ్యో! పాపము! ఎంత అన్యాయము జరిగింది? సరే. ప్రస్తుతానికి మానుకో.

పున్న:-మానుకోనే దానికంటే ఒకపని చేద్దామని ఉంది. ఏదో ఆదరించటానికి పోయినట్లుగా పోయి కొంత సొమ్ము ఇచ్చివేస్తే...

రూప:-బాగానే ఉంటుంది. కాని తీసుకొంటుందా ?

పున్న:-అదీ అనుమానమే.

రూప:-ఈ రోజుల్లో అంత భీష్మించటానికి ఆమెకు ఆధార మేమిటి ?

పున్న:- వేరే ఆధారమేమీ లేదు. అయ్య సంపాదించి యిచ్చింది అంతకన్నా లేదు. నా అనేవాళ్ళు అసలే లేరు. ఆమెకున్న ఆధారమంతా ఒక్క రాజయ్య. అతనిమీదనే ఆపిల్ల ప్రేమ అంతా ఒలికి పోతున్నది.

రూప:-ఎవరే ఆ రాజయ్య ?

పున్న:-మన నాయుడుగారి మేనల్లుడు. మొన్న మీరుకూడా చూచారు. నాగులదిబ్బ దగ్గర-ఆ చిన్నగుట్ట మలుపు డొంకలో-మన కారును పోనీకుండా తన లారీని అడ్డు పెట్టి - మన డ్రైవరును, మనలను ధిక్కరించి-పలికి నాడే- ఆ మహాపురుషుడే. చివరకు మీమాట కూడా

లెక్క చేయక పోతే మనకారు వెనక్కి తిప్పుకొని వచ్చాము. జ్ఞాపకము లేదా?

రూప:-అవునే గుర్తుకువచ్చింది. అతడను చాలా స్వాతంత్ర్యుడనుకొంటాను.

పున్న:-ఆమాట నిజమన్నా! ఆయన చాలా నిక్కచ్చి మనిషి. ఒకరి దయా ధర్మాలకు దేబిరించేవాడు కాదు. ఎంత గొప్ప వార్నైనా సరే తప్పులుంటే ఖండిస్తాడు. ఆయన దంతా గాంధీగారి తత్త్వము. ఆయన నడుపుతూవున్న భాషామందిరానికి పోతే ఆయన తత్వమేమిటో చక్కగా బోధపడుతుంది. జానకి అక్షరాలా అతనికి శిష్యురాలు.

రూప: సరే ఇంకెందుకు? గురువుగారికి – శిష్యురాలికి – జత కుదిరిందన్న మాట.

పున్న:-ఎబ్బే! అదీ లేదు. అతను జానకిని ప్రేమించటం లేదు. ఈజత కుదిరేది కాదు. అతని దృష్టి అంగలూరు సోమయాజులు గారి కూతురు – నాగమణిమీద ఉంది. సోమయాజులు గారు కూడా పిల్లనివ్వటానికి ఒప్పుకొన్నారట. పిల్ల కూడా చేసుకోటానికి (తండ్రి మాటమీద) ఒప్పుకొన్నదట. కొద్దిరోజుల్లో ప్రథానము కూడా జరుగుతుందని విన్నాను.

రూప:-రాజయ్య ఎంత వఱకు చదివాడు?

పున్న:-కొంతవఱకు, నేనెంతో ఆయన అంతే. అసలతను ఈ కాలపు మనిషే కాదు. ఏ రామాయణ కాలము

లోనో పుట్టవలసినవాడు. నిజానికి అంత చదువు చది
విన నాగమణికి ఈ పురాతనపు మనిషి తగడు.
ఏమైనా అందమా? చందమా? మోకాలు క్రిందికి
దిగని ముతక పంచకట్టుతో — ఎన్నడూ ఇస్త్రీ పెట్టె
మొగమే ఎఱుగని ఒక బొంత చొక్కాతో— గొంగడి
వంటి ఒక దుప్పటితో — తయారవుతాడు ప్రతి
చోటికీ. మొన్న చూచారుగా ఆ వేషము? పాపము!
నాయుడుగారి భార్యకు ఈసంబంధము ఇష్టమే లేదట.

రూప:—సరే కాని నాగమణిని చూడాలనిపిస్తున్నది. ఆమెతో
నైనా కొంత కాలక్షేపము చేస్తాను. మద్రాసునుండి
వచ్చినప్పటినుండి నాకు ప్రొద్దుపోవుటలేదు. ఇక్క-
డేమున్నా సినిమాలా? నాటకాలా? పాటకచేరీలా?
వినోదాలా? ఏమీ లేదు. పాడుపల్లెటూరు. ఎప్పు
డన్నా బుద్ధిపుట్టితే వీధిభాగవతాలు — తోలుబొమ్మ
లాటలూ — ఇంతేగా ఇక్కడి సంబరము! ఆఖరుకు
ఇంత ఇంగ్లీషు చదువుకొన్న వాళ్ళున్నా లేరు. క్యేరం
గాని — రింగు టెన్నీసుగాని— చివరకు చీట్లపేక కాని—
ఆడుకొందామన్నా ఒక్కరూ లేరు. ఆ అమ్మాయిన్ని
కొన్నాళ్ళపాటు నాదగ్గర ఉంచుతాడేమో నాయుడు
గారిని కనుక్కో. అమ్మాయిని వెంటబెట్టుకొని
నేనొకసారి వచ్చి పొమ్మన్నానని నాయుడుగారితో
చెప్పు, నాగమణితో నామాటగా చెప్పవే.

పున్న: చెప్పుతానుగాని రాజయ్య రానిస్తాడా? రానివ్వడో?

రూప:-అదేమిటే నీదృష్టిఅంతా రాజయ్యమీాద పడ్డది ?

పున్న: అవునమ్మా! నాయుడుగారు కాని — నాయుడు పేట లోనివారుగాని — ఆ రాజయ్యకాని — అందరూ మీా జమీాలో బ్రతుకువారేకదా ? మీా భూములు లేకపోతే వారికి బ్రతుకు తెరువున్నదా ? అలాంటప్పుడు మిమ్మల్ని — ఆనాడు— రాజయ్య — ధిక్కరించాడంటే నాకెంతో చిన్నతనముగా ఉంది. అతడెంత స్వతంత్రుడైనా మీాపోదాను కొంచెమైనా గౌరవించవద్దూ?

రూప:-నీవి పూర్వకాలపు మాటలు సుమా! పిచ్చి దానా! యీానాడు జమీాలే ఎగిరిపోతూంటే మనను నమస్కారాలేమిటి? గాంధీగారు దున్నేవానిదే భూమి అన్నాడు. అదే ఈరోజున అమలులోనికి వస్తున్నది. మన అధికారాలు చెల్లేరోజులు పోయినవి. ఉన్నంతలో పరువును చక్కబెట్టుకోవటే మనపని. ఆనాడు తప్పంతా మనదే. రాజయ్య ననవలసిన పని లేదు. అతడింకా బుద్ధిమంతుడు గనుక ఆ మాత్రముగానైనా మాట్లాడాడు. ఏ పొగరుబోతువాడో అయినట్లయితే ఏమి జరిగి వుండేదో చెప్పలేము. ఆ విషయాన్ని మనస్సులో పెట్టుకోకు. ఇంతకూ నాయుడు పేటకు ప్రయాణ మెప్పుడో చెప్పు.

పున్న:-రేపు పోతానమ్మా!

రూప:-సరే. కావలసినంత సొమ్ము తీసుకొనిపో. డబ్బుదగ్గ
వెనుక ముందులు చూడవద్దు. ఎంతైనా సరే సీ చాక
చక్యమంతా చూపి పని సాధించుకొనిరా.

పున్న:-ఒక్కసొమ్మే చాలదమ్మా! ఆ తోట - ఆ యిల్లు
ఆ మాగాణి - ఆమె పేర సర్వాధికారాలతో వ్రాసి
యివ్వాలి. అవికూడా తీసుకొని పోతేనేగాని పని జర
గదు. క్రిందటిసారి యీ ఆశకూడా చూపించాను.

రూప:-నీ యిష్టప్రకారము చెయ్యవే. గుమాస్తాతో చెప్పి
అన్ని వ్రాత పనులూ పూర్తిచేయించు. నేను చే
వ్రాలుచేసి యిస్తాను. ఒక ఉత్తరం కూడా ఆ
అమ్మాయిపేర వ్రాస్తాను. తీసుకపోయి ఆ చిన్న
దానికియ్యి. నాయుడుగారితో - నాగమణితో - నే
జెప్పమన్న సంగతులు చెప్పు. నాకింక నిద్రవస్తున్నది.

పున్నమ్మ సంభాషణము చాలించి లేచి - ఆమెకు
మెత్తని పక్కయమర్చి - సర్దవలసినవన్నియు సర్ది - క్రిందికి
దిగిపోయినది. రూపలత సోఫామీదనుంచి లేచి హాయిగా
పందిరి మంచముపైఁ బవ్వళించి - యేమేమో తలపోయుచుఁ
గొంతవడికి నిద్రపోయినది.

౬

జానకి నివసించుచున్న తోఁటనానుకొని నాయుడు
గారి సొంతభూమి-రెండెకరముల మెట్టుకయున్నది. అందులో
నొక యెకరమునకు పైగా పండ్లతోట. తక్కిన మేరలో రక

రకాల పూలమొక్కలు - కూరగాయల మొక్కలు - ఉన్నవి నీటివసతికిఁ గొఱఁతలేకుండ నందొక నూతిబావి యున్నది

ఆ తోఁటలో నొక మూల - వీథిప్రక్కన - ఏడెనిమిది గదులు గలిగిన యొక పెద్ద పూరిపాక యున్నది. అదియే భాషామందిరము. ఆ మందిర సమాజమునకు నాయుడుగారే అధ్యక్షులు. విద్యాభిమానియైన మంగపతిరావునాయుడు - రాజయ్య కోరికమీఁద - ఆ రెండెకరముల తోఁటను భాషా మందిరమునకు వ్రాసియిచ్చి - దాని పురోభివృద్ధికిఁ దానే కొంతవఱకు బాధ్యత వహించెను. రాజయ్య కార్యకర్తగా - విద్యాపతిగా - పనిచేయుచు జాతీయ విద్యావిధానము ననుస రించి యీ మందిరమును జక్కఁగా నడుపుచుండెను.

అది యొక చిన్న గురుకులమువంటిది. దేశీయ సంప్ర దాయములను ప్రతిబింబింపఁ జేయునది. మహాత్ముని విద్యా సూత్రములను తు. చ. తప్పకుండ ననుసరించునది. అందు భాషతోఁ బాటు - నూలు వడకుట - గుడ్డలు నేయుట — వడ్రంగము - చాపలు - బుట్టలు అల్లుట - నవారు నేయుట - పగ్గములు పేనుట - మట్టితో రకరకాల వస్తువులు తయారు చేయుట - చెప్పులు కుట్టుట - మొదలైన వృత్తివిద్యలు గూడ నేర్పఁబడును. సంగీత చిత్రలేఖనములకు గొంత యవ కాశ మున్నది.

ఆ మందిరములోఁ గులమత విభేదములకుఁ దావు లేదు. హరిజన బాల బాలికలెందఱో యున్నారు. వలసిన వారికిఁ దెలుఁగుతోఁ బాటు హిందీ భాష నేర్పఁబడును.

ఇంగ్లీషు నేర్చుకొనువారు చాల తక్కువ. ప్రతి విద్యార్థియు సాము గరిడీలు తప్పక నేర్చుకోవలెను. దేశీయములైన యాటలలో నెలకొకసారి పోటీపందెములు జరుగుచుండును ఆ మందిరములోఁ దయారగు వస్తువులమీఁద వచ్చు నాదాయమును బట్టి అనాథ బాలికలకు భోజనము గూడ పెట్టఁబడును. అన్ని తరగతులకుఁ జెందిన విద్యార్థులు షుమారొక వందమంది యుందురు.

ఆ మందిరమున కనుబంధముగా వయోజనుల కుపయోగపడు నొక రాత్రి పాఠశాలయుఁ గలదు. అందు షుమారు ముప్పదిమంది వయోజనులు విద్యగఱపుచుందురు. ఆ మందిరమునకు రెండు తెలుఁగు దినపత్రికలు - వచ్చుచుండును. అందొక చిన్న గ్రంథాలయ మున్నది. ఆ మందిరము స్థాపింపబడి దాదాపున నాలుగేండ్లయినది. ఏటేట వార్షికోత్సవము జరుగుచుండును. తొలకరి వానలు కురియక పూర్వమే ప్రతి సంవత్సరము వార్షికోత్సవములు జరుగుచుండుట యాచారము. ఈయేడు సింగయ్య మృతివలనఁ గొంచె మాలస్యమైనది.

ఏత దుత్సవ నిర్వహణమునకు ముఖ్యులు రాజయ్య - పెద్దిరెడ్డి - జానకమ్మ. మంగపతిరావునాయుడు మూల పురుషుఁడు.

వార్షికోత్సవ కార్యక్రమమును జర్పించుటకై దయొక నాఁటి యుదయమున సామాజికు లెల్లరు సమావేశమైనారు. ఆ సమావేశమునకు నాగమణి కూడ హాజరైనది. పిత్రు

వియోగ దుఃఖితయగు జానకి మాత్రము రాలేదు. ఆమె రాని కొఱంత స్పష్టముగాఁ గన్పడుచునే యున్నది. మంగపతిరావునాయుడేదో పని తొందరవల్లఁ దరువాత వచ్చెదనని కబురంపినాఁడు. కొండప్ప - గంగిసెట్టి - మొదలైన వారుగూడ వచ్చినారు. రాజయ్య మాష్టారుగారు ఉపక్రమింపఁ బోవుసరికి - డాక్టరు మనోహర రావు - నాయుడు గారి కోసము - అచ్చటికి వచ్చుట తటస్థించినది. పెద్దిరెడ్డి - మర్యాదకొఱకు ఆ సమావేశములోఁ బాల్గొన వలసినదిగా డాక్టరు గారిని కోరినాఁడు. ఆయన కాదనలేదు. వచ్చి - నాగమణి ప్రక్కన - కొంచెము దూరములో - నాయుడుగారి కోసము ప్రత్యేకించఁబడిన కుర్చీలోఁ గూర్చున్నాఁడు. ఆ చర్య పెద్దిరెడ్డికిఁ గష్టము కలిగించినది. తక్కిన వారికి వింతగాఁ దోచినది. కాని సదస్యులెవ్వరు నోరెత్తలేదు.

అచ్చటనున్న వారందఱిలోను ఆయన వేషమే వెక్కిరించి నట్లున్నది. ఇస్త్రీ మడతలు చెడని యా విదేశీ దుస్తులు - నెత్తిమీఁద ఆ టోపి - సగము గొఱిగిన ఆ మీసకట్టు - ముక్కును గఱచియున్న ఆ చలువ అద్దాలు కాలి మేజోళ్ళపై నలుపులు గ్రక్కుచున్న ఆ కప్పుడు పాదరక్షలు - ఆయన అపర పాశ్చాత్యుడని చాటుచున్నవి. ఆయన యాకార మందమైనదే. వయస్సు దాదాపు ముప్పదియేండ్లు. ఆయన ముఖమునఁ బాశ్చాత్య నాగరికత యుట్టిపడుచున్నది.

అపరిచితుఁడగు నా వ్యక్తి తన ప్రక్కను గూర్చుండుటకు నాగమణి చకితయైనది. కాని యివ్వలకు జరుగుట సభ్య

తను భంగమని మిన్నకున్నది. కాని డాక్టరు మాత్రము తానట్లు కూర్చుండుట తప్పని కాని అసభ్యత యని కాని అనుకోలేదు. నేటి నవనాగరిక సమాజములో నిట్టివి పరిపాటి. అతఁడు గూర్చుండుటకుఁ బూర్వ మొక్కసారి అందఱినిఁ గలియఁజూచి - నెత్తిమీది టోపితీసి తన వినమ్రతను దెలుపుకొన్నాఁడు. ఇప్పటి నమస్కారపుఁ బోకడలు సెలి యని యా గ్రామీణుల కది మఱింత విస్తారముగాఁ గన్పడినది.

కొంతసేపటికి రాజయ్య అదొకవిధమైన గభీరముద్రతో లేచి - సమాజము తరపున సింగయ్య మృతికి సంతాపమును బ్రకటించి - నాఁటి సమావేశమునకు జానకి రాకపోవుట యెంతో కొఱతగానున్నదని - అయినప్పటికి విద్యాధికులైన నాగమణీ మధుసూధనరావులు వచ్చుటచే నా కొఱఁత చాలవరకు తీఱినదని-వార్షికోత్సవములు జరుగవలసిన తేదిని నిర్ణయించుట ప్రథమాంశమని —— ప్రసంగించిన మీఁదట సభలోఁ గొంతవఱకు తర్జనభర్జనలు జరిగినవి. చివరకు పెద్దిరెడ్డి యభిప్రాయ ప్రకారము —— ఇరువదిరోజుల వ్యవధితో వచ్చే నెల పూర్ణిమనాఁడు జరుపుటకు నిర్ణయింపఁబడినది.

తరువాత సభాధ్యక్షు లెవ్వరను ప్రశ్న వచ్చినది. కొందఱు నాయుఁడుగారినే ఎన్నుకొనుట మంచిదన్నారు. మఱి కొందఱు రాజయ్యయే తగినవాఁడన్నారు. ఇంకఁ గొందఱిని బయటివారి నెవ్వరినైన రప్పించుట బాగుండు నన్నారు. ఆ యభిప్రాయమును బురస్కరించుకొని నాగమణి-రూపఁ

దేవిగారిని ఎన్నుకొనుట మంచిదేమో యోచించుఁడని హెచ్చరించినది. ఆమె హెచ్చరికను మధుసూధనరావు బల పఱచినాఁడు. సదస్సు తన యంగీకారమును సూచించినట్లు మౌనముద్ర వహించినది. నాగమణి హెచ్చరిక తనను వింత గాఁదోచినప్పటికి రాజయ్య బదులుమాటపలుకక-కాదనక- తానుగూడ నామె యభిప్రాయములనే బలపఱచినాఁడు. చివ రకు రూపలతాదేవియే అధ్యక్షురాలుగా నెన్నుకోఁబడినది. కాని యామెనొప్పించి తీసుకొనువచ్చు భారము నాగమణిపై మోపఁబడినది. అందు కామె కూడఁ గాదనలేదు. పారి తోషిక ప్రదానమునకు నాగమ్మనే అందఱు ఏక గ్రీవ ముగా నెన్నుకొన్నారు. సభా ప్రారంభకులుగా పెద్దరెడ్డి డాక్టరు పేరు సూచించునరికి ఆయన తనవల్ల కాదనియు, నాపని నిర్వహింప రాజయ్యే సమర్థుఁడనియు, నతని నెన్నుకొనుట మందిర సంప్రదాయముల కెంతయుఁ దగుననియుఁ దన యనుమ్మతిని సూచించినాఁడు.

అప్పుడు రాజయ్య ఎదిరి మనసు లోతులను బరిశో ధించునట్టి దృష్టితో నాగమణి మధుసూదనుల వంక క్షణ మాత్రమా చూచి "డాక్టరుగారూ! ఇఁదు సాంప్రదాయ ములు ...లసిన పనిలేదు. ఈ మందిరము జాతి కంతకూ కాఁ...ఎటి ...ది కాని నా ఒక్కని సొమ్ముకాదు. ఇందలి పద్ధతు ...న మఱు ... అనుసరింపదగినవే కాని నా ఒక్కనికి జెంది అ...రు. మందిరమును గౌరవించుట జాతిని గౌర నాగలతా ...ు, నన్ను గాని - మఱొక వ్యక్తినిగాని —

గౌరవించుట కాదు. కాబట్టి యీ పనికి నేనెంత తగుదునో మీరు కూడా అంతే తగుదురు. సభాప్రారంభకులుగా — నాకంటె-మీరే ఉండుట చాలమంచిది'' అని అన్నాడు.

డాక్టరు: రాజయ్యగారూ! మీరు చెప్పినదంతా నిజమే. కాని నా అభిరుచి - మీ అభిరుచి- ఒక్కటి కాదు. మన దృక్పథాలే భిన్నములు. మీరు సంకుచితమైన — ఒక ప్రత్యేకమైన - జాతీయ దృష్టితో ప్రపంచాన్ని చూస్తున్నారు. నేను విశాలమైన- సార్వజనీనమైన- విశ్వ మానవ దృష్టితో చూస్తున్నాను. ఈ మాట అన్నందుకు క్షమించాలి. మీరు భాషను— వేషాన్ని ఎక్కువగా గౌరవిస్తారు. నేను గుణాన్ని మాత్రమే గౌరవిస్తాను. నాకు - మీ మాదిరిగా- వేషభాషలు ప్రధానాలు కావు. కాబట్టి మీ జాతీయదృష్టికి — మీ వేష భాషలకూ— విభిన్నుడనైన నన్ను వదలి పెట్టండని మనవి.

రాజ:- మీరు నాకంటె బాగా చదువుకున్నారు. నాకంటె ఎక్కువ విషయాలు మీకు తెలుసు. అయినా మీ అభిప్రాయాన్ని మన్నించకుండా మాట్లాడుతున్నందుకు నా అల్పజ్ఞత్వాన్ని క్షమించాలి. మీరు చెప్పినదంతా సిద్ధాంతరీత్యా మంచిదే కావచ్చు. [illegible] మీ అభిప్రాయాలు ప్రపంచాతీతులకు [illegible] దానిని లౌకికులకు చెల్లేవి కావు. మనమంతా లౌకి[illegible] దల ప్రపంచాతీతులము కాము. లౌకికులెప్పు

వ్యవహారాన్ని పురస్కరించుకొనే మాట్లాడాలి. దాన్ని అనుసరించే నడచుకోవాలి. మానవుడు సంఘ జీవి కాని ఏకాకిగాడు. ఎటువంటివాడైనా ప్రజాభి ప్రాయాన్ని మన్నించాలి. ప్రజాభిమానాన్ని — గౌరవాదరణలను – పొందాలి. అప్పుడే అతడు పైకి వస్తాడు. ఇందుకు తానుగూడ ప్రజలలో ఒకడని అను కోవాలి. మీరు చెప్పిన విశ్వమానవదృష్టి అనేది చాల సరసమైనమాటే. దాని నెవ్వరూ కాదనలేరు. కాని యీ మహాప్రపంచములో ఇది యెంతవఱకు సాధ్యము ? అని ఆలోచించకుండా సులభముగా అనేసి తప్పుకోరాదు. ఈరీతిగా అనేవారు కాని — అని తప్పుకొనేవారు కాని—కార్యశూరులు కాఁజా లరు. అదట్లా ఉంచండి. ఈ నాడు ప్రపంచములో జాతీయ దృష్టి లేకుండ– మీ విశ్వమానవ దృష్టితో– ఏ జాతి వ్యవహరిస్తున్నదో చెప్పండి. అసలు తనను– తన జాతిని – తన దేశాన్ని – ప్రేమించలేని యఘ ముడు ఇతరజాతులను, ఇతర దేశాలను, ఈ మహా విశ్వాన్ని ఎట్లా ప్రేమించగలడు ? మెట్లెక్కకుండా మేడపైకి [illegible]పోగలడు? ఉట్టికెక్క లేనివాడు స్వర్గాని కెక్కగ[illegible] అన్నట్లుంది. తనను – తనజాతిని— [illegible] [illegible]ళు వెల్లున[illegible] — ప్రేమించాలంటే ప్రతివాడు విధిగా [illegible]రు. కులమ[illegible]లను ప్రేమించితీరాలి. తనను కని— [illegible]తా[illegible]డూ [illegible] తన మాతృదేవతనే ప్రేమింపలేని

మనుజుఁడు పరాయి మాతను ప్రేమించ గలఁడా? వట్టిమాట. ఎవ్వడైనా ఇందుకు కాదన్నాడంటే వాఁడు ప్రపంచాన్ని బూటకపు సిద్ధాంతాలతో మోస గించుతున్నాడన్న మాట. డాక్టరు మహాశయా! మీరన్నట్లు సంకుచిత మైనప్పటికి ప్రతివారికి ముందు జాతీయదృష్టి అలవాడలని నా అభిమతము. దీన్ని మీరు మన్నించినా, మన్నించకున్నా యిబ్బంది ఏమీ లేదు. మీ వేషాన్ని – మీ భాషను – సభా మందిరము కోసమని మార్చుకొమ్మనను. అది మీ యిష్టము. ఏ వేషముతో నైనా సరే ఏ సంప్రదాయము తో నైనా సరే మీరు సభాప్రారంభకులుగానుండి మా కోర్కెను చెల్లించండి.

డాక్ట:– మీరు లక్షచెప్పండి. మీ యభిమతముతో నే నేకీభ వింపజాలను – ఈ సంకుచిత దృష్టి – ఈ భాషా వైష మ్యము – పోనంత వఱకు మానవజాతి పురోగమింప జాలదు. ఈ జాతి భాషా ద్వేషాలే ప్రపంచ కల్లోలా నికి మూలబీజాలు. ఈ దారుణ యుద్ధాలు — ఈ మానవజాతి మారణహోమాలు – ఏనాటి కైనా నశించితీరాలి. లేకపోతే వసుధైక ప్రపంచ వ్యవ మేర్పడినప్పుడే విశ్వానికి పరిపూర్ణ శాంతి— చిన్న కార్యసాధనకు ప్రతివ్యక్తి ప్రయత్నించా దానిని నా విశ్వాసము. నా జీవితాన్ని దీనికే ధార దల చేసినాను.

డాక్టరు చెప్పినదంతయు నాగమణికి నచ్చినది కాఁబోలు -ఆమె ఒక విధమైన ప్రశంసాగర్భిత దృష్టితో నతని వంకఁజూచినది. రాజయ్య ఆమె హృదయమును దృటిలో గ్రహించినాఁడు. దానితో నతని కొండలు కంపరమెత్తినది. ఒక విధమైన యుద్రేకముగూడఁ గలిగినది. అతఁడు మరల సంభాషణ సాగించినాఁడు.

రాజ:- డాక్టరుగారూ! మీ మహదాశయానికి నా ధన్యవాదాలు. నిజానికి ఈయాశయసిద్ధికొఱకే మీజీవితాన్ని అంకితము చేసిఉంటే నాకంటె ఎక్కువగా హర్షించే వాడు మఱొక్కఁడుండడు. కాని మీరు పలికిన పలుకులన్నీ చిలుక పలుకులు. మీ రుపయోగించిన పదజాల మంతా పత్రికలలోనిది. మీ భావాలన్నీ పరులవి. ఇందులో మీ సొంతమనేది యేమీ లేదు. మీరు పత్రికలలో చదివిన దంతా ఇతరుల మెర మెచ్చుల కోసము వప్పగిస్తున్నారే కాని హృదయ పూర్వకముగా -యాదార్థ్యమును గుర్తించి - మీరు చెప్పినది ఒక్కటీ లేదు. మీ విశ్వాసాన్ని —మీ రెంత [illegible] ్షించినప్పటికీ - ఆచరణలో పెట్టలేరు. [illegible] ఈ [illegible] కానిపని. తియ్యని శబ్దజాలముతో— [illegible]ం కాలి. [illegible] గొన్నట్టి, ఆచరణదూరమైనట్టి, మహా[illegible] అంకి[illegible] తో అమాయిక ప్రజా హృదయాన్ని కొ[illegible] యాశయాన్యులగు మీ వంటి పెద్దలకు

పరిహాసమై పోయినది. ఇది ప్రపంచాన్ని మోసగించుట తప్ప మఱొకటికాదు. వసుధైక ప్రపంచమనీ - ఏక వ్యవస్థయనీ - ముచ్చటించినారు —— చరిత్ర తెలిసి నప్పటినుండి నేటివఱకు - ఏ ఒకప్పుడైనా వసుధైక ప్రపంచ వ్యవస్థ యేర్పడినదా? అసలు సృష్టిలోనే ఏకవ్యవస్థ లేదు. ఈ మహావిశ్వ పురుషుడైన భగ వంతునిలోనే ఏకత్వము లేదు. ఈ నగ్నసత్యాన్ని గుర్తింపక - సృష్టిక్రమానికి విరుద్ధముగా - ఏక వ్యవస్థ యేర్పడాలనుట జరిగే దేనా? ఈ యేర్పడని దాని కోసము జీవితాన్ని అంకితము చేశామనుట యేలాంటి వివేకమో చెప్పలేను. తన భాషను తాను గౌరవిం చుట——తన జాతిని తాను ప్రేమించుట - సంకుచిత బుద్ధి కాబోదు. విశాలమైన విశ్వమానవ దృష్టితో దొర వేషము వేసినంత మాత్రన — వారి భాష మట్లాడినంత మాత్రాన వారి సాంప్రదాయాలు తెచ్చిపెట్టుకున్నంత మాత్రాన - మనము దొరలము కాము. పాశ్చాత్యుల మనిపించుకోము. స్వజాతీయు లేయని వారు మనలను పరిగణించరు- గౌరవించరు. చివరకు మనగతి యెందుకుగాని అధోగతియే. భిన్నత మిక్కిలి ఈ యంధానుకరణము దాస్యచిహ్న చిన్న పరిణమించి - మన గౌరవ భ్రష్టతకు దాని దానిని మన యధఃపతనాన్ని మనమే కోరికోరి తెగా దల టాము. ఈ దారుణ యుద్ధాలు - ఈ మహ

మారణహోమాలు – ఇవన్నీ జాతీయ దృష్టివ వచ్చేవి కావు. వీటన్నిటికీ ప్రధాన కారణాలు మనల దాగిఉన్న ధనతృష్ణ – అధికారవాంఛ – ఇవి లే నాడు యుద్ధాలే లేవు. కాని యివి లేకపోవుట సృ క్రమానికీ – మానవ తత్వానికీ – విరుద్ధమనిపి స్న్నది. ఒక తల్లి కడుపునఁ బుట్టిన యిద్దరికే సు కుదర ·నప్పుడు — మతులు కలియనప్పుడు –శాంత చావనప్పుడు —— ఈ విభిన్న విశ్వమానవ కోటి గుఱించి వేఱుగా చెప్పవలసిన పని లేదు. మనమెంత ప్రయత్నించినప్పటికీ సహజముగా సృష్టిలోగల విభి న్నత్వమూ – అనేకత్వమూ – అంతరించునవి కావు. అవి అంతరిస్తే యీ జగన్నాటకమే లేదు. మనమే లేము. ఈ విశ్వమంతా ఒక మహాశూన్యమై పోతుంది. ఇదంతా యెన్నడో గ్రహించిన మన మహర్షులు భిన్నత్వమునుండి సమానత్వమూ – అనే కత్వమునుండి ఏకత్వమూ— సాధించి విశ్వశాంతికి రాచబాటలు నిర్మించారు. మన మూ దా రు లు త్రొక్కి– జాతిక్షేమానికీ – తద్వారా ప్రపంచక్షేమా

డి – కార్యశూరుల మనిపించు కొనుట చరణ సాధ్యములుగాని సిద్ధాంతాలతో– భావాలతో —— ప్రపంచాన్ని మోస చిది కాదు. పట్టి గ్రంథాలుగాక లోకా ాలు గూడ చదివిన వారికి నే చెప్పిన

విషయాలు చక్కగా బోధపడుతవి. డాక్టరు మహా శయా నామాటలలో బిరుసుదనముంటే మన్నించండి. మీా విశ్వాసాన్ని మాత్రము కొంతవఱకైనా మార్చు కోక తప్పదు.

ఈ విధముగా రాజయ్య నూరిపోసిన దంతయు నొక్క సారిగా మ్రింగ లేక గుటకపడక డాక్టరు ఉక్కిరిబిక్కిరియైనాడు. నాగమణి అది ప్రశంసాగర్భితమో, అనురాగ గర్భితమో- చెప్పలేముకాని ఒకవిధమైన దృష్టితో రాజయ్యవంక విప్పా రిన నేత్రములతోఁ జూచినది. మధుసూదనరావు యే సమా ధానము చెప్పకుండగనే యాసనమునుండి లేచుటచూచి — నాగమణి కొంచెము బాపునకుఁబోయి-"మీారు మాకోసమైను మన్నించారనుకొంటాను. మా బావనుగూర్చి మఱి యేమను కోకండి. ఆయన స్వభావమట్టిది" అని యన్నది.

ఆమె మాటలకు ముగ్ధుఁడైనట్లు డాక్టరు మందహాస వదనముతో - గౌరవసూచక దృక్కులతో - ఆమె ముఖము వంక తేఱిపారఁజూచి - సరేయని - కరస్పర్శ చేయుటకుఁ గాబోలు చేయి చాపినాఁడు. అది చూచి నాగమణి చకిత మైనట్లు- క్షణమాత్ర మూరకుండి - వణకుచున్న తన కుడి హస్తమును జాపినది. మధుసూదనరావు ఆమెతోఁ గరస్పర్శ చేసినాఁడు. తొందరలో నాగమణి ఎడమచేతిలోని చిన్న ౩ తోలుసంచి జారి క్రిందఁబడినది. వెంటనే డాక్టరు దానిని ుసి - ఆమెచేతి కందిచ్చి - మర్యాద చిహ్నముగాఁ దల ంచినాఁడు. ప్రేక్షకులకిది చాల వింతగాఁ దోచినది.

తరువాత వారందఱు ప్రాంగణములోనికి వచ్చినారు. అంతలో మంగపతిరావు నాయుడు - వ్యాపారమున్నకై వచ్చి కొందఱు కలప వర్తకులతో నచ్చుటకై వచ్చినాఁడు. అప్పుడొక కలప వర్తకుఁడు డాక్టరునైపు వ్రేలుపెట్టి చూపించుచు "ఈయనగారేనండి మీ అల్లుడు ?" అని ప్రశ్నింప నాయుడు ఎందుకో కొంచెము నిదానించి "కాదండీ!" అన్నాఁడు ఆ కలపవర్తకుని ప్రశ్నకు - మేనమామ సమాధానమునకు రాజయ్య మనస్సు కొంచెము కలఁత నొందినది. నాగమణి సిగ్గుపడినది కాబోలు - తలవంచుకొన్నది. ఆనాఁటి సంఘటనలు పెద్దిరెడ్డి మనస్సునుగూడఁ జాల కలఁచినవి. అతఁ కంతయు నయోమయముగాఁ దోఁచినది.

మంగపతిరావు రాజయ్యనుచూచి "మీటింగు అయిపోయినదా ?" అని యడుగ రాజయ్య నాఁడు జరిగిన నిర్ణయాలన్నియు మామకుఁ దెలిపినాఁడు. అందుమీఁద నాయుడు సంతృప్త హృదయముతో డాక్టరునుజూచి "మీరు తఱచు మా సమావేశములలో పాల్గొనుచుండాలి. మీరు సభా ప్రారంభకులుగా ఉండుట మా యదృష్ట" మని అభినందించినాఁడు. డాక్టరు నాయుడుగారికి మర్యాదగాఁ దలవంచి - ప్రత్యేకముగా నాగమణివద్ద సెలవుగైకొని - అందఱి వీడ్కోలు వడసి - అరిగినాఁడు. నాగమణి తండ్రితోఁగలసి గృహమున కేగినది. పెద్దిరెడ్డి మందిరములోనే యుండిపోయినాఁడు. రాజయ్య నాఁటి విశేషాలు చెప్పుటకని జానకీ గృహమున కరిగినాఁడు.

"పాపమ్మా! జానకి యేమి చేస్తున్నది?" అని రాజయ్య అడిగినాఁడు.

పాపమ్మ గంగినీడు భార్య. నలుబది యేండ్లు దాటిన వయస్సు గలది. సింగయ్య చనిపోయి నప్పటినుండి–రాజయ్య కోరికమీఁద–జానకికిఁ దోడుగా నా యింటిలోనే ఉంటున్నది. కన్నతల్లివలె పాపమ్మ తనకుఁ జేయుచున్న యుపచారముల వలన జానకి కొంతవఱకుఁ బితృ దుఃఖమును మఱచిపోయినది.

పంచపాళీలో రాట్నము వడుకుచున్న పాపమ్మ రాజయ్యను జూచి "రా నాయనా! లోపలికి రా" అని లేచి మంచము వాల్చఁబోయినది.

రాజ:– వద్దులే పాపమ్మా! జానకి యింట్లో లేదా?

పాప:– ఎక్కడికి పోతుంది నాయనా! దేవుడింటిలో పడి యేడుస్తున్నది. ఏదో కొంత తగ్గిందిగదా అను కొన్నాను. కాని కడచిన రెండురోజులనుండి ఒకటే యేడుపు. ఒక్కపూట తప్ప అన్నముగూడ సరిగా తినుటలేదు.

రాజ:– మళ్ళీ ఏమి జరిగినది? ఎవరైనా క్రొత్తవారు వచ్చినారా?

పాప:– క్రొత్తవారు కాదు కాని పున్నమ్మ మాత్రము వచ్చినది. జానకితో ఏకాంతముగా ఏమేమిటో రెండు మూడు గంటలసేపు మాట్లాడి పోయినది. సరిగా ఆనాడే నీవు బస్తీకి వెళ్ళావు? ఆమె వచ్చిపోయినప్పటి నుండి ఒకటే యేడుపు.

రాజ:— పున్నమ్మరాకకు – జానకి యేడ్పుకు – ఏదో సంబంధ మున్నది.

పాప:— ఏమోనాయనా! నాకేమీ తెలియదు. జానకిని ఓదార్చటానికి నాశాయశక్తులా పాటుపడుతున్నాను. అంతకంటె నేనేమి చేస్తాను?

రాజయ్య మఱుమాటాడలేదు. ఏదో స్మృతికి తెచ్చుకొని – చరచర లోపలికిఁ బోయి – అంతగా వెలుతురులేని పడమటింటిలో నొకమూలఁ గూర్చుండి వాపోవుచున్న జానకిని గుర్తించి – "జానకీ" అని పిల్చినాఁడు. అతని పిలుపు వినుటతోడనే జానకి వెక్కి వెక్కి యేడువ సాగినది. రాజయ్య కలఁత నొందిన మనస్సుతో "నిజముచెప్పు జానకీ! పున్నమ్మ వచ్చినది నీ తలకట్టుకోసమేనా?" అని అడిగినాఁడు. దానితో దిగ్భ్రమను నొందినట్లు జానకి స్పృహ తప్పి పడిపోయినది. వెంటనే యతఁడు "లాంతరు ముట్టించుకొని రా పాపమ్మా!" అని కేకవేసినాఁడు. పాపమ్మ దీపము వెలిగించికొని వచ్చినది.

దీపపు వెలుఁగులో రాజయ్య జానకి తలకట్టువంకఁ జూచినాఁడు. ఆమె తలకు నల్లనిగుడ్డ వాసెన కట్టఁబడి యున్నది. అతనిమాటమీదఁ పాపమ్మ ఆ వాసెనకట్టు విప్పినది. ఏమున్నది? జానకి బారు వెండ్రుకలు—ముచ్చెలగుంట వఱకుఁ గత్తిరింపఁబడి యున్నవి. ఆ దృశ్యమును జూచి రాజయ్య నిర్ఘాంత పోయినాఁడు. అతని నోట మాటరాలేదు. జానకికి స్మృతి గలుగలేదు.

కొంతసేపటికి రాజయ్య నోరు తెఱచి "పాడుముండ! ఎంతపని చేసినది? నా యనుమానము నిజమైనది పాపమ్మా!" అని పలుకుచు దీపపు వెలుఁగున నలుమూలలు పరికించినాఁడు. దేవుఁడున్న మూల నతనికొక మూట కన్పించినది. అతఁడాత్రముతో నామూటను విప్పిచూచినాఁడు. అందులో నిరువది వందరూపాయల నోట్లు — ఒక దానపత్రము — ఒక యుత్తరము - ఉన్నవి. దానపత్రములో చెఱువు క్రిందఁ గల రెండు ఎకరముల మాగాణి-ఆ పండ్లతోఁట- ఆయిల్లు- దాన విక్రియాది సర్వాధికారములతో జానకి పేర వ్రాయఁ బడినవి. రాజయ్య ఆ యుత్తరమునుగూడ విప్పి చదివినాఁడు.

ప్రియసోదరి శ్రీమతి జానకిని ఆశీర్వదించి వ్రాయునది.

నీవు అందాల బరిణవు. సుగుణాల దొంతివి. ఒకానొక బీదయింటిలో సింగయ్య కడుపున పుట్టవలసిన దానవుగావు. నీతండ్రి చావువలన నీ కేర్పడిన నిరాధార స్థితిని తెలిసికొని నా మనస్సు నీరైనది. నిన్ను వృద్ధిలోనికి తేవలెనని— నీ తండ్రి బ్రతికి యుండగనే - అతనితో నేనెంతగనో నొక్కి చెప్పితిని. కాని నామాట కతడంగీకరింపలేదు. నీవు బుద్ధిమంతురాలవు. దూర దృష్టితో నీ భవిష్యత్తును నీవే యోచించుకొని - నా మాట నెఱవేర్పుము. అందు కిది ప్రతిఫలమని భావింపకుము. ఎల్లప్పుడు నేను నీదాననని విశ్వసింపుము. పున్నమ్మ వలన నీకన్ని సంగతులు తెలియఁగలవు. నిన్ను నా తోఁబుట్టువుగా ప్రేమించుచున్నాను.

ప్రియసోదరి,
రూపలతాదేవి.

ఉత్తరము పూర్తిగా జదువుసరికి రాజయ్యకు భరింప రాని యావేశము కలిగినది. ఆ యావేశముతో నతఁడు "చూడు పాపమ్మా! ఇట్టి తియ్యని మాటలతో — అంగిట చేదుపెట్టుకొని - ఈ నవనాగరికులు అమాయకులైన జాన పదులను మోసగిస్తున్నారు. వీరినేమి చేసినను పాపము లేదు. ఎంతఘోరము? ఎంత అన్యాయము? ఈమె ఆడది కాదు. స్త్రీరూప రాక్షసి. ఇట్టివారు పూజనీయులట!" అని గర్జించినాఁడు.

ఆ గర్జనతో జానకికి స్మృతి కలిగినది. కాని మాటా డలేక - గుడ్లప్పగించి, రాజయ్య ముఖమువంక — ఒక పిచ్చిదానివలె - చూడసాగినది. అసలు సంగతి యేమిటో తెలియని పాపమ్మ బిత్తరపోయి "ఇదంతా యేమిటి రాజయ్యా! నాకేమో గొడవగా ఉన్నది. చెప్పు" అని యడిగినది.

రాజ:- ఇదంతా ఒక పెద్దగాథ పాపమ్మా; సింగయ్య బ్రతికి ఉండగానే — మన జమీందారిణి రూపలతాదేవి సింగయ్యను తన కోటకు రప్పించుకొని - జానకిని సినిమాలల్లో వేషాలు వేయటానికి పంపవలసినదనీ - పంపితే కోరినంతడబ్బు యిస్తారనీ, దానితో సుఖజీవనము చేయవచ్చుననీ — యేమేమో చెప్పిందట. కాని సింగయ్యమామ అందు కొప్పుకోలేదట. దానిమీద ఆ అమ్మగారు - జానకి తలకట్టు చాలా పెద్దదనీ — ఆ భారు వెంట్రుకలు కత్తిరించి తనకు ఇప్పించవలసినదనీ - అందుకు కావలసినంత రొక్కమిస్తాననీ —

ఆశ పెట్టినదట. దానికి కూడా సింగయ్య ఒప్పుకో లేదట. తన మాట వినలేదన్న కోపముతో ఆమె అప్పటినుండి తనకోర్కె నెఱవేర్చుకోటానికి ఎత్తులు వేస్తున్నది. చివరకు ఈ నాటికి ఆ నీచురాలి కోర్కె నెఱవేరినది. సింగయ్యమామ బ్రతికి ఉండగనే నాతో ఈ సంగతంతా చెప్పియేడ్చాడు. ఈ పాడుపనికి జానకి ఒప్పుకోదులే అని ఆయనకు ధైర్యము చెప్పాను. అయితే నేనుగాని ఆయనకాని – జానకికి ఈ సంగతి చెప్పకూడ దనుకున్నాము. అందువల్ల ఇంతపని జరిగింది. ఆ పాడు పున్నమ్మ చెప్పిన కల్లబొల్లి మాటలకు జానకిమోసపోయి – తన సౌందర్యాన్ని కోలుపోయింది. ఆడదానికి ఇంతకంటె పరాభవ మేమున్నది పాపమ్మా! పాపిష్టి సొమ్మున కాసించి జానకి ఇంతపని చేస్తుందని నేను కలలోనైనా అనుకోలేదు. ఆ తెలివితేటలన్నీ యేమైపోయినవో? చివరకీవిధముగా జరిగినది.

ఆ కథ సాంతము విన్న పాపమ్మ యేమనవలెనో తెలియక మౌనమువహించినది. జానకి మాత్రము కన్నీరు గార్చుచు – నిరాశాపూరిత హృదయముతో "రాజయ్య బావా? ఈ విషయములో నొకరి ననవలసిన పనిలేదు. కోరికోరి నేనే నా వెండ్రుకలు కత్తిరించి యిచ్చినాను. దీనికి విచారపడనేల? బుద్ధిపూర్వకముగా చేసినదానికి పరాభవ మేమున్నది?" అని పలికినది.

రాజ:- నీకై నీవే యీ పాడుపనికి అంగీకరించితివా? జానకీ నీమాట నమ్మజాలను.

జాన:- నాకై నేనే యీ పని చేసినాను. ఈ తలకట్టు ఉన్నందువల్ల నాకు వచ్చే లాభమూ లేదు - పోయి నందువల్ల కలిగే నష్టమూ లేదు. ఈ దిక్కుమాలిన స్థితిలో వీటిని పోషించుటగూడ కష్టమే. అదిగాక నావంటి బీదపిల్లకు చక్కదన మెందుకు?

రాజ:- బీదతనానికీ - చక్కదనానికీ - సంబంధములేదు జానకీ! ఈడువచ్చిన పిల్లవు. పెండ్లి కావలసిన దానవు. అనాకారివిగా నుండుట యెంతమాత్రము తగదు.

జాన:- ఈ జన్మలో గృహిణినయ్యే యోగము నాకు లేదు.

రాజ:- అది నీ కెట్లు తెలుసు?

జాన:- నా అంతరాత్మ అట్లు చెప్పుచున్నది. నేనొక దిక్కు మాలిన పక్షిని. ఎటుచూచినా నాకు 'నా' యను వారు లేరు.

రాజ:- అట్లందువేమి జానకీ! నేనున్నానుగదా? నాబొందిలో ఊపిరిఉండగా నీవు దిక్కులేనిదానవు కాజాలవు. సింగయ్యమామ నిన్ను నాకప్పగించి మఱి పోయి నాడు. ఆ సంగతి నీకూ తెలుసుగదా?

జాన:- తెలుసు రాజయ్యబావా! నా మనసుగూడా నీకు తెలుసు. అయినప్పటికీ నన్ను నీవు భరింప జాలవు. నీవు నాకై బాధపడవద్దు. ఈ జన్మలో సుఖపడు యోగము నాకు లేదని మనసు రాయిచేసుకొన్నాను.

నే నొక విరక్తురాలను. ఈ సౌంధర్యముతోగాని, ఈ సుఖాలతోగాని, నా కేలాటి సంబంధమూ లేదు. నా యభాగ్యమునకు నీవేమి చేయగలవు ? నన్ను వదలిపెట్టుము.

రాజ:- నీ మాటలు చాల బరువుగా నున్నవి. నా కేమీా బోధపడుట లేదు.

జాన:- బోధపడకుంటే ఉభయులకు మంచిది. చివరమాట - పాపమ్మగాని నీవుగాని - నా తలకట్టు కత్తిరింపును గుఱించి మరెవ్వరితోనూ అనరాదు. ఈ సంగతి మన ముగ్గురిలో జీర్ణించిపోవలసినదే. బయటి కే మాత్రమైనను పొక్కినదా ఆ క్షణమునుండి నన్ను మీారు మఱి చూడబోరు. పాపమ్మ తల్లీ! నన్ను నీ కడుపులో పెట్టుకొని కాపాడుము.

అని జానకి వెక్కివెక్కి ఏడవసాగినది. పాపమ్మ చెంత కూర్చుండి - బుజ్జగింపు మాటలతో నామె నోదార్పఁ జొచ్చినది. రాజయ్య మనస్సు చాల వికలమైపోయినది. అట్లెందుకైనదో యతనికే తెలియదు. అతఁడు వచ్చిన పని యొకటి - జరిగినది మఱొకటి. "జానకిని ఓదార్చుట ఎట్లు- ఆమె భవిష్యజ్జీవితమునకు వెన్నెలశోభ కూర్చుటయెట్లు?" అను సమస్యలతో నతని తల తిరిగిపోసాగినది. అతని హృదయములో నొక పెద్ద తుపాను చెలరేగినది. అతఁడేమియు నిర్ధారించుకొనలేక - అచ్చట నుండలేక - చివాలున లేచి బయటికి పోయినాఁడు.

బయటి కేగిన రాజయ్య - మఱెచ్చటను ఆగక - సరాసరి మేనమామ యింటికిఁ బోయినాఁడు. నాగమణి ఏమైన తన హృదయ వైకల్యమును బోఁగొట్టునేమో యని యతని యాశ. కాని యచ్చటికి బోవుట యతనికి మఱింత బాధాకరమైనది. అతఁడు వీధివాఁకిలి దాటి వరండాలోఁ గాలు మోపుసరికి ప్రక్కనున్న గదితలుపు తెఱచుకొని - డాక్టరు మధుసూదనరావు - నాగమణి - బయటికి వచ్చుట తటస్థించినది. వారిని జూచుటతోడనే యతని మనస్సు మఱింత చెడిపోయినది. కాని తన్నుదాను నిబ్బరించుకొని - యే మాత్రము తొందరపడక - నాగమణివంకఁజూచి- "వీరెప్పుడు వచ్చినారు ?" అని ప్రశ్నించినాఁడు.

నాగ:- షుమారు ఒక గంటసేపైనది. నాన్న యింతకు ముందుగనే కలప దొడ్డికి వెళ్ళినాఁడు. అమ్మ కేదో సుస్తీగా నుండుటచేత - నాన్న పిలువసంపగా - వీరు వచ్చినారు. బావా! జానకిస్థితి యెట్లున్నది? ఆమెవద్ద నుండియేగా నీవు వచ్చినది ?

రాజ:- అవును నాగూ! ఆమెస్థితి యేమంత బాగుగాలేదు. నీతో ఆసంగతి చెప్పుటకే వచ్చినాను. సమయానికి వీరుకూడా ఉన్నారు. డాక్టరుగారూ! రండి. మనము కొంత మాట్లాడుకోవలసిన పనియున్నది.

అని రాజయ్య గదిలోనికిఁబోయి - ఒక కుర్చీలోఁ గూలఁబడినాఁడు. అతని కెదురుగా డాక్టరు కూర్చున్నాఁడు. ప్రక్కగా నాగమణి కూర్చున్నది. రాజయ్య ఒక విధమైన యుద్రేకముతో సంభాషణ సాగించినాడు.

రాజ:- మన భాషామందిర వార్షికోత్సవాలకు రూపలతా దేవిని అధ్యక్షురాలిగా ఎన్నుకొన్నాము. కాని యీపదవికి ఆమె తగదని నాకిప్పుడు బోధపడినది. జమీందారిణి యైనప్పటికీ అటువంటి నీచురాలు ప్రపంచములో మఱి ఉండబోదు. దీనికి కారణము మీాకిప్పుడు చెప్పరానిది. నాగూ! నామీాద విశ్వాసముంటే నేను చెప్పినది నమ్మండి. లేకుంటే త్రోసివెయ్యండి. అయితే ఒకటిమాత్రము రూఢిగా చెప్పకతప్పదు. ఆమెయే అధ్యక్షురాలుగా ఉండవలెననుకొంటే నేనుగాని — జానకిగాని – ఆ యుత్సవాలలో పాల్గొనలేము. మేము లేకుండా జరుపుకొన్నా సరే – మీాయిష్టము.

రాజయ్య చెప్పినది విని నాగమణీ మధుసూదనులు-చాల వింతపడి—ఒకరి మొగము లొకరు చూచుకొన్నారు. కొంచెము సేపటివర కెవ్వరు మాట్లాడలేదు. కాని తరువాత నాగమణియే మాట్లాడినది.

నాగ:- అన్నీ చర్చించుకొని యిప్పుడు మానుకొంటే అధ్యక్షు లెవ్వరు? అదిగాక అంతమంది నిర్ణయాన్ని మనము త్రోసివేయుట ధర్మమా ?

రాజ:- అంతమంది యెవ్వరున్నారు? ఈ తీర్మానమును ప్రతిపాదించినది నీవు, బలపరచినది వారు. కాబట్టి మీారిద్దఱు ఒప్పుకుంటే మార్చవచ్చు.

నాగ:- అయితే మఱి అధ్యక్షు లెవ్వరు ?

రాజ:- మీా నాన్నగారే. ఏమంటారండీ డాక్టరుగారూ ?

డాక్ట:- బాగానే ఉన్నది. కాని నాయుడుగారు సమ్మతించవద్దూ?

రాజ:- అవును. మొదటి ప్రతిపాదనకూడా అంతేకాదా? ఆ భారము నాగమణికి వదిలినట్లు - ఇది నాకు వదలండి. మా మామయ్యను ఒప్పించే భారము నాది. అసలు ముందీమార్పు మీ కిష్టమేనా ?

డాక్ట:- నాదేమున్నది రాజయ్యగారూ! అంతా నాగమణిగారి యిష్టము - మీ యిష్టము. నా కెవ్వరైనా ఒక్కటే.

నాగ:- ఇష్టపడక చేసేదేమున్నది బావా! నీమాట కాదనువారెవ్వరు? నీవు లేకుండా ఈయుత్సవాలు జరిపేదెవ్వరు?

రాజ:- అట్లా అనకు. నీకు కష్టముగా ఉంటే చెప్పు. అవసరమైతే నేనే మార్చుకొంటాను.

నాగ:- వద్దు బావా వద్దు. నాకు నాన్నకంటె ఆమె యెక్కువా? నీ యిష్టప్రకారము చెయ్యి. అసలు కారణము తెలియకపోవుటవల్ల ఇంతగా అనుకోవలసివచ్చినది.

రాజ:- ఆ కారణము ఇప్పుడు చెప్పను. నిదానముమీద నీకే తెలుస్తుంది. మఱొకసారి చెప్పుచున్నాను. నాగూ! నీవా తుచ్ఛురాలికడకు పోనేవద్దు. ఆమె స్త్రీజాతికి పరమ శత్రువని నానిశ్చయము.

అని రాజయ్య లేచినాఁడు. డాక్టరుకూడా లేచి సెలవు గైకొని వెళ్ళినాఁడు. అతని వెనుకనే రాజయ్యకూడ బయలుదేరి కలపదొడ్డి చాయఁబోయినాఁడు. నాగమణి యేమియుఁతోచక గంభీర ముద్ర దాల్చినది. రాజయ్య కలప

దొడ్డికిఁ బోవుసరికి మంగపతిరావునాయుడు లోపలిగదిలోఁ గూర్చుండి - పెద్దిరెడ్డి - కొండప్ప - గంగిసేను మున్నగు తన సహచరులతో మాటాడు చుండెను. ఆ సంభాషణము నాలకించు తలంపుతో నతఁడు గదిలోపలికిఁబోక - బయటనే ప్రక్కవాటుగా నిలబడి - వారి మాటలు వినఁజొచ్చెను.

పెద్ది:- అయితే నాగమణికి ఈ యేడు పెండ్లి చేయుదురా?

నాయు: చేస్తాను. ఏరువాక మహోత్సవాలలో ప్రధానము జరుగుతుంది. శ్రావణమాసములో పెండ్లి అవుతుంది.

పెద్ది:- ఇంతకూ వర నిశ్చయమైనట్లేనా?

నాయు: అందులో సందేహమేమున్నది? రాజయ్యకు ఇవ్వాలనే నా సంకల్పము.

కొండ:-మీ సంకల్పము కావచ్చు. కాని అమ్మగారి కిష్టము లేదటగా ?

గంగి:-ఆ మాట నిజమే. ఆమె దృష్టి అంతా డాక్టరు మీద ఉన్నది. చివరికిది యెట్లా జరుగుతుందో?

పెద్ది:- అట్లా చెప్పండి. అందుకనే కాబోలు ఈ రోజు మీటింగులో ఆయన నాగమ్మ ప్రక్కనే కూర్చున్నాడు. లేకపోతే గుండెఉందీ ? ఇంతకూ నాగమ్మ అభిప్రాయమేమిటో? పైపై మెఱుగులకు - హోదాలకు - మురిస్తే మీ మాట సాగదు.

నాయు: అట్లా జరుగదులే పెద్దిరెడ్డీ! మా నాగు నామాట కాదనదు. కాని అదేమి కర్మమో - ఇందాక ఆకలుష వర్తకుడు కూడా డాక్టరువంక చూపిస్తూ "ఈయనగారేనా

మీా అల్లుడు'' అని అన్నాడు. ఆమాటకు జవాబు చెప్ప టానికి నేనెంతో బాధపడ్డాను.

కొండ: ఇందులో కర్మమేముంది ? నాగమ్మ పెద్దచదువులు చదివింది గనుక – మొదటినుంచీ బస్తీ పద్ధతులకు అల వాటుపడింది గనుక – అందఱూ అలాగే అనుకుంటారు. నిజానికి ఈకాలములో చదువుకొన్న పిల్లలు పల్లెటూరి సంబంధాలు చేసుకొంటున్నారా? రాజయ్య మీాకు దగ్గఱి వాడు గనుక మీారైనా యివ్వాలనుకొన్నారు గాని మఱొకరికైతే యిస్తారా ? మీాహోదాకు తగిన సంబం ధాన్నే మీారూ చూచుకొనేవారు. ఏమైనా సరే త్వరలో పెండ్లి జరిగించండి.

గంగి:– మీా అభిప్రాయాన్ని రాజయ్యకు తెలిపారా?

నాయు: లేదోయ్ ! ఇవ్వాళ చెప్పుదా మనుకొన్నాను.

ఆమాట ముగియులోపలనే రాజయ్య యేమియుఁ దెలియనట్లు గదిలోఁ బ్రవేశించినాఁడు. గంగినీడు అతనివంకఁజూచి ''సమయానికి వచ్చావు రాజయ్యా ! నీ పెండ్లి సంగతే మాట్లాడుతున్నాము. నాగమ్మను పెండ్లాడుట నీకిష్ట మేనా?'' అని అడిగినాడు.

రాజ:– మీాకు ఇష్టమైతే నాకూ ఇష్టమే. నే నెన్నడూ పెద్దల మాట కాదనను. ఇంతకూ మామయ్య ఇష్టమేమిటో తేలవద్దూ?

నాయు: నాయిష్టము ఏనాఁడో తేలింది రాజూ! నాగు నీసొమ్ము. నేటినుండి ఆమె నీకు వాగ్దత్త. మీాయిరువురు ప్రేమించుకొనవచ్చును.

రాజ:— కృతార్థుడను మామా! నాగును చిన్నప్పటినుండి ప్రేమించాను. నాగు కూడా నన్ను ప్రేమించింది. నా సిద్ధాంతాలకు నాగు మెఱుగు పెట్టుతుంది. ఈ జన్మలో నాగుకంటె నాకు కోరదగినది యేమీలేదు. ఆమెకొఱకు నేను ఏత్యాగమైనాచేస్తాను. అవసరమైతే నా ప్రాణాలు కూడా ధారవోస్తాను. ఈ నాటికి నాకోర్కె నెఱవేరింది గనుక మీకు పదివేల నమస్కారాలు.

కొండ: అంత తొందరవద్దు రాజయ్యా! ఆ మూడుముళ్ళు పడ్డదాక నెఱవేరిందని అనుకోవద్దు. మామయ్య కిష్టమైనా మీఅత్తకు ఇష్టమున్నట్లు కన్పడదు. ఏది ఎట్లున్నా నాగమ్మను మాత్రము గట్టిచేసుకో. పిల్ల సిద్ధమైతే యెవరెంత తన్నుకొన్నా యేమీ చెయ్యలేరు. ఈ కాలపు పిల్లల్ని నమ్మరాదని నా విశ్వాసము. అందులో బస్తీ పిల్లల్ని అసలే నమ్మరాదు.

రాజయ్య మఱేమాట పలుకలేదు. తాను వచ్చిన పనిని గుఱించి పెద్దిరెడ్డితోను – మేనమామతోను – ముచ్చటించి, అధ్యక్షుడుగా నుండుటకు మంగపతిరావును ఒప్పించెను. తరువాత వాఱందరుఁ గలసి నాయుడుగారితోఁగూడి ఆయన యింటికిఁబోయిరి. రాజయ్యముఖములో నానందము మూర్తీభవించెను.



నలుగురి యెదుట నాగమణి రాజయ్యతో వాగ్దత్తమైన సంగతి మంగమ్మకు [illegible]. అందు కామె కాదన లేదు—అవునన లేదు. కాని [illegible] వానికి—కాని దానికి — భర్తమీద [illegible] — [illegible] జొచ్చినది. ఆమె వర్తనము [illegible] కష్టమనిపించి నది. ఆమె యెంతగానో [illegible] — [illegible] నిప్పులు క్రుమ్మరించు చున్నను — [illegible] కొడిగట్టక — పరువుకోస మతడు [illegible]. [illegible] కష్టము లేని ప్పుడు పరువుగల మగ వా[illegible] లేదు.

ఆనాటి మధ్యాహ్నము — [illegible] తరువాత తండ్రికూతురు గదిలో [illegible] చుండిరి. వారు పిలవకుండగనే మంగమ్మ [illegible] పోయెను. రాజయ్య గృహములో లేడు.

నాయు: నీ యభిప్రాయమేమిటో [illegible] నాగూ!

నాగ:- నీయిష్టమే నాయిష్టము నాన్నా!

నాయు: పెండ్లిసంగతి కాదమ్మా! [illegible] జమీందారిణి వద్దకు మనము [illegible] మనుకొన్నాముగా? అనీ గాక మొన్న పున్నమ్మ ద్వారా మనకు ఆహ్వానము కూడా పంపినది. మీటింగు [illegible] అయినా ఆమె పిలిచినందుకైనా మనము పోవద్దూ?

నాగ:- నేను రాను నాన్నా! అవసరమైతే మీరొక్కరే పోయిరండి!

నాయు:నీవు రానవటానికి కారణము ?
నాగ:- బావ పోవద్దన్నాడు. బావకిష్టము లేనిపని నేను చేయను.

ఆ మాట వినుసరికి మంగమ్మకు శివమెత్తి నట్లయినది. ఆమె మనసు నిగ్రహించుకోలేక - "అవునమ్మా ! ఆ బావ చెప్పటానికీ - ఈ మఱదలు వినటానికీ- జత కుదిరిపోయింది. ఇంత కంటె గొప్ప సంబంధము దొఱకదనీ-ఇంతకంటె అంద గాడైన వరుడు దొఱకడని - ఆ భోగభాగ్యాలన్నీ అమ్మా యికి దక్కుతవనీ - కోరికోరి మీ నాన్న కుదిర్చిన సంబం ధము కాదూమఱి ? బావమాటలు వింటె బాగుపడ్డట్లే. ఇప్పుడే యింతగాఉన్నది. ఇక ముందెట్లు ఉంటుందోలే " అని కడుపులోని అక్కసు పట్టలేక - నిప్పులు కుప్పవోసి— పోయినది.

తల్లి పలికిన కటువుమాటలకు నాగమణి నిర్ఘాంత పోయినది. రాజయ్యబావ పట్ల తన తల్లికింతటి అయిష్ట మున్నసంగతి ఆమె కింతవఱకుఁ తెలియదు. అందుకుఁ గార ణముగూడ నామెకు బోధపడలేదు. కాకపోతే అతఁడు దరిద్రుడఁనీ - ఇంగ్లీషుచదువు రానివాఁడనీ - ఈకాలపు వేషాలు వేయడనీ - చెప్పటకంటె అతనిలోఁ నెన్నఁదగిన దోషాల్మ మఱెవ్వియు లేవు. నాగమణి యేమియుఁదోచక విషణ్ణవదనముతోఁ తండ్రివంకఁ జూచినది. మంగపతిరావు నాయుడు కుమార్తె హృదయమును గుర్తించి మఱల సంభా షణ కుపక్రమించినాఁడు.

నాయు:దానిమాటల కేమిలేతల్లీ! బావ నిన్ను పోవద్దనటానికి కారణమేమో చెప్పు?

నాగ:– నాకు తెలియదు నాన్నా ! నీ వడిగినట్లే నేనుగూడా బావను అడిగాను. కాని నిదానముమీద నీకే తెలుస్తుం దంటూ – ఆమె నీచురాలనీ – స్త్రీ జాతికి పరమ శతృవనీ – పోవద్దనీ — అన్నాడు. ఇంతకంటె నా కేమీ తెలియదు.

నాయు:ఏదో చెప్పరాని మహాకారణ ముంటుంది. లేక పోతే రాజు ఈ విధముగా అనడు. అతని బుద్ధి నాకు తెలుసు. కారణము లేకుండా అతడెప్పుడూ ఒకరిని దూషింపడు. అయినప్పటికీ నే నున్నానుగా నాగూ! నా మాట విను. మనము పోకపోతే మర్యాదగా వుండదు. ఈ సాయంకాలము వస్తామనికూడా కబురుచేసినాను. పోయి వచ్చు నంతలో కలిగే ప్రమాదమేమీ లేదు. అదీగాక మనము పోయినామంటే మీ అమ్మకూడా కొంత శాంత పడుతుంది.

నాగ:– బావ తప్పుగా భావిస్తాడేమో?

నాయు:బావను సమాధాన పఱచే భారము నాది. సరేనా? సరిగా మూడుగంటలకు బయలుదేరుదాము. ఈలోపల ప్రయాణానికిసిద్ధపడు. నేను కలపదొడ్డికి వెళ్ళివస్తాను. మన గుఱ్ఱపు బండి సిద్ధముగా ఉంచమని పెద్దిరెడ్డితో చెప్పు.

నాగ:– కారుమీద పోగూడదూ !

నాయు:వద్దులే. కొంచెము తగ్గిఉంటేనే మంచిది. తరువాత నీ యిష్టము.

అనిచెప్పి మంగపతిరావు నాయుడు – చుట్ట ముట్టించుకొని – కలపదొడ్డికి వెళ్ళినాఁడు. నాగమణి వరండాలోనికి వచ్చి – పెద్దిరెడ్డిని పిలిచి – బండి సిద్ధము చేయించుమని చెప్పుచుండఁగా మంగమ్మ లోపలినుండివచ్చి – "బండివద్దు– కారు సిద్ధము చేయండి" అని చెప్పినది. కూఁతురు తల్లి మాటను గాదనలేదు.

సాయంకాలము మూఁడు గంటలైనది. తన కిష్టము లేకున్నను దల్లి బలవంతముమీఁద నాగమణి – నవనాగరక పద్ధతి ప్రకారము – అలంకరించుకొన్నది. తలకట్టు రెండు పాయలుగా విడదీసి రెండుజడలు వేసుకొన్నది. పెదిమలకు ఎఱుపురంగు అద్దినది. మొగమునిండ మెఱుఁగు పూఁతలు పూసినది. చీరెకట్టుటమాని వదులులాగు – కాలరు సిల్కు-షర్టు–తొడిగినది. మొగమున బొట్టు పెట్టుకోలేదు. చేతులకు గాజులు లేవు. ఎడమ చేతికి చిన్న రిస్టువాచి కట్టినది. పైన జల్తారు మైజారు కప్పినది. కాళ్ళకు ఎత్తుమడిమలుగల స్లిప్పర్సు తొడిగినది. మద్రాసునుండి విజయవాడలో రైలు బండి దిగినప్పటి వేషముతో నాగమణి చక్కఁగా ముస్తాబైనది. మంగమ్మ కుమార్తె వేషమునకు మురిసిపోయినది. ప్రయాణమున కన్నియు సిద్ధమైనవి. నాగమణి తండ్రికోస మెదురుచూచుచు గదివాఁకిట నిలఁబడి యున్నది.

అంతలో రాజయ్య - ఏదో పనిమీఁద - ఇంటికి వచ్చి - పాశ్చాత్య నాగరకతా కుమారివలె గడపలో ప్రత్యక్షమైన మఱఁదలిని జూచి - చాల వింతపడినాఁడు. మద్రాసునుండి వచ్చిన తరువాత నాగమణి యిట్టి వేషమును ధరించుట కిదే మొదటిసారి. ఇప్పుడీ విధముగా వేషము మార్చుటకుఁగల యవసరమేమో బోధపడక - రాజయ్య మఱఁదలి చెంతకుఁబోయి - "నాగూ! ఈ వేషమేమిటి? ప్రయాణ మెచ్చటికి? మద్రాసుకు పోవుచుంటివా?" అని ప్రశ్నించెను.

రాజయ్యను చూచుసరికే యామె నిలువునఁ గంపించి పోయినది. అతఁడు తన చెంతకువచ్చి ప్రశ్నించుసరికి ఆమెకు నోట మాటరాలేదు. వెలవెలఁ బోవుచున్న వదనముతో - వణకుచున్న పెదవులతో - నాగమణి యతని ముఖమువంకఁ జూడసాగినది. అతఁడు వచ్చుట చూచి మంగమ్మగూడా నచ్చటికి వచ్చి - కుమార్తెకు వెనుక ప్రక్కగా నిలఁబడినది. రాజయ్య మఱఁదలి బుజము తట్టుచు "నాగూ! ఎందు కింత భయము? నీ సంతోషమునకు నే నడ్డురాను. అసలు సంగతి యేమిటో తెలియక అడిగినాను. కష్టముగా ఉంటే చెప్పకు" అని బుజ్జగించినాఁడు. ఆ మాటలకుఁ గొంచెము తేరుకొని ఆమె మెల్లగా మాట్లాడినది.

నాగ:- నీకు చెప్పరాని దేమున్నది బావా! నాన్న కోటకు పోదామన్నాడు. మా ప్రయాణ మక్కడికే. మళ్ళీ రాత్రికి తిరిగి వస్తాము.

రాజ:- అందుకనా యీ వేషము మార్పు?

నాగ:- ఈ మార్పు నా కిష్టములేదు. కాని కాదు గూడదని అమ్మ బలవంతపెట్టింది.

ఆ మాటకు వెనుక నిలఁబడియున్న మంగమ్మ అందుకొని "అవును రాజయ్యా! నేనే మార్చుకొమ్మన్నాను. ఇందులో తప్పేమున్నది? నాగు ఈ వేషములో చూడ ముచ్చటగా ఉంటుంది. చదువుకొన్నపిల్లకు పాడు పల్లెటూరి వేషాలు తగవు. నీ పాత సిద్ధాంతాలతో నా బిడ్డను మూసి వాయనపు ముత్తైదువలె తయారు చెయ్యకు. పిలకజుట్టుతో- ముతకపంచెలతో - నీవున్నది చాలకనా మా అమ్మాయిని గూడ పాడుచేస్తున్నావు?" అని కటువుగా పల్కినది.

తల్లిమాటలకు నాగమణి మనస్సు చివుక్కుమన్నది. రాజయ్య యేమాత్రము నొచ్చుకోక- గంభీరహృదయముతో "అత్తా! నాగు నాకు ప్రాణమువంటిది. ఆమెను నేను పాడు చేయుదునా? ఎంతమాట! నాగుకు ఏది యిష్టమైతే అది నాకూ ఇష్టమే. ఆమె యభిరుచికి నే నెన్నడూ అడ్డురాను. ఆమెను సంతోషపెట్టుటయే నా జీవితకార్యము. అవసరమైతే ఆమె సుఖానికి నా రక్తాన్నికూడా ధారపోస్తాను" అని తన పవిత్ర ప్రేమను ప్రకటించినాఁడు.

మంగమ్మకు రాజయ్య మాటలలోని నిగూఢ నిష్కల్మషప్రేమ బోధపడలేదు. కాని నాగమణి యతని పవిత్రహృదయమును గుర్తించినది. ఆమె ముఖము ప్రఫుల్లమైనది. అనురాగముతోఁ దడిసిన హస్తముతో భావచేయు

ఇక్కడికి పోరాదు - అని ఇంత ఒత్తిడి చేస్తున్నావు. రేపు ఆ కాస్తపని అయినాక పుట్టింటికి గూడ పోవద్దంటావు. అదేమంటే ఏదో కొంపమునిగిపోతుందని జోస్యము చెప్తావు. అప్పుడు నీ మాట కద్దేముంటుంది! నిన్ననే వా రెవ్వరుంటారు? నోరులేని నా బిడ్డ - ఏమీ జరుగనప్పుడే యింత భయపడుతుంటే - అప్పుడు నీ మాట కెదురుచెప్ప గలుగుతుందా? ఇంతకూ దాని రోజులూ - నా రోజులూ - మంచివి కాక పోబట్టె ఆయనకీ దుర్బుద్ధి పుట్టింది. లేకపోతే ఇంతకంటె మంచి సంబంధాలు లేకనా? ఇంతకంటె భాగ్యవంతులు దొరకకనా? మేనల్లుడైనంత మాత్రాన మంచి చెడ్డలు చూచుకోవద్దా? బిడ్డ కష్టసుఖాలు విచారించుకోవద్దా? ఇంతకూ దానికర్మ అలాఉంది. నేనేమి చేస్తాను?

అని మంగమ్మ తన మనసులోనున్న అక్కసంతయు వెడలఁగ్రక్కినది. నిజముగా నీసారి రాజయ్య నిలువునఁ గ్రుంగిపోయినాఁడు. అతని హృదయము పూర్తిగా సంక్షుభితమైనది. మంగమ్మకుఁ దనపట్ల యింత నిరసనభావము — ఇంతటి యసంతృప్తి — ఉన్నట్లు రాజయ్య కింతవఱకుఁ దెలియదు. అతని ముఖములో నిరాశాదైన్యములు తొణికిసలాడినవి. అతని చూపులో నిరుత్సాహము పొడసూపినది. ఆతఁడు మాటాడలేదు. పెద్ద తుపాను వచ్చుటకు ముందు ప్రకృతిమాత వహించు గంభీర నిస్తబ్ధతవలె నతఁడు కదలిక లేని మౌనముద్ర ధరించి యవమానభారముతోఁ దలవంచి

నాఁడు. అతని యాకారమును దిలకించు సరికి నాగమణి తల గిఱ్ఱున తిరిగిపోయినది. కన్ను లశ్రుపూరితములైనవి. ఆమె యటనిలువఁ జాలక గదిలోనికిఁ బోయి వెక్కి వెక్కి యేడువసాగినది.

మంగమ్మ - తన కడుపులోని అక్కసుపట్టలేక - ఇంతగా మాట్లాడినదే కాని కుమార్తె దుఃఖము చూచుసరికి నిలువున నీరైపోయినది. రాజయ్యను అట్లనుట తప్పనికూడ తెలిసికొన్నది. తొందరపడి యన్నందు కెంతో పశ్చాత్తాప పడుచున్న దానివలెఁ గనుల నీరుపెట్టుకొని "నాయనా! రాజయ్యా! ఏదో తెలిసీ తెలియక తొందరపడి అన్నాను. నామాటలు పాటించుకోకు. ఏదో పోవద్దన్నావని కోపము పట్టలేక అన్నాను గాని నిజముగా నీమీద నాకు కోపము లేదు. నా సంగతి నీకు తెలియదూ? చిన్నప్పటినుండి నిన్ను పెంచాను. పెద్దచేశాను. నాబిడ్డవంటి వాడవనే భావముతో మాట్లాడాను గాని అసూయతో అనలేదు రాజయ్యా! మనసు చిన్నబుచ్చుకోకు. నాగు నిన్నుగాక మరెవ్వరినీ పెండ్లాడదులే. అది గదిలో ఏడుస్తున్నది. దానిని ఓదార్చు నాయనా!" అని యెంతో బ్రతిమిలాడినది.

మంగమ్మ పలికిన సానునయ వచనమువల్ల రాజయ్య మనసు కొంత కుదుటపడినది కాని యాకుందు మాత్రము పూర్తిగాఁ బోలేదు. తన సంగతి యెట్లున్నప్పటికిఁ దన కొఱకై బాధపడుచున్న నాగమణిని ఓదార్చుట ముఖ్యమని తలంచి యతఁడు గదిలోనికి బోయి - కుమిలి కుమిలి యేడ్చు

చున్న మజుఁదలని జూచి "నాగూ! ఏమిటి యీ వెఱ్ఱి? ఊరుకో. ఏడ్చి చేసేదేమున్నది? విధి ప్రకారము జరిగి తీరుతుంది. మీ అమ్మమాటలు నాకు క్రొత్తగావు. అందుకు నీవు బాధపడుట తగదు. నీ మనసు కష్టపడిన నేను చూడ లేను. లే. ప్రయాణానికి తయారుగా! మీ నాన్న వచ్చేవేళ అయినది. ఈ సంగతి ఆయనకు తెలియరాదు. లే నాగూ! లే. నీముఖము కళ కళలాడుతుంటేనే యీ రాజయ్య బ్రతుకు. లేక పోతే అంతా శూన్యమే" అని యెంతగనో చెప్పి ఆమెనోదార్చినాఁడు.

నాగమణి యేడుపుమాని లేచినది. మఱొక్క సారి సబ్బుతో ముఖము కడుగుకొన్నది. పరిమళచూర్ణమును కొన్నది. కళకళలాడుచు రాజయ్య యెదుటికివచ్చి-"బావా! అమ్మ - నిన్ను అనరాని మాటలన్నది. వట్టి మూర్ఖురాలు. నామీఁద ప్రేమకొద్దీ ఆమె అన్నదంతా మఱచిపో"— అని తన ప్రేమసుధాకలశమును తొణికించినది. రాజయ్య ప్రఫుల్ల వదనముతో నామెతోఁ గలిసి బయటికి వచ్చినాఁడు.

అంతలో మంగపతిరావునాయుఁడు గూడఁ దనకార్య కలాపమును ముగించుకొని గృహమున కరుదెంచెను. నాగమణి ప్రయాణమునకు సిద్ధమైయుండుట - రాజయ్య అడ్డుచెప్పకుండుట - చూచి నాయుఁడు చాల సంతోషించి నాఁడు. మరి యాలస్యమొనర్చక తండ్రి కూఁతురు కాకినాడ కోటకు వెళ్ళినారు.

షుమారొక పావుగంటలో వారిద్దఱుఁ గోటకుఁ జేరినారు. అప్పటికి నాలుగు గంటలైనది. వారిరాక ముందు గనే తెలియుటచేతఁ గోటలోని ప్రతినిధి - పున్నమ్మ వారిని ముఖద్వారము నొద్దనే యెదుర్కొని యెంతో మర్యాద చేసినది. తరువాతఁ బ్రతినిధి వెంట నాయుడు క్రింది యంతస్తు గదిలోనికి వెళ్ళినాఁడు. పున్నమ్మ వెంట నాగమణి మూఁడవ యంతస్తులోని రూపలతాదేవి మందిరమున కరిగినది.

రూపలత మందిర ద్వారము నొద్దనే నాగమణి నెదుర్కొని — కరస్పర్శ చేసి — చాల గౌరవముతోఁ దోడ్కొని పోయి - సోఫామీఁదఁ దనప్రక్కనే కూర్చుండఁ బెట్టుకొని-తగిన మర్యాద చేసినది. తరువాత నప్పటికప్పుడు తయారైన వేడివేడి తినుబండారములు - పసిపుష్పములు - రకరకాల పండ్లు - చల్లని పానీయములు - షర్బత్తులు తెప్పించి యామెతోఁగలసి విందారగించినది. ఇవన్నియు ముగిసిన పిదప రూపలత నాగమణితో యిష్టాగోష్ఠి కుపక్ర మించినది.

రూప:- నాగమణీ! ఈ రోజున నాకు సుదినము. నీవంటి చదుకొన్నవాళ్ళతో సంభాషించే అవకాశము నాకు కలిగినది. నిజముగా వీరా నాయుడు పేట సీవల్ల చాల పేరుగాంచినది. నీవు బి. ఏ. పరీక్ష ప్యాసయినా వనుకొంటాను.

నాగ:- అవునండీ!

రూప:- ఇంకనూ పైకి చది వెదవా?

నాగ:- అది మా నాన్నగారి యిష్టము. అయినా యింత వఱకు చాలదూ?

రూప: అవునులే. మన చదువులు ఉద్యోగాలకొరకు గాదుగా? స్వేచ్ఛాజీవులకు ఉద్యోగాలు కూడా ప్రతిబంధకము లనుకొంటాను.

నాగ:- నిజమేకాని అందరూ మానుకొంటే పరిపాలనా చక్ర మెట్లు తిరుగుతుంది? పురుషులు ఉద్యోగాలు చెయ్యాలి. దానివలన కలిగే ఆనందాన్ని స్త్రీలు అనుభవించాలి.

రూప: అలా అయితే గొప్ప ఉద్యోగముచేసే భర్తను సంపాదించుకొన్నావన్నమాట.

పున్నమ్మ ఆమాట కడ్డమువచ్చి "లేదండీ అమ్మగారూ! ఆమెకు కాఁబోయే భర్త ఇంగ్లీషు చదువురాని ఒక పల్లెటూరి మనిషి. నాయుడుగారి మేనల్లుడు. అనరాదుకాని ఇంత గొప్ప చదువు చదివిన అమ్మాయిగారికి ఆయన తగడండీ! ఈ సంబధాన్ని నాయుడుగా రెందుకు కుదిర్చారో బోధపడ కున్నది. ఆ రాజయ్యగారికి ఈనాటివాళ్ళంటేనే సరిపడదు" అని పలికినది.

రూప: ఏమమ్మా! ఇదంతా నిజమేనా?

నాగ:- నిజమే. మా నాన్నగారి మాటను నేను కాదనలేను. అదీగాక ఇంగ్లీషుచదువు రాకపోతేనేమి? మా రాజయ్య బావ కున్నంత ప్రపంచజ్ఞానము మరెవ్వరికీలేదు. ఆయన కరుడు గట్టిన దేశాభిమాని, నిజమైన జాతీయవాది.

రూప: నేటి యభిరుచులకు తగినట్లుండవద్దూ?

నాగ:- ఆసంగతి నాకు తెలియదు. అందలి మంచిచెడ్డలన్నీ మా నాన్నగారికి బాగా తెలుసు.

రూప: పిచ్చితల్లీ! ప్రపంచాన్ని నీ కండ్లతో నీవు చూడాలి. ఏమి జరుగుతున్నదీ నీ బుద్ధితో నీవు గ్రహించాలి. అంతేకాని ఒకరి యభిప్రాయానికి తలవ్రాపరాదు. వారి భావాలను దోసిలొగ్గరాదు. ఇది చదువుకొన్నవాళ్ళ లక్షణము. పోనీలే మీ నాన్నగారితో నేను మాట్లాడు తాను. అది విడిచిపెట్టు. నేను నిన్నొక్కటి కోరదలంచాను. నా కోర్కె నీవు తప్పక చెల్లించాలి. ఏమంటావు?

నాగ:- నాకు మించనిదైతే కాదనను.

రూప: మరేమీలేదు. నేను భారతదేశమంతా చూడ దలచాను. నీవు నా వెంట తోడుగా రావాలి. చదువు కొన్న వాళ్ళే నాకు కావాలి. ఖర్చులన్నీ నేనే భరించు కొంటాను. నీవుకూడా యీ ఉపఖండాన్ని చూడవచ్చు.

నాగ:- తప్పక వస్తాను. ఇదినాకు సమ్మతమే. అయినా మా నాన్నగారితో చెప్పి - ఆయన్నికూడా ఒప్పించండి. ఆయన కాదంటే మాత్రము నేను రాలేను.

రూప: ఇప్పుడే అన్ని సంగతులూ మీ నాన్నగారితో మాట్లాడుతాను. పున్నమ్మా! చెల్లాయికి మనతోట చూపించు. తోటమాలి కోటప్పద్వారా పైకిరమ్మన్నానని నాయుడుగారికి కబురుపంపు. నా గ మ ణీ! మాతోట చూచిరా.

అని రూపలతాదేవి చెప్పినతోడనే పున్నమ్మ నాగ మణిని వెంటఁబెట్టుకొని - క్రిందికిదిగి - తోటలోనికిఁ బోయి కోటప్పద్వారా నాయుడుగారికి కబురు పంపినది. మంగపతి రావునాయుడు కబురందిన వెంటనే మేడపైకిఁబోయినాఁడు. జమీందారిణి అతనిని గౌరవించి - కూర్చుండుమన్నది. తరువాత నామెయే యతనితో మాట్లాడుట కుపక్రమించినది.

రూప : నాయుడుగారూ! మిమ్మల్ని ఒక్కటి అడుగదలంచాను. అందుకు మీరు సరే అనాలి. అడుగమంటారా?

నాయు: ఎంతిమాట? మీ చేతిక్రింద బ్రతికేవాళ్ళము. అడుగ మనటానికి - వద్దనటానికి - మా కధికారమున్నదా?

రూప : అవి పూర్వపురోజులమాటలు నాయుడూ! ఇప్పటి రోజుల్లో మా అధికారాలు చెల్లవు. మిమ్మల్నే మేము ప్రాధేయపడాలి.

నాయు: అధికారాలు చెల్లినా చెల్లక పోయినా మీరు మీరే - మేము మేమే. మీతో మేము సరితూగలేము. మీవాసి యెక్కడకు పోతుంది?

రూప : సరేలే. మేమడిగే దాని కేమంటావో చెప్పు. మేము వచ్చే నెలలో భారతదేశమంతా చూడటానికిపోవాలను కొన్నాము. మాకు తోడుగా మీ అమ్మాయిని పంపాలి. ఆ మాత్రము చదువుకొన్న వాళ్ళు మా కెవ్వరూ తోడు దొరకలేదు. మీ అమ్మాయికయ్యే ఖర్చులన్నీ మేమే భరిస్తాము. మాతోవస్తే ఆమెకు గూడా గౌరవమే. ఆమె కూడా దేశమంతా చూస్తుంది.

నాయు: అంతకంటె మాకు కావలసిన దేముంది తల్లీ! మీరీ విధముగా కోరుట మాపిల్ల అదృష్టమనుకొంటాను. మీతో పంపటానికి నాకెట్టి అభ్యంతరమూ లేదు. కాని ఒక్క మనవి. కొద్దిరోజుల్లో అమ్మాయికి పెండ్లి చెయ్యాలని అనుకొంటున్నాను. ఆ కాస్త పని అయిన తరువాత పోగూడదూ ?

రూప : కొద్ది రోజుల్లోనే చేస్తావా? మఱి సంబంధము కుదిరి నదా ? మాతో మాటమాత్రము ఎన్నడూ అనలేదేమి నాయుడూ! మీకు కాబోయే అల్లుడు ఎంత వఱకు చది వాడు? ఏమి ఉద్యోగము చేస్తున్నాడు? మీకంటె ధనవంతు డనుకొంటాను. మద్రాసులోనే ఉంటున్నాడా? ఇప్పుడైనా వింటాము చెప్పవోయ్!

నాయు: చదువులూ-ఉద్యోగాలూ- లేవండీ! మా యింట్లోనే చిన్నప్పటినుంచీ పెరిగి పెద్దవాడైన మా మేనల్లుడు రాజయ్య కివ్వాలను కొన్నాను.

రూప : అనుకోటమేనా? ప్రధానము గూడా జరిగిందా?

నాయు: ఇంకా లేదు. ఇస్తానని మాత్రము నలుగురి యెదుట చెప్పాను. అదీగాక చిన్నప్పుడే మాపిల్ల అతనికి వాగ్దత్త మైనది. ఆమాట ప్రకారమే నిలబడ్డాను. అతనికి సిరి సంపదలు లేకపోయినప్పటికీ నాకున్నదే యివ్వాలను కొన్నాను.

రూప : ఎంత పనికి పూనుకొన్నావు నాయుడూ! చిన్నప్పు డేదో ముద్దుకొఱకు అన్న మాటలను ఈనాడు పాటిస్తూ

ఆ పిల్లను అధోగతిపాలు చేస్తున్నావన్నమాట. మీ అమ్మాయిని బి. ఏ. వఱకు చదివించినది యీ పల్లెటూరి మనిషి కివ్వటానికేనా? ఎంత బాగున్నది? లోకులెవరన్నా వింటే యేమనుకొందురు? కావలసినంత సిరీ - సంపద - ఉండీ కూడా నాయుడుగారు కట్నానికి లోపించి ఒక్కగా నొక్క బిడ్డను అంత పెద్ద చదువులు చదివిన పిల్లను-ఒక పల్లెటూరి బయ్యన్న కిచ్చి ఆమె జీవితాన్ని పాడు చేశాడురా - అని అనుకోరూ? ఈ సంబంధము నీకెట్లా నచ్చింది నాయుడూ? నీ హోదాకు - నీ సంపదకూ - ఆ పిల్ల చదువుకూ - ఎంత గొప్ప అల్లుడు రావలసినది? నీ వేమనుకొన్నా ఈ మనువు మాకు నచ్చలేదు.

నాయు: ఇంగ్లీషు చదువు రాకపోయినప్పటికీ మన తెలుగు చదువు బాగా నచ్చినవాడేనండీ మా రాజయ్య. ఈ కాలపు వేషభాషలు లేకపోయినప్పటికీ అనాకారి కాడు. బుద్ధిమంతుడు. ఇద్దఱికీ ఈడు - జోడు - సరిపోయింది. ఉద్యోగము లేకపోయి నప్పటికీ మా వ్యాపారములో గట్టిచెయ్యి. నిజానికి అతడు లేకపోతే నా వ్యాపారము ఇంత పైకి వచ్చేదే కాదు. ఇదంతా విచారించుకొనే అమ్మాయి కూడా కళ్ళయెదుటనే ఉంటుందని - యీ సంబంధాన్ని నిశ్చయించాను. అమ్మాయికూడా ఇందుకు కాదనలేదు. అదీగాక వారికిగల పరస్పరానురాగము చెప్పతరముగానిది. ఇంతకంటె మంచి సంబంధ మేముంటుంది తల్లీ?

రూప : నీవు లక్ష చెప్పినప్పటికీ లోకాన్ని మెప్పించలేవు నాయుడూ! మీ అమ్మాయిని మాతో సరిసమానముగా— మా సొంత చెల్లెలిగా — గౌరవించామంటే ఎందుకో తెలుసా? రాజయ్యను పెండ్లి చేసుకుంటుందని కాదు. పెద్ద సౌందర్యవతి అనీ కాదు. చదువునుబట్టి మీ అమ్మాయిని గౌరవించాము. సంబంధమును బట్టి నిన్ను గౌరవించాము. ఎవ్వరైనా సరే మాతో సరిసమానంగా నిలవాలంటే మాపాటి వంశగౌరవమన్నా ఉండాలి. ధనమన్నా ఉండాలి — చివరకు కనీసము చదువన్నా ఉండాలి. ఈ మూడింటిలో ఏ ఒకటి కూడా లేనివారు మా కోట గుమ్మము త్రొక్కటానికే వీలులేదు.

ఈ రోజులలో ధనానికున్న గౌరవము మరే దేనికీ లేదు. గుణమే గొప్పదంటావు నీవు. నీ మాట ప్రకారము గుణాన్నిబట్టి చూస్తే ఈనాడు పేరుగల వారందరూ ఎందుకూ కొరగాని వారే. ఇట్టి వారందరు మహానాయకులై ప్రభుత్వ యంత్రాన్ని నడుపుతున్నారంటే ధనము కారణము గాని గుణము కాదు. ధనముంటే యెంతపనినైనను చేయవచ్చు. ఏ పాటైనా పాడవచ్చు. నీవు చెప్పినట్లు మీ రాజయ్య బుద్ధిమంతుడే కావచ్చు. కావ్యాలూ — శాస్త్రాలు — చదివినవాడే కావచ్చు. కాని యీ రోజుల్లో ఏ. బి. సి. డి. ల కున్న గౌరవము మరి యే చదువుకూ లేదు. ఆ చదువువాని వ్యక్తికి ముందేమో కాని — యిప్పట్లో గౌరవము లేదు. దీన్ని బట్టి చూస్తే మీ అమ్మాయికి రాజయ్య తగడు.

అదీగాక నీ హోదాకు- నీ సంపదకు- ఈ సంబంధము తగునేమో నీకు నీవే దూరదృష్టితో యోచించి చెప్పు. ఫలాని నాయుడుగారి అల్లుడంటే నీ పేరునకు తగినట్లు ఉండవద్దూ? నాయుడుగారి అల్లుడికి ఏ ముద్యోగమని ఎవరైనా అడిగితే యేమంటావు? కలపవర్తకపు లెక్కలు వ్రాసే ఉద్యోగమంటావా? పొలము దున్నుకొనే పని అంటావా? ఏమన్నప్పటికీ అది నీ హోదాకు తక్కువనక తప్పదు. అల్లా అంటే గౌరవమూ ఉండదు.

నీ సంగతి యెట్లున్నా ఇంత చదువు చదివిన అమ్మాయికైనా గౌరవముండవద్దూ? రాజయ్యనే పెండ్లాడితే మీ పల్లెలో ఎవ్వరైనా మీ అమ్మాయిని "ఏమండీ!" అంటారా? అందఱూ "నాగమ్మ" అని పిలిచేవాళ్ళేగా? తక్కిన పుల్లమ్మలతో పాటు మీపిల్లకూడా ఒక యల్లమ్మ అవుతుంది. ఇంత చదువు చదివించినది యీ గౌరవానికేనా నాయుడూ? తక్కిన పల్లెపడుచులకంటే మీ కుమార్తె ఆధిక్య మేమిటి? అదే వేషము - అదేభాష - చివరకు ఆమె కూడా ఒక పల్లెటూరిపిల్ల. మీ రాజయ్యకు నచ్చేవికూడా ఆపల్లెటూరి వేషభాషలే. ఆయనకు నేటి నాగరికతయన్నా - బస్తీ పద్ధతులన్నా- ఇప్పటి వేషధారణమన్నా- గిట్టవుటగా?

ఒక్కమాట నాయుడూ! మాతో సరితూగవలెనంటే- మా కోటకు వస్తూ పోతూ మా గౌరవాన్ని పొందవలెనంటే- ఈ సంబంధము మీ అమ్మాయికి తగదయ్యా! డబ్బు లేక పోయినప్పటికీ ఈ కాలపు చదువున్న సంబంధము ఏదైనా

విచారించి మఱి చెయ్యి. ఇంతగా చెప్పుట నాగమణి గారి
వానికే అని అనుకో. తరువాత నీ యిష్టము.

ఇంతకూ నీ భార్య యిష్టపడినదా యీ సంబంధానికి?

నాయు: లేదు. అదీ మీరు చెప్పిన ధోరణిలోనే యున్నది.
కాని నామాట కెదురు చెప్పలేక నోరు మూసుకొన్నది.
అప్పుడప్పుడూ మాకు పోట్లాటలు తప్పుట లేదు.

రూప: అట్లా చెప్పు. ఇప్పుడే యిలా ఉంటే— పెండ్లి అయిన
తర్వాత ఎలా ఉంటుందో ఊహించుకో? వెఱ్ఱివాడా!
ఇంట్లో ఆడదాని కిష్టము లేకుండా మగవాడేమి చేయగలడు?
ఒకవేళ కాదని చేస్తే అది యేమంత రాణిస్తుంది? అసలు
ఆడపిల్ల విషయము తల్లికి తెలిసినట్లు తండ్రికి తెలియదు.
అందులో పెండ్లి అంటే సామాన్య విషయము కాదు.
యావజ్జీవితానికీ చెందిన సమస్య. ఇటువంటి విషయాలల్లో
ఆడదాని సలహా తీసికొనకుండ పురుషుడు స్వతంత్రించ
రాదు. అందువల్ల ఎన్నో యిబ్బందులు కలుగుతవి.
కుటుంబ జీవనాలే కూలి పోతవి. ఈ మాత్రమైనా
విచారించలేదేమి నాయుడూ! నీ కంటె నీ భార్యయే
మెఱుగన్న మాట.

నాయు: మీరు చెప్పినదాన్ని కాదనలేను కాని యిస్తానని
యేనాడో మాట యిచ్చాను. నిన్నకూడా నలుగురి
యెదుట అదే చెప్పాను. మాట తప్పుట పెద్దమనిషి
లక్షణమా? నలుగురేమంటారు?

రూప: ఏనాడో అన్న మాటకోసము — అభము శుభము తెలియని చిన్నదాని గొంతు కోయుటే పెద్దమనిషి లక్షణము కాబోలు! అందుకు నలుగురూ ఏమనరు. ఏమి న్యాయమయ్యా నాయుడూ?

నాయు: మారుమనువుకు అమ్మాయి ఒప్పుకుంటుందా?

రూప:— దీనికి ఒప్పుకోలేదూ? నాగమణి బుద్ధిమంతురాలు. నీమాట కాదనలేదు. నీ యిష్టప్రకారము నడుస్తుంది.

నాయు: నాకంతా అయోమయంగా ఉన్నది. ఇప్పుడేమీ చెప్పలేను. ఇంటికిపోయి ఆలోచిస్తాను. రాజయ్యకు ద్రోహము చెయ్యాలంటే నా మనస్సు జంకుతున్నది.

రూప:— అతనికి ద్రోహము చెయ్యమని యెవ్వరంటారు. చిన్నప్పటినుంచీ పెంచావు — పెద్దచేశావు. అతనికి కొంతఆస్తి ఇవ్వు—అతని జీవితానికి లోటులేకుండా చెయ్యి. పిల్లనియ్యనంతమాత్రాన ద్రోహము చేసినట్లవుతుందా? పిచ్చివాడా! నివింకా చీకటిలోనే ఉన్నావు. అసలు సంగతి నీకు తెలియదు కాబోలు! మీతోటమాలి సింగయ్య కూతురు — జానకి—మీ రాజయ్యను ప్రేమిస్తున్నదట. అతను కూడా ఆమెను గాఢముగా ప్రేమిస్తున్నాడట. మీ అమ్మాయిని పెండ్లాడిన తర్వాత ఆమెనుగూడా పెండ్లాడాలని అతని సంకల్పమట. ఇదంతా లోలోపల జరుగుతున్న కుట్రయట. దీన్నిబట్టి మీ రాజయ్య ఎంత బుద్ధిమంతుడో ఆలోచించుకో. ఈ సంగతంతా మా పున్నమ్మ చెప్పింది. అందుకనే యింతగా చెప్పవలసి వచ్చింది.

అదీగాక ఈ మధ్య ఒకటి జరిగింది. ఇది చాలా రహస్యమైన విషయము. ఎవ్వరికీ తెలియరాదు. నీవు మాకు విశ్వాసపాత్రుడవు గనుక చెబుతున్నాను. జాగ్రత్త. ఈ విషయము బయటికి పొక్కినదా నీ మర్యాద దక్కదు. ఇది నీలో — మాలో-జీర్ణించిపోవాలి. మీ అమ్మాయికికూడా చెప్పరాదు.

సింగయ్య బ్రతికి ఉండగా - ఒకప్పుడు మా దగ్గరకు వచ్చి తనబిడ్డ కేమైనా బ్రతుకుదారి చూపించ వలసినదని అడిగాడు. సినీమాలోకి పంపితే పైకివస్తుందని చెప్పాను. అతడు సరే అన్నాడు. తరువాత జానకి గూడా ఒప్పుకుంది. ఇంతలో సింగయ్య చనిపోయినాడు. అందువల్ల కొంత కాలయాపన జరిగింది. కొద్దిరోజుల క్రిందట జానకి తన నిరాధార స్థితిని గురించి మాకు తెలుపుకొన్నది. మా సినీమా కంపెనీలో చేరుటకు ఒప్పుకొన్నది. ఆమె మాటలు నమ్మి — చెరువుక్రింద రెండెకరాల మాగాణి - ఆ తోట - అందులో మీరు కట్టించిన యిల్లు — అన్ని అధికారాలతో ఆమెకు దానపత్రము వ్రాసియిస్తూ — రెండువేల రూపాయల రొఖ్ఖముగూడ పంపినాను.

ఈ సంగతి తనకు ప్రియుడైన రాజయ్యకు చెప్పింది కాబోలు — అతడు జానకిని సినీమాలోకి పోవద్దన్నాడట. పైగా మీ అమ్మాయిని పెండ్లాడిన తరువాత ఆమెను పెండ్లి చేసుకొంటానన్నాడట. జానకి అతని మాటకు సమ్మతించి సినీమాలోకి రానని కబురుచేసింది. అయితే మా ఆస్తిని మేము తిరిగి కోరలేదు. కక్కిన కూటికి ఆశించే స్వభావము

మాకు లేదు. దాన్ని గురించి నీవేమీ తగాదా చెయ్యవద్దు. అసలు ఈసంగతి బయటికి రానేకూడదు. ఒక బీదపిల్లకు దానము చేశామనుకొంటాము. రాజయ్య బుద్ధిమంతు డని చెప్పావే? అతని మంచితనమిదేనా? నిజానికి జానకిమీద తనకెంత ప్రేమ లేకపోతే వద్దంటాడు? ఆమెను ప్రేమించ వద్దనను. కాని ఒకవంక ఆమెను ప్రేమిస్తూ — ఏమీ యెఱుగనట్లు — నిన్ను — నాగమణిని - మోసగించ వద్దం టాను. నాయుడూ! నీవు మా వాడవనే విశ్వాసముతో ఈ రహస్యాన్ని బయట పెట్టాను. జాగ్రత్త. మూడో మనిషికి తెలియకుండా నీపని నీవు చక్కబెట్టుకో. జానకినిగాని—రాజ య్యనుగాని — ఏమీ అనకు. వారిపట్ల ఎటువంటి మార్పు చూపకు. ఇదంతా మాసలహా. తరువాత నీ యిష్టము.

అని చెప్పి రూపలతాదేవి మేడదిగి తోటలోనికిఁ బోయినది. నాయుడుఁ గూడా డోలాయమానమానసుఁడై — ముందేమున్నది గమనింపక — ఆమె వెనుకనే మెట్లుదిగి — కోటగుమ్మము దాటిపోయి—కారులో కూలఁబడినాఁడు. అతని మనస్సులో లెక్కలేనన్ని యాలోచనలు పొడచూపినవి. జమీందారిణి చెప్పిన సంగతులన్నియు స్మృతికి వచ్చినవి. తన కుమార్తె గౌరవము విషయమై రూపలతాదేవి చెప్పిన మాటలు - అతని హృదయమును దాకినవి. ఆమె చెప్పిన దానిలో నబద్ధములేదు. రాజయ్యకే ఆమెనిచ్చి పెండ్లిచేసిన— ఆ గ్రామములో నామెను "ఏమండీ" అని పిలచువారుండరు. ఆమె చదువును గౌరవించువా రుండరు. అందఱితోఁ బాటు—

ఆమె గూడ - ఒక పల్లెటూరి పడుచు గాక తప్పదు. ఇంత పెద్దచదువులు చదివించినది పల్లెటూరి పిల్లగాఁ దయారు చేయుటకేనా? ఇట్టి యాలోచన పరంపరతో నతని తల తిరిగిపోయినది. తన హోదాకు—తన సంపదకు - రాజయ్య సంబంధము తగదని కూడ అతఁడనుకోక పోలేదు.

అది నిజము కానీ- అబద్ధముకాని- జానకీ రాజయ్యల రహస్య ప్రణయమును గుఱించి జమిందారిణి చెప్పినది కూడ నాయుఁడు విశ్వసించినాఁడు. అందువల్ల మేనల్లునిపట్ల అతనికిఁ గల సదభిప్రాయము కొంతవఱకు సడలి పోయినది. ఒక విధమైన అసూయ భావములు గూడ నతని మనోవీథిలోఁ బరువులెత్తినవి. చివర కతఁడు చిన్నప్పటినుండీ పెంచి పెద్దఁ జేసిన తన మేనల్లుని స్వభావమునే గుర్తింప లేనంతటి మూఢుఁడైనాడు. అతనిలోఁ గలిగిన యీ మార్పు - అతని ముఖములోఁ బ్రస్ఫుటముగాఁ గన్పడు చున్నది.

కొంతసేపటికి నాగమణితోఁ గలసి రూపలతాదేవి యచ్చటికి వచ్చినది. డ్రైవరు హెచ్చరిక మీఁద నాయుడు వారి రాఁకను గుర్తించి కారులోనుండి దిగినాడు. నాగమణి తండ్రి ముఖమువంక జూచి యెందుకో భయపడినది. అతఁ డేదో దీర్ఘాలోచనలో మునిఁగి యున్నట్లు ఆమె వెంటనే గ్రహించినది. కాని తండ్రిమధ్య- రూపలతాదేవిమధ్య- ఏమి నడచినది తెలియక - అతని ముఖములోఁ గన్పడుచున్న విపరీతమైన మార్పునకుఁ గారణమేమో బోధపడక - ఆమె హృదయము చాల కలఁతనొందినది.

రూపలత నాగమణిని కారులో నెక్కించి మఱొక సారి యామెతోఁ గరస్పర్శ చేసినది. నాయుఁడు సెలవు గైకొని యెక్కి కుమార్తె ప్రక్కనే కూర్చున్నాఁడు. జమీందారిణి వారికి వీడ్కోలొసంగినది. కారు బయలుదేరి – దీపాలు పెట్టువేళకు – నాయుడుపేట చేరినది.

చువ్వల సందులగుండా ఆకసమున మునిగి పడిపోయినదేవో తునకలను దదేకదృష్టితోఁ జూచుచు - రాజయ్య రాకనే గుర్తింపకుండెను. పడమరనైపు గదిలో మునిగి పడిపోయినదేవో లెక్కలు సరిచూచుకొనుచుండెను.

రాజయ్య సరాసరి మఱందలి గదిలోనికిఁ బోయి - యింకను బరధ్యానములో మునిఁగియున్న యామెను హెచ్చరించుచు-"ఏమిటా దీర్ఘాలోచన నాగూ?" అని ప్రశ్నించుచు నామె కెదురుగా నున్న పడకకుర్చీలోఁ గూర్చుండినాఁడు.

అప్పటి కామె తన యేకాంత ముద్రలోనుండి జాగ్రదవస్థకు వచ్చి-"ఏమీ లేదు బావా! నీ రాక కొఱకే యెదురు చూచుచు - విభిన్న దృక్పథములలోఁ దారాపథమునఁ బరుగిడుచున్న ఆ మేఘమాలికా సంయోగ వియోగాలను గాంచుచున్నాను. అదేమో కాని కోటనుండి మామ వచ్చి నప్పటినుంచీ నా మనసు చాలకలతపడ్డది. అందుకు కారణ మేమో నాకు బోధపడుటలేదు" అని చెప్పినది.

రాజ:- కోటలో జరిగిన విశేషాలే యిందుకు కారణమై ఉండవచ్చు.

నాగ:- నాకు తెలిసినంత వరకు క్రొత్తసంగతులేమీ లేవు. కాని మా నాన్నలో మాత్రము చెప్పరానంత మార్పు కనబడుతున్నది. అక్కడినుంచి వచ్చినప్పటినుంచీ ఆయన నాతో మనసు విప్పి మాట్లాడుటలేదు. ఏదో చికాకుగా ఉన్నాడు. ఈ ప్రొద్దునగూడా ఏదో మాట్లాడుతూనే నా వంక ఒక విధమైన వెఱ్ఱిచూపుతో చూచాడు. అంతలోనే

తడిసిన కన్నులతో అవతలకు వెళ్ళాడు. ఇదేమిటో నా కర్థమగుటలేదు. కోటకు పోతే పెద్దమార్పు వస్తుందని నీవు చెప్పిన జోస్యము నిజమయ్యేటట్లు కన్పడుతున్నది. నా కెందుకో చాల భయము వేస్తున్నది బావా!

రాజ:- ఏమీ లేదులే నాగూ! ఊరక భయపడతా వెందుకు? కోట విశేషాలేమో చెప్పు. జమీందారిణి నిన్ను గౌరవముగా చూచినదా? బెట్టుసరి లేకుండ నీతో చనువుగా మాట్లాడినదా? ఏమన్నదో చెప్పు.

నాగ:- తన చెల్లెలిమాదిరిగా నన్ను ప్రేమతో చూచి గౌరవించినది. తన సరసనే కూర్చుండబెట్టుకొని నాతో చక్కగా మాట్లాడినది. నీవన్నంతగా ఆమె మాటలలో గాని — చేతలలోగాని — నా కేలాటి నైచ్యమూ కన్పడలేదు. ఆమె చాల సరసురాలనే అనుకొన్నాను. చివరకు నన్ను మాత్రము ఒక్క కోరిక కోరినది. ఆమె భారత దేశమంతా పర్యటన చేస్తుందట. తోడుగా నన్ను తనవెంట రమ్మన్నది.

రాజ:- అలా చెప్పు. అందుకు నీ వేమన్నావు?

నాగ:- సరే అంటూ మా నాన్నను కనుక్కోమన్నాను.

రాజ:- మీనాన్న యేమన్నాడు?

నాగ:- ఏమన్నదీ నాకు తెలియదు.

రాజ:- తెలిసేదేముందిలే. మీ నాన్న కూడా ఒప్పుకొనే వుంటాడు. ఆమెమాటకు మీనాన్న ఏ విషయములోనూ అడ్డు చెప్పడు. ఆయనకు జమీందారిణి అంటే ఎంతో

గౌరవము. ఎక్కడలేని భక్తి శ్రద్ధలు. ఒకవేళ ఆమె మన వివాహాన్ని కాదన్నా మీ నాన్న అందుకు కూడా సమ్మతిస్తాడు.

నాగ:- అదేమిటి బావా! అట్లా అంటావు. మా నాన్న అంత తెలివి తక్కువ వాడు కాదు. మాటతప్పే మనిషి కాడు. నలుగురిలోనికి పోనేర్చినవాడు. రానేర్చినవాడు.

రాజ:- ఊరకే మాటవరుస కన్నదానికి ఇంత ఉపన్యాస మెందుకూ నాగూ? ఆ విషయాన్ని అలాఉంచు. మీ నాన్న సమ్మతిస్తే నీవు పోనున్నావన్నమాటగా?

నాగ:- పోదామనే ఉంది. దేశాన్ని చూడాలని నాకూ అని పిస్తున్నది. ఇంతకంటె మంచి అవకాశము చిక్కదు కూడా. ఇంతకూ నీయభిప్రాయ మేమిటో చెప్పన్నా?

రాజ:- చెప్పేదేమున్నది? నాఅభిప్రాయ మెప్పుడూ ఒక్కటే. ఆమెతో నీవు పోరాదనియే నా సలహా.

నాగ:- ప్రతిదానికీ అట్లా అంటావేమి బావా! ఆమెతో వెళ్ళితే వచ్చే ప్రమాద మేమున్నది? ఆమె పేరు ప్రతిష్ఠలు గల ఒక జమీందారీ కుటుంబానికి చెందినది. మంచి గౌరవ మర్యాదలు గలది. చక్కగా చదువుకొన్నది. ఇంతకంటె మంచి సహవాసము మనకు లభిస్తుందా? ఆమెమీద నీకింతటి నీచాభిప్రాయ మెందుకు కలిగిందో నాకు బోధపడుట లేదు.

రాజ:- ఇప్పుడు బోధపడదులే. ముందుముందు నీకే తెలిసి వస్తుంది. అసలు మన సంప్రదాయ ప్రకారము ఆడది గడపదాటి పోవచ్చా?

నాగ:– అయితే యింటిలోనే మురిగిచావు మనియా నీ అభి ప్రాయము? ఆడదానికి దేశాన్ని చూచేయోగ్యత లేదూ? అబ్బ! ఇంత పాతసిద్ధాంతాలేమి బావా నీవి?

రాజ:– నాగూ! పాతలోనే గట్టితిన మున్నది. అది యీ నాటి వాళ్ళకు బోధపడదు. ఆడవాళ్ళు ఇంటిలోనే మురిగి చావాలని సిద్ధాంతాలు చెప్పవు. వారికి దేశాన్ని చూచే యోగ్యత ఉన్నది. కాని అది యిప్పుడు కాదు. పెండ్లి అయిన తరువాత భర్తతో గూడి దేశమంతా చూడవచ్చు. అందుకనే మన పూర్వులు తీర్థయాత్రలను ఏర్పాటు చేశారు. ప్రతి గృహస్థుడు తన భార్యతో గూడి తీర్థయాత్రల పేరుతో ఆసేతుహిమాచలము పర్య టన చేయవలెనని మన పెద్దలు ఒక నియమ మేర్పరి చారు. ఈ యాచారము నేటి వరకు సర్వేసర్వత్రి జరుగు చున్నది. కాశీ రామేశ్వర యాత్రిలు ఇందు కొఱకే యేర్పడ్డవి. మన పూర్వులు మూర్ఖులుకారు నాగూ! పెండ్లి అయినాక నీ భర్తతో గూడి దేశసంచారము చెయ్యి. నేను వద్దనను.

నాగ:– నీవు చెప్పినది బాగానేవున్నది. కాదనను. కాని తల వని తలంపుగా లభించిన అవకాశాన్ని జారవిడువకుండా రూపలతా దేవితో వెళ్ళినందువల్ల తప్పేమి?

రాజ:– తప్పే. ఆమె ప్రవర్తన మంచిదికాదు. మగనికి మందుపెట్టి – మతి భ్రష్టునిగా జేసి – స్వేచ్ఛావిహారిణియై సినిమా రంగానికెక్కి – నీతి నియమాలు లేకుండా సంచ

రిస్తున్న యీ భ్రిష్టురాలితో నీ వంటి కులీన —ఉత్తమా దర్శాలు గలది వెళ్ళుట పాడిగాదు. సహవాసాన్నిబట్టి మంచివారు కూడా చెడ్డవారవుతారు — తియ్యని నదీ జలము సముద్రజలముతో సంగమించి పానయోగ్యము గాకున్నది.

ఇప్పటివా రెంత మొత్తుకొన్నను స్త్రీకి స్వేచ్ఛా విహారము తగదు. యిది మన పూర్వులు ఎంతో అనుభవము మీద చెప్పినమాట. గడప దాటనంత వరకే ఆడదాని గౌరవము. గడప దాటిన తర్వాత ఆమె లోకదూషణకు గురి కాక తప్పదు. సీతవంటి మహాసాధ్వికే యీపాటు తప్పలేదు.

పెరటిలోపల వికసించిన పుష్పానికి ఉన్నంత గౌరవ శోభలు బయట వికసించిన పుష్పానికి ఉండదు. దానికి దృష్టి దోషమే కాకుండా స్పర్శ దోషముకూడా కలుగుతుంది. రమణి యెంతవరకూ భవన సామ్రాజ్యలక్ష్మి. పురుషునితో గూడి వర్తించినప్పుడే ఆమె శోభిస్తుంది. లేకపోతే ప్రూదము వాసిన పద్మినీ కాంతవలె చెడిపోతుంది. ఒంటరిపాటున కీచకుని యింటికి పోయిన పాంచాలివంటి మహాపతివ్రతకే భంగపాటు తప్పలేదు. ఈ కాలపు వారొక లెక్కా?

మన భారతీయ మహిళాచరిత్ర ప్రపంచములో సాటి లేనిది. పరపురుషుని కంట బడుటకే ఒప్పుకోక పద్మినీదేవి తన ప్రాణములు అగ్నిదేవున కర్పించినది. స్త్రీ గౌరవాన్ని కాపాడుటకై మన భారత వీరయోధులెందరో తమరక్తాన్ని ధారపోశారు. మన పూర్వులు స్త్రీవ్యక్తిని ఆరాధ్యదైవ

ముగా భావించి పున్నాలలో పెట్టి పూజించారు. మన సంఘంలో స్త్రీ కున్నంత గౌరవము మఱియే దేశములోనూ లేదు. ఈ నగ్నసత్యాన్ని తెలుసుకోలేక యీనాటి వేషభాషలకు దాసులైన స్త్రీ పురుషులు తప్పుదారులు త్రొక్కుతున్నారు. చివరకు మనము పూజించు దేవుళ్ళుకూడా స్త్రీ పదముతోనే స్మరింపబడుచున్నారు. ఇంతకంటే స్త్రీ కోరదగిన ఘనత యేమున్నది! మన భారతీయులకు స్త్రీ దేవమాత.

నాగూ! నాదొక పిచ్చిధోరణి. నేటివారికి నచ్చదు కూడా. ఏమైనా సరే నీవా సినిమానటితో పోరాదనియే నా సలహా. నీవంటి కులకన్యలకు అట్టి స్వైరసంచారము తగదు. తరువాత నీ యిష్టము – నీ తండ్రి యిష్టము.

వీరి సంభాషణ మంతయుఁ బ్రక్కగదిలోనుండి విను చున్న మంగపతిరావునాయుడు – వారున్న గదిలోనికిఁ జివాలున లేచివచ్చి – ఒక విధమైన యీసడింపుతో "రాజూ! నీ యభిప్రాయాలకూ – సిద్ధాంతాలకూ – అంతు లేదన్నమాట. ప్రతిదానికీ ఏదో ఒకటి అడ్డుచెప్తావు. ప్రతివ్యక్తినీ ఏదో ఒక రీతిగా విమర్శిస్తావు. ప్రతి పనినీ ఏదో ఒక విధముగా ఆక్షేపిస్తావు. మున్నటి మీటింగులో డాక్టరును పట్టుకొని దులిపేశావు. అధ్యక్షురాలుగా ఎన్నుకోబడ్డ రూపలతా దేవిని అనరానిమాటలన్నావు. నిన్న ఆమె దగ్గఱకు పోవుటే పనికి రాదన్నావు. నేడు ఆమె సహవాసమే తగదని సలహాయిస్తు న్నావు. నీ అభిప్రాయమేమిటో అర్థమగుట లేదు. నీ దృష్టిలో నేటివాళ్ళంతా నీతిలేనివాళ్ళే. నీ వొక్కడవే నీతిమంతుడవు–

దేశాన్ని ఉద్ధరించేవాడవు. ఆకాశాన్నుంచి ఊడిపడ్డావు కాబోలు! ఒకరితప్పు లెన్నేవాళ్ళు తమ తప్పులుకూడా తెలుసుకోవాలి.

రూపలతాదేవి గొప్ప జమీందారిణి. చక్కగా చదువుకొన్నది. ఆమె సంసారాన్ని గురించి ఏదో ఒక అపవాదు పుట్టింది. అది నిజమెంతో అబద్ధమెంతో ఎవ్వరికీ తెలియదు. ఆ తెలియని విషయాన్ని పట్టుకొని ఆమె శీలాన్ని శంకించుట తప్పు. అదిగాకపోతే ఆమె సినిమాలల్లో వేషాలు వేస్తున్నదంటావు. వేస్తే తప్పేమిటి? ఒక కళను చక్కగా పోషిస్తున్నదనుకోరాదూ? చెడ్డగా ఎందుకు భావించాలి? నీ మాట ప్రకారము నిర్ణయిస్తే యీనాడు సినిమాలల్లో వేషాలు వేసే వారంతా నీతి నియమాలు లేని వారనే చెప్పాలి. అట్లా చెప్పుట సాహసమనిపించుకోదూ?

రాజ:- నా అభిప్రాయమది కాదు మామయ్యా! వారిలో కూడా మంచివారు ఉంటే ఉండవచ్చు. వారి నెవ్వరూ కాదనరు. అట్టివారికి నా ధన్యవాదాలు - కాని మన సంప్రదాయాన్ని బట్టి అట్టి వేషధారణ కులస్త్రీలకు కూడదంటాను.

నాయు: ఎందుకని? ఆ వేషాలు వేసేవారికి గౌరవము లేదనేనా నీ భావము? ఈనాటి సంఘములో వాళ్ళ కెంత గౌరవ మున్నదో నీ కేమి తెలుసు? మహానాయకులు కూడా వాళ్ళను కళోద్ధారకులని ప్రశంసిస్తున్నారు. గొప్పగొప్ప సభలుచేసి ప్రజలు వాళ్ళను సన్మానిస్తున్నారు. అదంతా గౌరవము కాదంటావా రాజూ!

రాజు:- కాదనను. కాని నీవు చూచేదృష్టికీ - నేనుచూచే దృష్టికీ - చాలా వ్యత్యాసమున్నది. ప్రజాసంఘము కులకాంతనూ గౌరవిస్తున్నది. వెలకాంతనూ గౌరవిస్తూన్నది. గౌరవశబ్దము యీ యుభయులకూ ఒక్కటే. కాని వారుపొందే గౌరవములో భేదము లేదంటావా? వెలచెలది పొందే గౌరవానికీ కులస్త్రీ పొందే గౌరవానికీ ఏ విధముగానూ పోలిక లేదు. కాబట్టి సినిమా తారలతో కులస్త్రీలను పోటీకి తేరాదు. వారివారి దృక్పథాలు జీవితమార్గాలు విభిన్నములు.

నాయు: ఏమైనాసరే రాజయ్యా! రూపలతాదేవిని గురించి నీ అభిప్రాయాన్ని మార్చుకోవాలి. ఇకముందెప్పుడూ నీ వామెను విమర్శించవద్దు. ఒకరిని మనము విమర్శిస్తే లోకము మనల్నికూడా విమర్శిస్తుంది. తప్పులెన్నుట సులభమే, కాని తప్పు లేనివారెవ్వరు? పైకి అందరూ పెద్దమనుష్యులే. కాని లోలోపల వారు చేసే ద్రోహాలకు అంతులేదు. వారు బూటకపు సిద్ధాంతాలతో ప్రజా హృదయాన్ని దోచుకునే పచ్చిదొంగలు. ఈ రహస్యాన్ని నీవుకూడా తెలుసుకోవాలి రాజూ! ఒకరిని గురించి తప్పుగా మాట్లాడబోయేముందు ప్రతివాడూ ఆత్మపరీక్ష చేసుకోవాలి. తానే సర్వజ్ఞుడనీ తనకంటె బుద్ధిమంతుడు లేరనీ యెవ్వడూ అనుకోరాదు.

రాజు:- మామయ్యా! నీ మాటలధోరణి నాకేమో వింతగా ఉన్నది. మనసులో ఏదో పెట్టుకొని మాట్లాడుతున్నట్లు

న్నావు. నన్ను గుఱించి నీకేమైనా అనుమానముం
చెప్పు. దీనికింత రాద్ధాంతమెందుకు? నాగు చెప్పిన
నీలో ఏదో ఒకవిధమైన మార్పు కన్పడుచున్నది.
వెంత ప్రయత్నించినప్పటికీ అది దాగుటలేదు.

రాజయ్య ఈవిధముగా మాట్లాడుసరికి మంగపతిరా
నాయుడు బదులుమాట పలుకక తలవంచుకొని తనగదిలో
వెళ్ళినాఁడు. నాగమణికిఁగూడ దండ్రి వచోధోరణి విపరీ
ముగాఁ దోచినది. పరిస్థితులు తాఱుమాఱుగా నున్నట్లు
రాజయ్య మనస్సు శంకించినది. కాని యిదమిద్ధమని తే
లేదు. అతఁడు చప్పున నాలుగు మెతుకులుతిని మఱఁదలి
వార్షికోత్సవ కార్యక్రమమును గూడఁ జూపకుండ భాషా
మందిరమునకు మఱలి పోయినాఁడు.

నాఁటి సాయంకాలము మూఁడుగంటలకు నాగమణి
యింటిలో నేమియుఁ బాలుపోవక కలఁత నొందిన మనస్సును
కుదుటపఱచుకొనలేక జానకినిఁ జూచుటకై యామె గృహ
మున కేగినది.

జానకి తలకు పాసెన కట్టుకొని వసారాలోఁ
గూర్చుండి యేకులువడుకుచున్నది. ఆమె మొఖములో
విషాదచ్ఛాయలు పూర్తిగాఁ దొలఁగిపోలేదు. ఉత్సాహ
రేఖ లంతగా లేవు. చావలేక బ్రతుకుచున్నట్లుగా నామె
మిక్కిలి కృశించి యున్నది. కాని యా శుష్క దేహమును
శాంతము గుత్తకుఁ గొన్నట్టుగా నామె మూర్తి పరిశుద్ధతకుఁ
దావలమై యొప్పుచున్నది.

పాపమ్మ జానకికిఁ గొంత దూరములోఁ గూర్చుండి ఆసుపోయుచున్నది. గంగినీడు కొడుకు కావడితో నీళ్లు తెచ్చుచున్నాఁడు. ఇంటి కెదురుగా—— వేపచెట్టు క్రింద—— చల్లని నీడలో - గోమాత హాయిగా నెమరు వేయుచున్నది.

నాగమణి వచ్చినంతనే పాపమ్మ లేచి - జానకమ్మకు దాపున నొక యొక్టిపీట వైచినది. ఆమె దానిమీఁదఁ గూర్చుండి —— జానకి ముఖమువంక నెగాదిగఁజూచుచు—— "తలకు వాసెన గట్టినావెందుకమ్మా! నీ బారు వెంట్రుకలన్నీ యేమైనవి? నాతో చెప్పవూ జానకీ" అని యడిగినది.

జానకి కనుల నీరు పెట్టుకొని కొంత సేపటివఱకు నేమియుఁ జెప్పలేదు. తరువాత బాపమ్మ వంకఁ జూచినది. అప్పుడామె నాగమణి వైపు చూచుచు "ఏమి లేదు నాగమ్మా! తండ్రి చనిపోయినప్పటినుంచీ దిగులుతో తల దువ్వుకోక పోవుటచేత వెంట్రుకలన్నీ ఒక్కటే జడగా పెన వేసుకొన్నవి. ఎంతకష్టపడినప్పటికీ——ఆచిక్కు విడిపోలేదు. పైగా తలనిండ పేలు పడ్డవి. ఇందువల్లనై తేనేమి——దిగులు వల్లనై తేనేమి——ఎంత చెప్పినా వినకుండా——జుట్టంతా కత్తిరించి వేసినది. నలుగురూ ఏమంటారోయని తలకు వాసెన కట్టుకొన్నది. ఏమిటోనమ్మా! యెంత చెప్పినా వినదు. పట్టుమని పట్టెడన్నము కూడా తినదు. పొద్దస్తమానము ఒక్కటే యేడుపు. పాపము! ఆ రాజయ్య ధర్మాన నిన్న - నేడు - ఈ మాత్రము ప్రజల మొగము చూస్తున్నది." అని పూసగుచ్చినట్లు చెప్పుసరికి జానకి - ఆపరాని దుఃఖముతో కలవల యేడువ సాగినది.

ఆ వృత్తాంతము విన్న నాగమణికిఁ గూడఁ గన్నులు తడిసిపోయినవి. ఆమె దన శక్తికొలది జానకిని ఓదార్చినది. అంతటితోఁ దృప్తిపడక - ఆమెను పూర్తిగాఁ దేర్చు నిమిత్తము —— సంభాషణ లోనికి దింపినది.

నాగ:- నీవు చేసినపని నాకు నచ్చలేదు జానకీ!

జాన:- ఎందుకమ్మా నాకీ పాడుబుట్టు? ఇది ఉండి నన్ను ఉద్ధరిస్తుందా యేమి? నావంటి దరిద్రురాలికి ఇంత తలకట్టు ఉండుట కూడా ఒక మహాపాపమే.

నాగ:- అలా అనకు. దరిద్రానికీ —— జుట్టుకూ —— సంబంధ మేమిటి? కళకళ లాడుతూ ఉండే నీ ముఖము —— ఇప్పుడెంత చిన్న బోయినదో నీకేమి తెలుసు?

జాన:- చిన్నబోతే నేమి ? చెడిపోతే నేమి ? నా కెందుకు నాగూ! అందచందాలు?

నాగ:- అయితే పెండ్లి చేసుకోవా యేమి?

జాన:- ఈ జన్మకు అదొక్కటే తక్కువ నాగూ! నాకప్పుడే పెండ్లి తొందరయేల? నాకంటె వయస్సులో పెద్దదానవు. అన్నివిధాలా ఉన్నదానవు నీకే యింతవరకు పెండ్లి కాలేదే? ఇంక నావంటి నిర్భాగ్యురాలి మొగమెవ్వరు చూస్తారు? అయినా జీవితమే రోసినదానికి పెండ్లెందుకు? నీవు త్వరగా చేసుకో నాగూ ! మీదంపతులను చూచి సంతోషిస్తాను.

పాప:- ఆమె పెండ్లి స్థిరపడినట్లే. కొద్దిరోజుల్లోనే జరుగుతుంది.

జాన:- వరుడెవరమ్మా ! మీ రాజయ్య బావేనా?

అవునన్నట్లు నాగమణి సిగ్గుతోఁ దలవంచుకొన్నది. జానకి కనులనుండి రెండు అశ్రుకణములు రాలినవి. ఆమె బరువెక్కిన హృదయముతో నొక్క వేడినిట్టూర్పు విడిచి మరల సంభాషణము సాగించుకొన్నది.

జాన:- నీవు నిజముగా అదృష్టవంతురాలవు నాగూ! రాజయ్య బావ వంటి పురుషుడు ప్రపంచములో మఱి లేడనియే నా విశ్వాసము. ఆయన పవిత్రమూర్తి. ప్రణయ తపస్వి. అచంచల హృదయుడు. పరిశుద్ధ వర్తనుడు. ఆయనకు నీవు భార్యవు కాగలిగినావంటే నీ స్త్రీజన్మ సార్థకమైనదన్నమాట. ప్రదానము జరిగినదా పాపమ్మా!

పాప:- లేదమ్మా! ఈ యేరువాక మహోత్సవాలలో జరుగుతుంది. శ్రావణ మాసములో పెండ్లి అవుతుంది. ఇట్లని నాయుడుగారు మొన్న నలుగురి యెదుట చెప్పినారట. రాజయ్యకూడా పెండ్లికి సమ్మతించినాడట.

ఇట్లిట్లు మాట్లాడుకొనుచుండగా రాజయ్య యేదో పని మీఁద నచ్చటికి వచ్చినాఁడు. అతనిని జూడఁగనే నాగమణి వినీలనయనాభ్రములు ఆనంద సుధను వర్షించినవి. ఆమె అనురాగ హృదయములో దాగియున్న ప్రణయాంకురము లా యానంద సుధా సేచనము వలన ననలూని సాగినవి. ఆమె పట్టరాని సంతోషముతో అంచులు దాటిన ప్రణయోత్సాహముతో మందహాసము మధురాధరములపైఁ జిందులాడ "బావా! నీ కొఱకే వచ్చినాను. ఒక్కసారి తోటలోనికి పోవుదమా? యని యతని ప్రేమహృదయమును గదలించినది.

నాగమణి నిర్మల ప్రణయ వచోవిలాసమునకు ముగ్ధుఁడై రాజయ్య వచ్చిన పనిగూడ మరచిపోయి సుందరితో వన విహారమునకు బయలు దేఱెను. వా రుభయులు అంటున్నవారు చూతురన్న బిడియమేగూడ మాని చెట్టా పట్టాలు పట్టుకొని మహోల్లాసముతో నా వనవీథులఁ దిరుగఁ జొచ్చిరి. ఆ పరస్పర పవిత్ర ప్రణయ తన్మయత్వములో వా రెంతదూరము పోయినదీ వారికే తెలియదు.

వారు వనవీథుల నధిగమించి – నాగులదిబ్బనుదాటి–పంట చెఱువుదాపున —— ఒక చిన్నగుట్ట మలుపునఁ గల యొక చిట్టడవిలోఁ బ్రవేశించిరి. ఆ చిట్టడవి వారికిఁ గ్రొత్తది కాదు. ప్రతిదినము కలపపనివాండ్రు అచ్చటికే వచ్చి పని చేయుచుందురు. అందు రకరకాల కలపవృక్షము లున్నవి. ఆ తరుమూలముల గుత్తనల్లుకొని — తమ శాఖాపల్లవములతో బిగియారఁ గౌఁగిలించుకొని — వికసిత కుసుమవదనములతో – శోభించుచున్న పుష్పలత లెన్నియో కన్నుల విందొనర్చు చున్నవి. చిత్తమును చిగురింపఁజేయు సుందర ప్రకృతి దృశ్యములు — మేను మరపించు —— శిశిరమంద మారుతములు– ప్రణయోద్రేకమును బెంపొందించు నే కాంత స్థలము – ఆ ప్రణయమూర్తులకు జీవితమాధుర్యమును బంచి పెట్టెను.

నాగమణి ప్రణయభారముతోఁ గ్రుంగిపోయి —— రాజయ్య భుజస్కంధము నూతగఁగొని – నడువజొచ్చినది. అతఁడు ప్రియురాలి భారమును పరిగణింపక – అవలీలగా

సంచరించుచు - ప్రణయప్రబంధముతోఁబాటు ప్రకృతి కావ్య మును గూడఁదెఱచి యందలి నిగూఢార్థములను ముచ్చటింప సాగెను.

రాజ:- నాగూ! ఈ మాధవీలతను చూడుము. ఒక మహాపతి వ్రతవలె పరసమాశ్రియమును గోరక — ఆపాదపపావ ములనే పూజిస్తూ—పరులను కన్నెత్తైయైన చూడనొల్లక- ఆ తరుపత్రముల మాటున దాగిఉన్నది.

ఇటు చూడు. ఇదిగో సాయిాలత. దీనికీ అభిజాత్య గౌరవముంది. కాని స్వైర్యవిహారిణి. కుటిలగామి. నీతి నియ మాలు లేనిది. అందుబాటులో ఉన్న ప్రతి తరురాజును ఆక ర్షిస్తుంది. అల్లుకొంటుంది. ఎన్ని చెట్లకు ఎగబ్రాకినదో చూడు.

అయ్యో! పాపము! ఇది చాల అన్యాయము నాగూ! ఈ మాలతీలతను చూడు. దీనినెవ్వరో ప్రియతరుసమాశ్ర యమునుండి లాగి - వేఁరొక తరువున కంటగట్టినారు - శక్తి చాలని మాలతి వారి దౌష్ట్యమునకు దాసోహమన్నది.

ఇది మహాచిత్రము నాగూ! ఈరాధామనోహరాన్ని చూడు. తాను ఆశ్రియించిన వృక్షమెందు చేతనో నిర్జీవమై పోయింది. అయినప్పటికీ ఆ మోడునే అంటిపెట్టుకొని — రాగమాధుర్యాన్ని చిలుకుతూ - పూలహస్తాలతో పూజిస్తు న్నది. ఎటువంటి ప్రితివ్రితాలక్షణము? దీనికి యేలతకూడా సాటిరాదు. ఉత్తమ ప్రేమతత్వానికి ఇది గొప్ప ఉదా హరణము.

రాజయ్య యీ తీరున బ్రణయ ప్రపంచములోఁ బర్యటించుచు - బాహ్యజగత్తునే మఱచి - సృష్టివైచిత్ర్యములను ముచ్చటించుచుండఁగా నా త్రోవనే పూరమున మంగపతినాయుడు - అతని యనుచరులు వచ్చుచుండిరి. వారి రాక వీరికిఁ దెలియనే తెలియదు. వారు కొన్నిదూరములోనికి వచ్చిరి. మంగపతి సహచరులు నాగమణి రాజయ్యలను గుర్తించి - వారి దాంపత్యమునకు సంతోషించిరి. కాని మంగపతి మాత్రి మా ప్రణయకృత్యమును సహింపఁజాలక - చరచరా వారిని సమీపించి - రాజయ్య కౌఁగిటిలో దాగి యున్న కుమార్తెను బలవంతమున నివలకులాగి — పిచ్చి యెత్తిన వానివలె మేనల్లుని నోటికివచ్చినట్లు దూషింప సాగెను.

మంగ: మూర్ఖుడా! ఇంకను బ్రధానమన్నా జరుగలేదు. ఈ తీరున సంచరిస్తే లోకులేమనుకుంటారు? ఇదియేమి మర్యాదరా?

రాజ:- అదేమిటి మామయ్యా! మొన్న నలుగురి యెదుట నాగు నీ సొమ్మని నీవేకదా చెప్పితివి? చిన్నప్పటినుంచి మేము భార్యాభర్తలమనే లోక మనుకుంటున్నది.

మంగ:-మాట యిచ్చినంత మాత్రాన అప్పుడే మగడవైతివా? నీ పిచ్చిపోకడలు నా ముందర సాగవు. నేను నా మాట మార్చుకొన్నాను.

రాజ:- మార్చుకోటానికి కారణము?—

మంగ: నీ ప్రవర్తనమే!

రాజ:- నా ప్రవర్తనమా? నా నడతలో లోపమున్నదా? నా ప్రేమలో గ్రుడ్డితనమున్నదా?

మంగ: అవును ముందీ ప్రశ్నకు సమాధానము చెప్పు. జానకి నిన్ను ప్రేమిస్తున్నాదా లేదా ?

రాజ:- ప్రేమిస్తున్నది.

మంగ: నీవామెను ప్రేమిస్తున్నావా లేదా? నిజముచెప్పు

రాజ:- ప్రేమిస్తున్నాను. కాని-

మంగ: ఈ కానీ గీనీ నాకక్కఱలేదు. నీవామె యింటిలో రాత్రిపూట నిద్రిస్తున్నావా లేదా?

రాజ:- నిద్రిస్తున్నాను. ఇది సింగయ్య చనిపోయినప్పటి నుండి మాత్రమే.

మంగ: ఆసంగతి నాకు తెలుసు. రూపలతాదేవి జానకికి కొంత ఆస్తి - రొక్కము - ఇచ్చిందా లేదా? నీవెందుకో ఒణుకుతున్నావు. నిజము చెప్పు. మీ గుట్టంతా నాకు తెలిసిపోయింది. దాచినందువల్ల ప్రయోజనము లేదు.

రాజ:- ఆ నీచురాలు ఆస్తి యిచ్చినమాట వాస్తవమే.

మంగ: ఆమె కాదు నీచురాలు. నీవే నీచుడవు.

రాజ:- ఆరహస్యము నీకుఁదెలియదు. నేనిప్పుడు చెప్పరాదు.

మంగ: నీవు చెప్పనక్కఱలేదు. నాకంతా తెలుసు. నీ వామెను సినీమాలోకి పోవద్దన్నావా లేదా?

రాజ:- నేనుకాదు. ఆమె తండ్రియే వద్దన్నాడు.

మంగ: చనిపోయిన సింగయ్యమీద పెట్టి తప్పుకోకు. నీవింతటి ద్రోహివని నే నెన్నడూ అనుకోలేదు. నీవు

తన సహచరుల సహాయముతో నొడలెఱుంగనిబిడ్డను జేతుల మీఁదఁ గొనిపోయెను.

రాజయ్య కిదియొక స్వప్నగాధవలెఁ దోచినది. కాని యదార్థమని బోధపడిన తరువాత నంతయు నయోమయ ముగాఁ గన్పడినది. అతని నోట మాటయే లేదు. ఆ యసత్య దూషణము నంతటిని అతఁడు ధీరచిత్తముతో సహించినాఁడు. ఆస్థితిలో నంతకంటె నతఁడు చేయఁదగినది యేమియు లేదు. ఒక్క క్షణములో నతని పవిత్ర ప్రేమ భాండము పటుక్కున పగిలిపోయినది. అతని సుఖజీవన జ్యోతి ఆరిపోయింది. అతఁ డొక పిచ్చివాఁడు. అతని భవిష్యజ్జీవితా కాశమున విషాద తిమిరాంధ కారములు గ్రమ్మినట్లు — దెసల కారుచీఁకటి కెంపులు క్రమ్ముకొనఁ జొచ్చినవి. ఆ చీఁకటి తెరల మాటున నతఁడదృశ్యుఁడైనాఁడు.

## ౧౦

ఇల్లు చేరునప్పటికి నాగమణికిఁ గొంచెము స్మృతి వచ్చినది. మంగమ్మ తత్తరపాటుతో బిడ్డనులోనికిఁ గొని పోయి పక్కవేసి - పరుండఁబెట్టినది. కాని యామెకు పక్క నచ్చుట లేదు. తెలిసి తెలియని వైకముతో నలుమూలల శూన్యదృక్కులను బంపి — ఉస్సురనుచు— "నాన్నా యింకా రాలేదూ?" అని ప్రశ్నించినది. ఆమె ప్రశ్నకు సమా ధానము చెప్ప నోరురాక నాయుఁడు తలవంచు కొన్నాఁడు.

అంతలోఁ బెద్దిరెడ్డి బిక్క మొగము పెట్టుకొని లోనికి వచ్చినాఁడు. చలించుచున్న నేత్రములతో నాగమణి యతని మొగమువంకఁజూచి "రెడ్డి! నీగురుఁడేఁడన్నట? ఈ కటికి చీకటిలో — ఆ చిట్టడవిలో — ఒంటరిగా విడచి వచ్చితివా? పోయి తీసుకురా" అని వాపోయినది. పెద్దిరెడ్డి ఆర్ద్ర నయనాలతో "వస్తాడులే తల్లి!" అన్నాడు. అతని వలన మంగమ్మ జరిగినదంతయుఁ దెలిసికొని నిర్ఘాంత పోయినది. ఈ హఠాత్సంఘటనము వలన బిడ్డకు మతి చెడిపోవునేమోయని యామె చాల భయపడినది. నాయుఁడు డాక్టరు కొఱకు కబురు పంపినాఁడు గాని యతఁడు ప్రక్క గ్రామమున కేగినాడఁని — ఏ రాత్రికోగాని తిరిగిరాఁడని తెలియవచ్చినది.

మంగమ్మ బలవంతముమీఁద రాజయ్యకోసము పెద్దిరెడ్డి సింగయ్య యింటికేగెను. కాని యతని జాడయే తెలియదని జానకమ్మ చెప్పినది. అతనివలన యావద్వృత్తాంతముఁ దెలిసికొని యామె బోరున విలపించినది. ఆ విపరీత సంఘటనమునకు జానకీ హృదయము తుకతుక లాడిపోయినది. ఆ చీకఁటిలో యువకులు కొందఱు కాగడాలు వేసుకొని రాజయ్య కొఱకు నలుమూలలు గాలించి చూచిరి. కాని యతని పొలకువ యెచ్చటను గన్పడలేదు. అతఁడేమయ్యెనో, యెచ్చటికిఁ బోయెనో, యెవ్వరికి బోధపడ లేదు.

ఆ రేయి చాల పొద్దుపోయిన తరువాత నాగమణికి విపరీతమైన జ్వరము వచ్చినది. జొన్నగింజ వేసిన పేలగింజ యగునట్లు శరీరమాపాద మస్తకము కాగిఁపోవుచున్నది.

మంగమ్మ బిడ్డస్థితి కాందోళన పడఁజొచ్చినది. ఆదంపతులు–పెద్దిరెడ్డి — కన్నుమూయక కనిపెట్టుకొని – రోగికిఁ జేయవలసిన సకలోపచారములు చేయుచునే యున్నారు. కాని జ్వరతీవ్రత యేమాత్రము తగ్గలేదు. నడిరేయి గడచిన మీఁద — నాగమణి—ఒక విపరీతమైన ధోరణిలో-గుండెలవియునట్లు పలవరింపఁ జొచ్చినది.

"బావా! నన్ను కాదని జానకిని ప్రేమించావా? అదిగో! నీ ముఖము విన్నబోయినది. ఈ పాడు మాట అన్నందుకు చెంపలు వేసుకొంటానులే!"

"నన్ను విడచి ఆ చీకటిలో ఎక్కడికి పోతున్నావు? మా యింటికి రావూ? నాన్న వద్దన్నాడని అంటున్నావా? నేను రమ్మంటున్నాగా?"

"ఆ రహస్య మేమిటో నాన్నకు చెప్పరాదూ? ఇప్పుడు చెప్పవూ? చెప్పకపోతే నాన్న నిన్ను నమ్మడుగా? నా కోసమైనా చప్పు బావా!"

"అయ్యో! ఇదేమి? నన్నెవరికో యిచ్చి పెండ్లి చేస్తున్నారే? నా సంసారము కూలిపోయినది. నా కాపురము కాలిపోయినది. ఆ పాడుముండ — రూపలత పండువంటి నా ప్రేమజీవితాన్ని పాడుచేసినది. ఆమె దుర్మార్గురాలు."

"వద్దన్నకొద్దీ బావమాట వినక ఆ పాడుముండ దగ్గఱకు పోయినందుకు నాకు తగిన శాస్తి జరిగినది. అదుగో! బావ ఋషీశ్వరుడై నన్ను ఆశీర్వదిస్తున్నాడు. రారండఱూ ఆయన పాదాలమీదపడి క్షమాపణ కోరండి!" అని ఉలికిపడగా

నాగమణి ఆ జ్వరతీవ్రతలో నోడలు పెలికనుక ప్రలాపింప సాగినది. నాయుడు గుర్తించిరు గ్రహించలేదు కాని తన దురభిప్రాయమును మార్చుకొనలేదు. ఆము పలుకులు పెద్దిరెడ్డికి భవిష్యద్వాణిగాం దోచెను. మంగమ్మ బిస్మయంగా గూర్చుండి దిక్కుతోచక వెక్కి వెక్కి యేడ్చుచుండెను.

"నెత్తుముమీఁద నా రేయి కోడికి —— వాడికి చెల్లవారినట్లయ్యనది. కాకులు గూయుచున్నను నాగమణి ఆ విపరీత ధోరణినుండి కొంచెముసేపు కన్ను మూసినది. దిక్కులు ఘల్లునఁ దెల్లవారినవి. విషాద తిమిర చ్ఛాయలు విచ్చిపోవునట్లు సూర్యోదయమైనది.

మంగపతినాయుడు డాక్టరుకొఱకు పెద్దిరెడ్డిని బంపెను. మధుసూదనరావు రెక్కలు గట్టుకొన్నట్లు నిముసములో వచ్చి వ్రాలెను. ఆయనను చూడఁగనే మంగమ్మ గొల్లుమన్నది. ఆ యలజడికి నాగమణి మేల్కాంచి కన్నులువిచ్చి చూచినది. డాక్టరు రోగిమంచముదగ్గర కుర్చీలోఁగూర్చుండి పాణిని గ్రహించి హృదయ స్పందనమును చేతిగడియారములో లెక్కించి వెంటనే యొక ద్రవపదార్థమును ఆమె రక్తములోని కెక్కించెను. ఆ యౌషధ ప్రభావమునలన నామె మరలఁ గన్నుమూసెను.

మంగపతి తత్తరపాటు చిత్తముతో నెట్లున్నదని ప్రశ్నింప డాక్టరు మందహాసము చేయుచు — "భయములేదు నాయుడుగారూ! ఒక గంటసేపులో కులాసా చిక్కగలదు. ఈదని హృదయాందోళనవల్ల వచ్చిన జ్వరమే కాని మరేమీ

లేదు" అని స్థైర్యము చెప్పెను. వారిద్దరును ప్రక్క గదిలో నికిఁ బోయి కూర్చుండిరి. మంగమ్మ చెప్పిన కాఫీ తయారు చేసి——పెద్దిరెడ్డిద్వారా - గదిలోనికిఁ బంపించెను. వారు కాఫీ త్రాగిరి.

తరువాత డాక్టరు సిగరెట్టు ముట్టించి —— పొగఁ బీల్చుచు——"నాయుడుగారూ! ఇంతగా మీ అమ్మాయి మనస్సు అందోళన పడుటకు కారణమేమి? ఇది చాలా ప్రమాదకరమైన విషయమండీ! ఒక్కొక్కప్పుడు గుండె ఆగిపోవచ్చునుకూడా. ఇంతకు మీ యదృష్టము మంచిది గనుక ఆగుండము తప్పిపోయినది. ఏమి జరిగినదో చెప్పండి!" అనియడిగెను. నాయుడు నిన్న సాయంకాలము జరిగిన దంతయుఁ జెప్పెను. డాక్టరు చాలా నొచ్చుకొనుచు "ఇక ముందెప్పుడూ ఇట్టి వినరాని విషయాలు హఠాత్తుగా చెప్ప కండి! మళ్ళీ మధ్యాహ్నము వచ్చి చూస్తాను." అని పల్కుచు - లేచి - మరల- రోగి మంచముకడ్డకు వచ్చి- నాడి పరీక్షించి చూచి- "రోగికి బాగా నిద్రపట్టినది. ఇప్పు డల్లా లేపవద్దు. పది గంటలలైన తర్వాత —— లేవకపోతే లేపి - వేడి వేడి కాఫీ యిప్పించండి!" అని చెప్పి వెళ్ళి పోయెను.

నాగమణి - ఒడలు తెలియని చందాన- గాఢముగా నిద్రపోవుచుండెను. నాయుడు ప్రక్కగదిలోఁ గూర్చుండి పెద్దిరెడ్డిని బిలిచెను. అతఁడు వచ్చి యెదురుగా బల్లమీఁదఁ గూర్చుండెను. మంగపతినాయుడు కొంచెము కుదుటపడిన

ఉదయము పదిగంటలైనది. నాగమణి యింకను నిద్రించుచునే యున్నది. డాక్టరు చెప్పిపోయిన ప్రకారము మంగమ్మ యామెను లేపినది. చేతితో తీసివేసినట్లుగా నామె జ్వరమంతయుఁ దగ్గిపోయినది. ఆమె ముఖములో జీవకళ తొంగిచూడఁ జొచ్చినది. తల్లి వేడి వేడి కాఫీ తెచ్చి యామెకుఁ ద్రావనిచ్చినది. కాఫీ త్రాగిన తరువాత - ఒక విధమైన యుత్సాహముతో — నాగమణి పక్కమీఁద నుండి లేచి —చల్లగాలికి వరండాలోనికి వచ్చినది. ఆమెను జూచి యందఱి కన్నులు ప్రమోదజలమును గురిసినవి.

మధ్యాహ్న మగుసరికి డాక్టరు పిలుపు లేకుండగనే వచ్చి రోగిని పరీక్షించి చూచి తన సంతృప్తిని ప్రకటించి నాఁడు. నాయుఁడు దంపతులతనిని దేవునిగా భావించి యతని చికిత్సా సామర్థ్యమును గొప్పగా గొనియాడిరి. నాగమణి కృతజ్ఞతా సూచకములైన చూపులతో నతని ముఖము వంకఁ జూచినది. ఆమె చూపులలోఁ దనచూపులు లీన మొనర్చునాఁడు డాక్టరు. వారి దృక్పథములందుఁ బరస్పర నిగూఢ వార్తాప్రచారము జరిగినట్లున్నది. డాక్టరు ఆమె కేదో యొక తెల్లని మందు బిళ్ళను మ్రింగనిచ్చి వలసిన దానిని తినుమని చెప్పినాఁడు. మందు ఖర్చులకని నాయుఁడు కొంత పైక మీఁబోయెను గాని మధుసూదనరావు పుచ్చు కోక "ఇప్పుడెందుకులెండి యీ స్వల్ప కట్నాలు? మీరిచ్చే రోజులు - నేను పుచ్చుకొనే రోజులు - ఇక ముందు లేవూ?" అని మందహాస మొనర్చినాఁడు.

మంగ: చుట్టుపక్కల గ్రామాలకు కూడా పోతాడటమ్మా! ఈయన పట్టిన కేసులన్నీ నయమవుతూనే ఉన్నాయట. మన కొండప్పకు ఈయనంటే యెక్కడలేని గురి.

నాగ:- అసలు ఈయనది ఏవూరునాన్నా? ఇంత తెలివి తేటలుగలవాడు ఈ పల్లెకొంపకు రావలసిన పనేమిటో?

నాయు: నాకు మాత్రము ఏమి తెలుసు?

నాగ:- సరేకాని బావసంగతి యేమన్నా తెలిసిందానాన్నా!

నాయు: ఎక్కడా కనపడలేదని పెద్దిరెడ్డి చెప్పాడు. అంత కంటె నాకు మరేమీ తెలియదు. అయినా ఆ సంగతి యిప్పుడెత్తకు తల్లీ! మళ్లీనీకు జ్వరము వస్తుందేమో?

మంగ: రాదని డాక్టరు చెప్పాడుగా? ఇంకా ఆభయమెందుకు? ఆ వ్రసుకేమో రాత్రితో తీరిపోయినది. రాజయ్య మాత్రము ఎవరికీ చెప్పకుండా పారిపోవడమేమిటి? ఊళ్ళో నలుగురూ ఏమనుకుంటారు? అయినా ఈ రోజుల్లో చక్కగా చదువుకొన్నవాళ్ళకే ఈలాంటి అపరబుద్ధులు పుట్టుతుంటవి. ఇంతకూ విధి యిట్లావుంది.

నాయు: చేతులార చేసుకొన్నదానికి విధేమిటి? ఇక్కడవుంటే తన గుట్టంతా బయట పడుతుందని భయపడి — పారిపోయినాడు.

నాగ:- అలా అనకునాన్నా! బావకు అంత ద్రోహబుద్ధి లేదనే నానమ్మకము. నీవన్నమాటలకు రోషపడి వెళ్ళా డనుకొంటాను. రేపోమాపో తిరిగి రాకపోతాడా?

నాయు:నీదంతా పిచ్చి ఊహతల్లీ ! మళ్ళీ వచ్చేవాడయితే పోవలసిన పనేముంది? నాకుగానీ — నీకుగానీ — ఆరహస్యాన్ని చెప్పకుండా దాచిపెట్టవలసిన అవసరమేముంది? నీ ప్రేమకంటె ఆ రహస్య మెక్కువా? నీకంటే కోరదగినది లేదన్నవాడికి నీకు చెప్పరాని రహస్య ముంటుందా? నీవే ఆలోచించుకో. ఇందేదో కుతంత్రమున్నదనే నా అనుమానము.

మంగ: అది కాదమ్మా ! ఏదో కోపతాపాన - మేనల్లుడనీ- చిన్నప్పటినుంచీ తన పోషణలో ఉన్నాడనీ-స్వతంత్రించి మీనాన్న అనరాని మాటలు —— అన్నాడే అనుకో. ఆ మాత్రానికే లేచిపోవడ మెందుకు ? తర్వాతనైనా వచ్చి తనవల్ల తప్పులేదని చెప్పుకోకూడదా? మామను ఒప్పించగూడదా? ఇట్లా మీనాన్న అనుట - అతడు పడుట - ఈ వఱకెన్నిసార్లు జరగలేదు. ఇందులో పరాయి వారెవ్వరు? ఒకవేళ ఇంటికి రావటానికి మనస్కరించకపోతే ఆ మందిరంలో ఉండకూడదా? లేకపోతే ఆ జానకమ్మ యింట్లోనే ఉండకూడదా? జానకినే తాను పెండ్లి చేసుకొంటానంటే మేము కాదంటామా తల్లీ! ఈ జన్మకు కూతురైనా - కొడుకైనా - మాకు నీ ఒక్కదానవే కదా? నీ సుఖంకంటె మాకు కావలసిన దేమున్నది? మా ప్రాణాలన్నీ నీ మీదనే, మాఐశ్వర్యమంతా నీ కొఱకే. ఇదంతా తెలిసీకూడా మీ బావ ఆ జానకమ్మను ప్రేమించుట యెందుకు ? సినీమాలోకి

ఆమెను పోవద్దనుట యెందుకు? ఆ రహస్యాన్ని నీ వడిగినా, మీ నాన్న అడిగినా — చెప్పకుండా దాచిపెట్టుట యెందుకు? మీనాన్న యేదో అన్నాడని దొంగమాదిరిగా-నలుగురిలో మాకు తలవంపు లయ్యేటట్లు - లేచిపోవుట యెందుకు? ఇదంతా మా కర్మము కాదూ? యీ సంగతి ముందుగా తెలియబట్టి సరిపోయె లేకపోతే నీగతి-మాగతి యేమయ్యేది? కోటకుపోతే పెద్దమార్పు వస్తుందని ఆనాడు జోస్యము చెప్పింది యిందుకే కాబోలు! పోవుటయే ఈ గడియకు మంచిదైనది. ఇంతకూ నీ అదృష్టమూ— మా అదృష్టమూ—బాగా ఉండబట్టి యీ రొంపిలోనుంచి బయట పడ్డాము తల్లీ!

అని మంగమ్మ కంటనీరు పెట్టుకొన్నది. మంగపతి నాయుడు మఱేమియు ననలేదు. నాగమణికి తల్లియన్న మాటలు చాలా సబబుగాఁ దోచినవి. రాజయ్య పాఱి పోవుటవల్ల నతని తప్పు దృఢమైనట్లుగా నామె తలంచినది. ఒకవంక జానకిని ప్రేమించుచు-మఱొకదెస తనను పవిత్ర హృదయముతోఁ ప్రేమించుచున్నట్లు నటించినందు కతని యెడ నాగమణి కసహ్యమనిపించింది. మొత్తముమీఁదఁ తల్లి జెప్పిన మాటలనుబట్టి - ఆమె హృదయములో నొకవిధమైన యస్థిరభావము — మార్పు పొడసూపినది. ఇంతవరకు రాజయ్యతో నామెకుఁగల పవిత్ర ప్రణయబంధ మిప్పుడు కొంతవరకు సళ్ళువాఱినది. అతని యదృశ్యవర్తన మామెకు రోతగలిగించినది. తల్లితోఁగాని - దండ్రితోఁగాని - మఱెట్టి

సంభాషణ మొనర్చక నాగమణి యాలోచనా సముద్రములో మునిఁగిపోయినది.

అటనుండి యా దంపతులు ప్రక్కగదిలోనికిఁ బోయి యేమేమో కొంతసేపు రహస్యముగా ముచ్చటించుకొనిరి అంతలో సాయంకాలము సంభాషణము చాలించి ప్రయాణమై డాక్టరుగారి యింటికిఁ బోయెను.

డాక్టరు మధుసూదనరావు నివసించు గృహమునకు . నాయుఁడుగారి యింటికి — షుమారు రెండు మూడు ఫర్లాంగుల దూరముండును. అదిచాల మెరకమీఁదఁ గట్టబడినది రాజమ్మపేట జమీందారులకుఁ జెందినది. డాక్టరు దానిని అద్దెకుఁ దీసికొని - శిధిలములైన భాగములను బాగుచేయించెను. పూర్వపు జమీందారులకది విహార భవనముగా నుండెడిదట. ఆ భవనమునకు — గ్రామమునకు — ఏలాటి సంబంధము లేదు.

అదియొక విశాలమైన సుందరమందిరము. అందుఁ జాలగదులున్నవి. ఆగదులన్నియుఁ జలువరాళ్ళు పఱచినవి. ఆమందిరము చుట్టును బెద్దయావరణముగలదు. ఆయావరణము లోపల పలురకముల పూల మొక్కలు — ఫలవృక్షములు కన్నుల కింపు గొల్పుచుండును. చూపులకది రాజసౌధము వలెనే యొప్పుచుండును. చాల మెరకమీఁదఁ గట్టఁబడిన దగుటచేత నాయింటిలోనుండి చూచువారికి గ్రామమంతయుఁ గన్పడుచుండును. అంత పెద్దయింటిలో మధుసూదనరావు - ఒక సేవకునితోను, ఒక పరిచారికతోను నివసించుచుండెను.

మొకటినుండి జమీందారు లేర్పాటుచేసిన కాపలావాడు గూడ నచ్చుటనే వేఱొక చిన్నగుడిసెలోఁ గాపురముండెను.

ఆ యింటి ముందటి భాగములో రెండు పెద్ద గదు లున్నవి. ఒకటి డాక్టరుగారి ఆఫీసు - రెండవది మందులిచ్చు గది. లోపలి గదులలో నొకటి మందులు - చికిత్సాసాధన ములు గలది. ఇంకొకటి శస్త్రచికిత్సా మందిరము. ముఱొ కటి వైద్యగ్రంథాలయము. వేఱొకటి పరిశోధనా గారము. మఱికొన్ని ఆయన సొంతపనులకు - మజ్జన భోజనశయనాదు లకు - ఉపయోగపడునవి. లోనికిఁబోయి చూచిన నదియొక పెద్ద ఆసుపత్రివలె నుండును.

సాయంకాలము నాలుగు గంటలు కాఁగానే డాక్టరు ముందటిసాలులో నిలబడి నాయుడుగారి రాఁకకెదురు చూచు చుండెను. అంతలో నాయుఁడు వచ్చుచుండుట దూరము నుండియే గమనించి - ఆయన చేరువకు రాఁగానే యెదురు వోయి - యెంతో మర్యాదచేసి - లోనికి గొనిపోయెను. వారిద్దఱు ఆఫీసుగదిలోఁ గూర్చుండిరి. పరిచారిక కాఫీ- ఫల హారములు — మున్నగునవి తెచ్చి ముందుపెట్టెను. వారుభ యులు గలసి విందారగించిరి.

ఆ పనులన్నియుఁ బూర్తియైనతరువాత మధుసూదన రావు సిగరెట్టు ముట్టించి - పొగఁబీల్చుచు — "మీబోటి పెద్దవారు మాయింటి కెందుకు వస్తారు ? కావలసినంత డబ్బిస్తే డాక్టర్లే మీయింటి చుట్టూ తిరుగుతారు. మీకేమి? పెట్టి పుట్టినవారు. నేటి మీరాక మా యదృష్టమను కొంటాను"- అని సంభాషణ సాగించినాఁడు.

నాయు:మ తేమీ లేదండీ? మీ పుట్టు పూర్వోత్తరా లేమిటో
తెలుసుకోవాలని నా కోరిక.

జ్యాక్ట:- చాలా మంచికోరి కేనండీ! ఆ గొడవంతా యిప్పు
డెందుకుగాని మ తేదన్నా అడగండి.

నాయు:అట్లా కాదు లెండి, మీ చరిత్ర తప్పక తెలుసుకో
వాలి. మధ్యాహ్నము మీరు వచ్చి వెళ్ళినాక యేదో
మాటల సందర్భములో మా అమ్మాయి ఈ ప్రశ్నే అడి
గింది. నేనేమీ చెప్ప లేక పోయాను. ఇన్నాళ్ళనుంచీ
మీసంగతి తెలుసుకోక పోవుట చాలా తప్పనిపించింది.
కాబట్టి నామాట కాదనకుండ మీకథయేమిటో చెప్పండి.

జ్యాక్ట:- మీరంతగా అడుగుతున్నారు గనక కాదన లే
కున్నాను. సంగ్రహముగా చెప్తాను. వినండి. మా
కాపుర స్థలము మొట్టమొదట బందరు. మా తాతగారు
లక్ష్మణరావునాయుడుగారు - మీ మాదిరిగనే కోస్తా
వ్యాపారము చేసేవారు. ఆయనగారి హయాములో
వ్యాపారము కలసి వచ్చింది. కొంత జమీ కూడ ఆయన
కొన్నాడు. దానిమీద సాలుకు పది వేల రూపాయల
ఆదాయము వచ్చేది.

మా తండ్రులు ముగ్గురు. మా తండ్రిగారే కడగొట్టు
వాడు. మా నాన్నగారు మా తాతగారు బ్రతికియుండగనే
వ్యాపార నిమిత్తము రంగూనుకు వెళ్ళి అచ్చటనే ఉండిపోయి
నారట. మా నాన్నగారి పేరు రామస్వామినాయుడు.
మే మన్నదమ్ములము ఇద్దఱము. నేను మాత్రము రంగూను

లోనే పుట్టాను. మా నాన్నగారు అచ్చట కిరాణావ్యాపారము సాగిస్తూ ఇంటికి డబ్బు పంపుతూ ఉండేవారు! మా తాతగారు బ్రతికున్నంతవరకూ మా సంసారము బాగు. చింత లేదు. ప్రతి సంవత్సరం మా వ్యాపారములో మంచి లాభం వచ్చు.

మా అదృష్టమంతా మా తాతగారితోనే పోయింది. ఆయనగారు చనిపోయినాక మా వ్యాపారము పెద్ద దెబ్బ తిన్నది. దాంతో వున్న భూములూ, ఇల్లు వాకిళ్ళు, అన్నీ ఊడ్చుకపోయినవి. మా ఇద్దరు తండ్రులు ఆ దిగులుతోనే మంచంపట్టి మరణించారు. ఆ రెండు కుటుంబాలలో ఈ రోజున మిగిలింది మా పెత్తండ్రిగారి కుమారుడు ఒక్కడే. ఆయన బందరులో గుమాస్తాపని చేస్తూ ఏదో రీతిగా కుటుంబాన్ని జరుపుకొంటున్నాడు.

బందరులో వ్యాపారము తలక్రిందులైన తరువాత మా నాన్నగారు ప్రత్యేకముగా మద్రాసులో సొంతవ్యాపారము నెలకొల్పి మా అన్నగారిని అక్కడికి పంపించారు. నేను కూడా చదువునిమిత్తము మద్రాసుకు వచ్చాను. మద్రాసులో మాకొక యిల్లుగూడా ఉన్నది. మా అన్నగారు నాకంటె పదేండ్లు పెద్ద. నాచదువు పూర్తి కాక మునుపే రంగూనులో కలరా జబ్బువల్ల మా తల్లిదండ్రులు గతించారు. మాఅన్నగారు అచ్చట ఆస్తిపాస్తులు చూచి వచ్చుటకై వెళ్ళి యిప్పటికి పదిపన్నెండేండ్లు దాటినవి. ఏమైనాడో తెలియదు. చివరకు ఏకాకిగా మా కుటుంబానికి నేనొక్కడనే మిగిలాను. ఏదోరీతిగా మద్రాసులోనే

మా వ్యాపారమంతా అమ్మి చదువు మాత్రము పూర్తి చేశాను. ఆ యిల్లుమాత్రము మిగిలివుంది. అంత గొప్పగా బ్రతికిన మా కుటుంబము ఈరోజుకు ఊరూ పేరూ లేకుండ పోయినది.

అని చెప్పి డాక్టరు విచారముతోఁ దలవంచుకొనెను. అదంతయు విన్న మంగపతినాయుడు సంభ్రమాశ్చర్యములు ప్రకటించుచు "విచారపడకు నాయనా! ఈరోజుకైనా దేవుడు మనపాలిట ఉన్నాడు. చివరకు చేరవలసిన చోటికే చేరావు. మీ నాన్న నేను సాక్షాత్తు మేనత్త మేనమామ బిడ్డలము. మీరు రంగూను పోయినప్పటినుంచీ మీ సంగతి మాకు బొత్తిగా తెలియదు. మీ కుటుంబానికి ఎన్ని తిప్పలు వచ్చినవి? నీవు నాకు పరాయివాడవు కాదు నాయనా! నా మేనత్త మనుమడవు. రా దగ్గరకు రా నాయనా!" అని లేచి తడిసిన కన్నులతో మధుసూదనరావును కౌగలించుకొని యోదార్చినాఁడు.

తరువాత వారిద్దఱు మరికొన్ని విషయములు ముచ్చటించుకొనిరి. తలవనితలంపుగా నేర్పడిన చుట్టరికమును బురస్కరించుకొని మంగపతినాయుఁడు మధుసూదనరావును వెంటబెట్టుకొని మహాసంతోషముతో నింటికిఁ బోయెను.

౧౧

ఒక నెలరోజులు గడిచిపోయినవి. రాజయ్య తిరిగి రాలేదు. అతఁడేమైనది—యెచ్చటికిఁ బోయినది—యెవ్వరికిఁ దెలియదు. క్రమక్రమముగా నతని సంగతి పాతపడిపోయి

నది. ఆ గ్రామములో నతనినిగుఱించి యంతగా నసుకొను వారేలేరు. ఒక్క జానకిమాత్రి మతనికొఱకుఁ బ్రతిదినము వాపోవుచుండెను. అప్పుడప్పుడు వచ్చి పెద్దిరెడ్డి యామె దుఃఖములోఁ బాల్గొను చుండెడివాఁడు.

రాజయ్యలేని కారణమున భాషామందిర వార్షికోత్స వములు నిలిచిపోయినవి. కాని సంప్రదాయమును జెడఁగొట్టు టెందుకని జానకమ్మ — పెద్దిరెడ్డి — యేదో జరిపినామంటే జరిపినామన్నట్లు ముగించిరి. మంగపతిరావు నాయుడు — తొలకరి వానలు కురియునప్పటికి—ఏరువాక మహోత్సవముల మాట తల పెట్టలేదు.

క్రొత్త చుట్టరిక మేర్పడినప్పటినుండీ— మధుసూదన రావు—నాయుఁడు దంపతుల బలవంతంమీఁద వారి యింటనే భుజించుచుండెను. నాగమణి — మొదట మొదట అతని యెదుట తిరుగుటకే బెరుకుపడినది. కాని రోజులు గడచిన కొలఁది నా క్రొత్తదనము మాసిపోయినది. అతఁడుగూడ నా కుటుంబమునకుఁ బాతవాఁడై పోయినాఁడు. ఆమె యత నిని దమకుటుంబములో నొకనిఁగా జూడఁజొచ్చినది. వారి ద్దఱిమధ్య ఆ నెలరోజులలో—స్నేహము— స్నేహముతోఁ బాటు చనవు — కొంతవఱకు బెంపొందినవి. ఆమె రాజయ్యను మఱచి పోయినదో లేదో చెప్పలేము కాని యామె తల్లిదండ్రులు మాత్రము పూర్తిగా మఱచి పోయిరి. మంగపతికి అతని ప్రశంసయే గిట్టకుండెను.

శ్రావణమాసము జొరఁబడినది. గ్రామీణులు నాగమణి పెండ్లి విషయమై ముచ్చటించుకొనసాగిరి. కొందఱు ఈ నెలలో జరుగదు లే యనిరి. మరికొందఱు మధుసూదనరావే పెండ్లికొడుకనిరి. ఇంకఁ గొందఱు నాగమణి యిందు కంగీకరింపదు లే యనిరి. కొందర మ్మలక్కలు ఈ కీలక మంతయు మంగమ్మ చేతిలో నున్నదనిరి. ఈ విధముగా నెవరికిఁ దోచినట్లు వారు ముచ్చటింపసాగిరి. వారి వారి యభిప్రాయము లన్నియు నాయుఁడు దంపతులకు చూచాయగాఁ దెలియ వచ్చుచునే యుండెను.

ఒక నాఁడు—సాయంకాలము నాలుగు గంటల వేళ—మధుసూదన రావు గృహములో లేనిసమయమున—నాయుఁడు దంపతులు పెండ్లి విషయమై కుమార్తెతోఁ బ్రస్తావింప నామె నివ్వెఱపాటుతో—వెల వెలఁ బోవుచున్న మొగముతో—ఏ సమాధానము చెప్పక మౌనముద్ర ధరించి తలవంచుకొన్నది. ఆమె కన్నులనుండి దుఃఖాశ్రువులు రాలినవి.

మంగ: ఎందుకమ్మా ఏడ్పుట? ఈ నెలరోజులనుండి యేడ్చుచున్నది చాలదూ? అడిగినప్పుడెల్ల మౌనము వహిస్తుంటే మేము చేసేదేమిటి? నీ యిష్టము లేకుండ ఏపని జరుగదు. నీ మనస్సులోని అభిప్రాయ మేమిటో చెప్పు తల్లీ?

నాగ:- ఎన్నిసార్లు చెప్పేదమ్మా! మఱికొంత కాలము ఆగరాదూ?

మంగ: చిన్నపిల్లవైతే ఆగవచ్చునుగాని యీడు ముదురు చున్న దానవుగదా ? ఎంతకాలమని ఆగుట? నీతోటి వాళ్లందఱూ బిడ్డలతల్లులై కాపురాలు చేస్తున్నారే వాళ్లను చూచియైనా గ్రహించుకోవద్దూ? ఇంకా ఆగితే నలుగురూ ఏమంటారు ?

నాయు:నలుగురిమాట అటుంచు అసలు. ఆగుమనుటలో నీ ఉద్దేశ్య మేమిటో చెప్పుతల్లీ!

నాగ:- ఏమీలేదు నాన్నా ! బావ తిరిగి వస్తాడేమోనని నా యాశ.

నాయు:సరే. నీమాట యెందుకు కాదనాలి. కాని బావ నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాడనే అనుకొంటున్నావా?

నాగ:- అదేమిటి నాన్నా ! బావ ప్రేమనుగుఱించి నేను శంకించలేను.

నాయు:నిజమే అనుకొందాము. అతనికొఱకు నీవు నెలరోజుల నుండి విచారపడుతున్నావుగదా ? అతనికి ఆ విచార మేమైనా ఉన్నదంటావా ? ఉంటే నాకు వ్రాయకపోతే మానె—నీకైనా -తన యోగ క్షేమాలు - తెలుపుతూ- ఒక కవరు వ్రాయగూడదూ ? నీగతి యేమన్నా విచారించాడా? నిజమైన ప్రేమ ఇలాగే ఉంటుందా తల్లీ?

మంగ: నిజమైన ప్రేమఉంటే అసలు పారిపోతాడా? తనవల్ల తప్పే లేకపోతే మీ నాన్నను నలుగురిలోకీ పిల్చి అడుగ వచ్చునే? మీనాన్న యెటువంటివాడో నీకు తెలియదూ? ఆయనగారు అన్నమాట తప్పేవారేనా ? పిచ్చితల్లీ!

ఆ బావనుగుఱించి లేనిపోని ఆశ పెట్టుకోనేకంటె ఈ బావను గురించి ఆలోచించుకో.

నాగ:- అది కాదు నాన్నా! చిన్నప్పటినుంచీ ఒక కంచములో తిన్నాము—ఒక మంచములో నిద్రించాము. మా వయసుతో పాటు మా ప్రేమకూడా పెరిగింది. మా యిద్దఱి మనస్సులూ కలసిపోయినవి. అటువంటి బావను మఱచిపో అనుట అన్యాయము కాదూ?

నాయు:ఇంతగా ప్రేమించిన నిన్ను కాదని — మఱొక పిల్లను రహస్యముగా ప్రేమిస్తో - తప్పంతా నెత్తిన వేసుకొని - చివరకు నీకైనా చెప్పకుండ — ఇప్పటికైనా తనసంగతి తెలుపకుండ—ఎక్కడికో పారిపోయి నక్కినక్కి ఉండుట నిన్ను మోసగించుట కాదూ? ఇటువంటి కుటిలబుద్ధి గలవాడితో నీవు సుఖపడే దేమిటమ్మా? ఈ విషయములో మనవల్ల ఏ తప్పూ లేదు. తప్పంతా అతనిదే. అందుకనే మొగము తప్పించాడు.

మంగ: ఆ బావకంటె ఈ బావ యెందులో తక్కువో చెప్పు? నీ చదువుకూ - నీ తండ్రి హోదాకూ - ఈ బావే సరిపోతాడు? ఇంతకంటె మంచి మనువు దొఱకదమ్మా!

నాగ:- చదువులూ - హోదాలూ - నేను చూడనమ్మా! ఇది యెంత మంచిదైనా నలుగురూ మారుమనువే అంటారు. మనవంటి గౌరవ కుటుంబాలకు మారుమనువు తగునా?

మంగ: పిచ్చితల్లీ! ఇవన్నీ పురాణకాలపు ధర్మాలు. ఈ రోజుల్లో వీటిని పాటించేదెవరు? పీటలమీద పెళ్ళిళ్ళే— కట్నాల పేచీలువచ్చి - ఆగిపోతున్నవి. వారు మారుమనువులు చేసుకొనుట లేదూ? వారంతటినీ నలుగురు కాదన్నారా? సంఘములో వారికి గౌరవము లేకపోయిందా? ఈ నాటి ధర్మాలు మనకూ వర్తిస్తవి. అయినా మనకటువంటి చిక్కు లేవీ లేవు. ఇస్తానని నలుగురిలో తాంబూలాలు పుచ్చుకోనూ లేదూ, ప్రధానము జరుగనూ లేదు. అదీగాక మనము మాట తప్పిందీ లేదు. ఏమీ ఆ బావ నిన్నిచ్చి పెండ్లి చేయటానికి? అతనంతట అతడే పారిపోతే మనము చేసేదేముంది? అతనికోసము మనము ఆగుతామా? ఆగండని తెలిసిన వాళ్ళెవరైనా అంటారా? ఇది మారుమనువు అనిపించుకోదమ్మా!

నాయు: ఈపాటి ధర్మాలు నాకు కూడా తెలుసుతల్లి! ఎటువంటి వారైనా కాలాన్ని అనుసరించి పోవాలి. కాల ప్రవాహానికి ఎవ్వరూ ఎదురీదలేరు. రాజయ్యకే యివ్వాలని - మీ అమ్మకు ఇష్టము లేకపోయినా - చిన్నప్పుడన్న మాటకు నేనూ కట్టుబడ్డాను. కాని తలవని తలంపుగా పరిస్థితులన్నీ మారిపోయినవి. ఇట్లా జరుగుతుందని యెవ్వరమూ అనుకోలేదు. ఇంతకూ దైవనిర్ణయము ఇట్లున్నది గనుకనే మన కోరిక కొనసాగలేదు.

నాకా వయసు చెల్లిపోయింది. వార్ధక్యము తొంగి చూస్తున్నది. నా గడియారములో పగలు పన్నెండు గంటలు

గడిచినవి. రేయి ప్రారంభమైనది. కటిక చీకటిలో కాలము గడపాలి. ఈ చీకటి రాత్రిలో నాకు బ్రతుకు దెరువు చూపించే సుఖజ్యోతివి నీవే. నీ యండనే యీరాత్రి గడప వలెనని నాతలంపు. అందుకనే యీ సంబంధము కుదిర్చా.

ఇతడైనా పరాయివాడు కాడు. రాజయ్య వలెనే కావలసిన వాడు. కుటుంబ గౌరవములో మనకు సరితూగే వాడే. చదువు సంధ్యలలో నీకన్ని విధాలా సరిపోయినవాడే. ప్రస్తుతము మనకంటే 'నా' అనే వాళ్ళెవ్వరూ అతనికి లేరు? మనల్ని కనిపెట్టుకొని మన యింట్లోనే ఉంటాడు. పరాయి వాడు కాడుగనుక మన మాటకు మీాఱిపోడు.

ఇంతకంటే గొప్ప సంబంధాలు దొరుకవచ్చు. ఎంత కట్నమైనా యివ్వటానికి నాకు శక్తిఉంది. కాని ఆ వచ్చే వాడు మమ్మల్ని కనిపెట్టుకొని ఉంటాడా? నిన్ను మా దగ్గఱ ఉండనిస్తాడా? నిన్ను విడిచి ఒక్క క్షణమైనా మేముండలేము. నీవు లేకపోతే యీ యింటికి శోభ ఉండదు. ఇవన్నీ నేనూ- మీా అమ్మ - విచారించుకొనే యింతగా చెప్పుతున్నాము. ఈ ముసలి తండ్రిని సుఖపెట్ట దలచుకొంటే మా మాట చెల్లించు. లేకపోతే మానెయ్యి. ఇంతకంటె మేము చెప్పేది ఏమీాలేదు తల్లి! అంతా నీ యిష్టము.

అని మంగపతి యెంతగనో చెప్పి కనుల నీరు పెట్టు కొన్నాడు. మంగమ్మ మఱిమఱీ నొక్కి చెప్పినది. తియ్యని మాటలతోనే రాజయ్య మీాఁది మనసు జారునట్లే ప్రబోధిం

చినది. మధుసూదనరావు విద్యాభ్యాస వైభవములను వర్ణించినది.

తల్లి యెంత చెప్పినను నాగమణి మనసు నూరడ లేదు. కాని తండ్రి దీనవదనము — ఆతఁడు చివరగా చెప్పిన మాటలు - ఆమె హృదయమును దాఁకినవి. ఆ ముసలి కన్నీరు చూచుసరికి ఆమె చిత్తము క్షోభించి పోయినది. తండ్రి కోరికఁ గాఁదని ఆ బావకొఱకే వేచియుండమన్న — ఆతఁడు తిరిగి వచ్చునో? రాఁడో? ఎప్పటికి వచ్చునో యేమో? అతనిని గాదని ఈ బావను పెండ్లాడుటయున్న ధర్మవిరుద్ధమగునేమో? తన ప్రేమచంచల మనిపించుకొను నేమో? నలుగురిలో తన బ్రతుకు చులకన యగునేమో? ఎప్పటికైనా ఆ బావ తిరిగివచ్చి "నాగూ! ఇదేనా నీ ప్రేమ? ఎంత చపలచిత్తవైతివి?" అని మనసు నొవ్వనాడునేమో? ఇట్టి యాలోచనా పరంపరతో నాగమణి హృదయము వికలమైపోయినది. ఎంత తలపోసినను ఆమెకుఁ గర్తవ్యము బోధపడలేదు.

అదేసమయములో రూపలతాదేవి పల్కినమాటలు- ఆమె స్మృతిపథములో సంచరించినవి. జానకీ ప్రణయ వృత్తాంతము లామె శ్రుతిపుటములలోఁ బ్రతిధ్వనించినవి. ఆనాఁటి వనవిహారదృశ్యము లామె కనులముందుఁ గన్పడినవి. నేఁటి పరిస్థితులలో నాటి దృశ్యములను బోల్చి 'బావ ప్రేమ యెంత బూటకము!' అని పరితపించినది.

ఈ నెలరోజులనుండి మధుసూదనరావు తనయెడఁ జూపుచున్న ప్రేమాభిమానము లంతలోనే యామె మానసమును జూఱఁగొన్నవి. అతనితోడి జీవితము గౌరవ సుఖప్రదమన్నట్లు తోచినది. భారత దేశ పర్యటనవాంఛ యామె శరీరమును బులకింపఁ జేసినది. ఎట్టయెదుటఁ గన్నీటితోఁ దడిసిన ముసలితండ్రి ముడుతల మొగము ఆమె నాపాద మస్తకముఁ గదలించి యొక నిశ్చయమునకు వచ్చునట్లు త్వర పెట్టినది.

అట్టి నిశ్చయముతో నాగమణి తండ్రి మొగమువంక జూచి "నాకోసము మీ మనస్సు కష్టపెట్టుకోవద్దు. మీ చరమజీవితాన్ని పాడుచేసుకోవద్దు. నా విధి యెట్లుంటే అట్లేజరుగుతుంది. మీయిష్టప్రకారము కానియ్యండి. నేను అస్వతంత్రురాలను గనుక యెటూ చెప్పలేను. నా మంచి చెడ్డలు మీకే వదులుతున్నాను. నా సుఖ మెట్లున్నా నన్ను కని—పెంచి పెద్దచేసిన మిమ్మల్ని సుఖపెట్టుటే నాధర్మము కర్తవ్యము" అని తేల్చి చెప్పినది.

మంగ: బలవంతము లేదమ్మా! నీకంత ఇష్టము లేకపోతే మానుకుంటాములే.

నాయు: బాగా ఆలోచించుకొని మఱీచెప్పు. కర్మముచాలక యేదన్నా జరిగితే మమ్మల్నే అంటావు. ఇది నీ యావజ్జీవితానికీ చెందిన సమస్య.

నాగ:- నా కర్మాన్ని నేనే అనుభవిస్తానుగాని మిమ్మల్ని ఏమీ అనను. బాగా ఆలోచించుకొనే చెపుతున్నాను. మీ యిష్టప్రకారమే జరిగించండి. నాన్నా!

అని చెప్పి యామె వరండాలోనికి లేచి పోయినది. తల్లి దండ్రులు తమలోఁ దామేదో కూడఁబలుకుకొని యాసంబంధ మును స్థిరీకరించుకొన్నారు. మంగపతి నాయుఁడు వెంటనే లేచి —కలపదొడ్డికిఁ బోయి అందు బనిచేయుచున్న తన సహచరుల నందఱినిఁ బిలిచి— వారికిఁ దమ నిర్ణయమును— నాగమణి యొప్పుకోలును తెలియఁ జేసెను. వారుగూడా దానికిఁ జాల సంతోషించిరి. ఒక్క పెద్దిరెడ్డి మాత్ర మొప్పు కోలేదు. అతని యసమ్మతిని నాయుడుగాని — అతని యను చరులుగాని -పాటింపనే లేదు.

ఒక శుభదినమున నాగమణి మధుసూదనరావులకుఁ బ్రదానము జరిగినది. పెండ్లికి సుముహూర్తము గూడ నిర్ణ యింపఁ బడినది. ఆ గ్రామమునకు నాయుఁడు చాలినవాఁడు గనుక పిన్నలు—పెద్దలు—పెండ్లిపనులలోఁ జొచ్చొన్నారు. ఒక్క జానకి మాత్రము రూపొందిన శోకదేవతవలె బయ టికిఁ గూడ రాక యింటిలోనే పడి యేడ్చుచుండెను.

ఒక్కగా నొక్క కూతుఁరు గనుక - కావలసినంత సిరి, పలుకుబడి, యున్నవాఁడు గనుక మంగపతి నాయుఁడు పెద్ద పెట్టున వివాహప్రయత్నములు జరిపించినాఁడు. కొన్ని వందల మందికి ఆహ్వానములు పంపబడినవి. తానే స్వయ ముగాఁ గోటకుఁబోయి రూపలతాదేవిని ఆహ్వానించి వచ్చి నాఁడు నాయుడు. దూరపు బంధువు లందఱు రాసాగిరి. మధుసూదనరావు అన్నగారు కూడా—బందరు నుండి — కొన్నిరోజులు ముందుగనే కుటుంబముతో, గదలి వచ్చెను.

ఇటునాయుడుగారిల్లు — అటు డాక్టరుగారిల్లు — బంధువులతోను, స్నేహితులతోను, కిటకిటలాడి పోయినవి.

కల్యాణ మహోత్సవములు యథావిధిగా మూడు రోజులపాటు జరిగినవి. నాగమణీ మధుసూదనరావులకు మహా వైభవముగాఁ బెండ్లియైనది. రూపలతాదేవి పెండ్లికి రాలేదు కాని తన తరఫునఁ గొన్ని కానుకలిచ్చి - తన ప్రతినిధిని - పున్నమ్మను — మఱి కొంతమందినిఁ బంపినది. ఆ వధూవరులను జూచుసరికి పున్నమ్మ కడుపుమంట చల్లారినది. రూపలతాదేవి ప్రబోధము చివరకీరీతిగా ఫలించినది.

పెండ్లియైన మూఁడవనాఁటి సాయంకాలము నాయుఁడు దంపతులు వధూవరులను వెంటఁ బెట్టుకొని పెండ్లి పెద్దలతోను, బంధువర్గముతోను గ్రామస్థులతోను, గలసి, నాగులదిబ్బవద్ద వెలసిన సుబ్రహ్మణ్యస్వామికి మొక్కులు చెల్లించుటకై మహావైభవముతో బయలుదేఱి పోయిరి. అచ్చట జరుగవలసిన పూజాదికము లన్నియు ముగిసిన తరువాత నూతన దంపతులను కొంగులు ముడివైచి - గుడిచుట్టు మువ్మారు ప్రదక్షిణము చేయించి స్వామికి మ్రొక్కించి కానుకలు చెల్లించిరి. వధూవరులకుఁ బురోహితుఁడు తీర్థ ప్రసాదము లిచ్చెను.

ఇవన్నియు ముగియునప్పటికిఁ బ్రొద్దు గ్రుంకువేళ యయినది. సంజెచీకటి రోజులు గనుక వారందఱు త్వరపడి గృహోన్ముఖులై బయలుదేరి — పది బారలు వచ్చుసరికి వారి త్రోవ కడ్డముగా ఒక పెద్ద నాగరాజు జరజర వచ్చి తన

పడగను నేలకు మువ్మారు గొట్టి ఫూత్కరించుచు నెవ్వ జోలికిఁబోక చేరువ పుట్టలోనికి దూరిపోయెను. అది యెందుండి వచ్చెనో చెప్పలేము.

ఆ దృశ్యమును గాంచి నాగమణి శరీరము జల్లు మన్నది. మంగమ్మ గుండె గుభిల్లుమన్నది. నాయుడు మోము వెలవెలఁబోయినది. ఏదో మహాపచారము జరిగినదని పెండ్లి పెద్దలు గుజగుజలాడిరి. ఇంతలి యథార్థము బోధపడక బస్తీవారు తెల్లమొగాలతో జూడసాగిరి. సర్ప శకునము అందులో పడగవిప్పి నేలకు మువ్మారు గొట్టుట శుభదాయకము, సుఖదాయకము కాదని పెద్దిరెడ్డి యుద్ఘోషించెను.

అందఱు కలఁతనొందిన మనస్సులతో ముందేమి కీడు రానున్నదో యను తలంపులతో మఱికొంత సేపటికి గృహము మును జేరుకొనిరి. ఆ దుశ్శకునమువల్ల నా పెండ్లియింటిలోఁ గొంత యుత్సాహము తగ్గినట్లుగాఁ గన్పడెను. ఈ వార్త ఒక నిముషములో గ్రామమంతట వ్యాపికిపోయినది. మరుచటి రోజునుండి పెండ్లికి వచ్చిన వారందరు క్రమక్రమముగా స్వస్థలాలకు మరలిపోయిరి. ఊరు మాటు మణగినట్లయినది.

౧౨

నాగమణి వివాహము జరిగి యొక సంవత్సరము గడిచినది. ఏ యొడుదుడుకులు లేకుండ వారి సంసార చక్రము

సుఖముగనే దొరలిపోవుచున్నది. మధుసూధనరావు మామ గారి యింటిలోనే సుఖముగాఁగాలక్షేపము చేయుచున్నాఁడు. అతని వైద్య వృత్తి యేమంత గొప్పగా సాగకున్నను మొత్తముమీఁద కుంటిపడక మాత్రములేదు. గ్రామములో నతని కొకవిధమైన గౌరవము గూడ హెచ్చినది. నాయుఁడు దంపతులకు మాత్ర మానాఁటి దుశ్శకునమును గూర్చిన విచారము——ఈనాఁటికిఁ గూడఁ దొలగి పోలేదు. ఎప్పుడేమి జరుగునోయని వారి మనస్సు లాందోళన పడుచునేయున్నవి.

ఈ యేడాదినుండి రాజయ్యనుగుఱించి యొక్క వార్త గూడ వినఁపడలేదు. అతనిని జూచిన వారేలేరు. అతఁడేమై నది — యెంత గాలించి నప్పటికి — తెలియలేదు! అతని యంతర్ధాన మందఱికిఁ జాల వింతగానున్నది. మేనమామ మాటలకు విరక్తిజెంది ప్రాణత్యాగము చేసినాఁడేమో యని కొందఱి యనుమానము. కాని పెద్దిరెడ్డి కట్టిసందేహము లేదు. అతఁడేనాటికైనఁ దిరిగి రాఁగలడని జానకి గట్టిగా నమ్మియుండెను. ఆ నమ్మికతోనే యామె నిరంతర దుఃఖ సంభరితమైన తన జీవయాత్రను కొనసాగించుచుండెను.

రాజయ్య లేని కొఱంత గన్పడకుండ పెద్దిరెడ్డి సహాయముతో నీ సంవత్సరమునుండి జానకి భాషామందిరమును నిర్వహించుచుండెను. రాత్రిపూట వయోజన పాఠశాలను పెద్దిరెడ్డి నడుపుచుండెను. మందిరములోఁ దయారైన మఱి కొంతమంది యువకులు తన్నిర్వహణమునందు వారి కన్ని విధముల సహాయపడుచుండిరి.

జమీందారిణి — రూపలతాదేవి — తనకు వ్రాసి యిచ్చిన ఆస్తినిగాని, పంపిన రొక్కముగాని యేమాత్రము తన పొట్టకొఱకు ముట్టుకొనక — కేవలము రెక్కల మీఁదనే జీవించుచు — దాని సంతతికి రాజయ్యను ధర్మకర్తగాఁ జేసి - భాషామందిరమునకు వ్రాసి యిచ్చినది. ఈ సంగతి మంగపతికిఁగాని — పెద్దిరెడ్డికిగాని మఱెవ్వరికి గాని తెలియదు. తగినంత రాబడి యుండుటచేత మందిరము చక్కగానే సాగుచున్నది.

పెండ్లియైన ఈ యేడాది లోపల — ఒక్క మాఱైనను - నాగమణి - జానకమ్మను జూడ రాలేదు. అందుకుఁ గారణము ఆమె తన పెండ్లికి రాలేదన్న కోపమో - తనకే మొగము చెల్లకనో—లేక ఆమె పట్లగల యసూయయో - మఱియేమో చెప్పలేము. జానకి మాత్రము - మనసు పట్టలేక ఒక్కసారిపోయి చూచి పలుకరించి వచ్చినది.

పరిస్థితు లిట్లుండగా నాయుఁడుగారి అనుమానముకొద్ది నాఁటి దుశ్శకున ఫలితముగా ఆయేడు అతని కలపమండెలు అగ్నిదగ్ధములై వ్యాపారము పెద్ద దెబ్బతిన్నది. ఆ దెబ్బతో నతని యదృష్టశకటము బోల్తాకొట్టినది. తాత తండ్రులనాఁటి నుండి కూడబెట్టిన రొక్కమంతయు ఆనష్టమును పూడ్చుటకు సరిపోయినది. ఏదో స్థిరాస్థిమాత్రము మిగిలినది. జీవనమునకు మాత్రము లోటులేదు కాని తొంటి పరిస్థితు లన్నియుఁ దారుమాఱైపోయినవి. ఈ హఠాత్సంఘటనము వలన నతని వ్యాపారమే గాక మనస్సుగూడఁ జాల దెబ్బ

తిన్నది. పిచ్చిపిచ్చి తలంపులతో నతనితల బరువెక్కి పోయు నది. ఇంకేమి యాపదలు మూడనున్నవో యని యా దంపతులు తపింపఁ జొచ్చిరి.

ఈ నష్టము సంగతి యెల్లరకుఁ దెలియవచ్చినంతనే గ్రామములో యలజడి బయలు దేరినది. దుశ్శకున ఫలితము తప్పునాయని కొందఱు, అల్లుఁడు నష్ట జాతకుఁడురా యని కొందఱు, రాజయ్యను యింత యన్యాయము చేసిన దేవుఁ డోర్చునా యని కొందరు — అన్యాయార్జిత విత్తము కల కాలము కలసివచ్చునా యని కొందఱు — యూరువునవు చేసినందుకు మంచి శాస్తి జరిగినదిలే యని కొందఱు- ఈరీతిగా నెవరికిఁ దోచినట్లు వారు చెప్పుకొనఁ జొచ్చిరి. పెద్దిరెడ్డి యీ దుర్వార్తవిని విభ్రాంత చేతస్కుఁడయ్యెను. జానకి విస్తుపోయెను. కొద్దిరోజులవరకు నీ యలజడి తగ్గలేదు.

ఈ విచారమునుండి నాయుఁడు సరిగా బయట పడెనో లేదో చెప్పలేము గాని గోరుచుట్టుమీఁద రోఁకటి పోటన్నట్లు అతనికి మఱొక కష్టము ప్రాప్తించినది. అతని ముద్దుల కూతురు నాగమణి హఠాత్తుగా మంచమెక్కినది. కొండల పెట్టు జ్వరము. ఒక్కక్షణమైనను విడుపులేదు. మధుసూదన రావు తన చికిత్సా సామర్థ్యము నంతయును నుపయోగించుచు మందులు పోయుచున్నాఁడు. కాని ఒక్కదానికిఁగూడ జవాబు లేదు. రక్తనాళములలోని కెన్నో సూదిమందు లెక్కించి నాఁడు. కాని ప్రయోజనములేదు. అది మానసికమైన

దిగులో, రోగమో, చెప్పలేము కాని రోజులు మాత్రము గడచుచున్నవి.

ఏదైనా గ్రహవీక్షణమేమోయని నాయుడు తెలిసిన వారిని రప్పించి కొన్నిరోజులపాటు జపాలు చేయించినాడు. ఎక్కడెక్కడినుండి అంత్రలు తాయెత్తులు తెప్పించి కట్టించినాడు. మంగమ్మ గద్దెసుబ్బోయి అడిగి వచ్చినది. సుబ్రహ్మణ్యస్వామికి ముడుపులు గట్టినారు. ఎవరేమి చెప్పినను గాదనక చేసినారు. పల్లెటూరి వైద్యములు గూడ జేయించినారు. ఏమిచేసినప్పటికి – ఆరోగ్యమేమో కాని — తిరుగు ముఖమునకు రానేలేదు.

మధుసూదనరావుకు మందులు పోసిపోసి విసుగు పుట్టినది. సూదులు పొడిచిపొడిచి చేతులు నొప్పులెత్తినవి. అతడు జీవితాశ వదలుకొన్నాడు. కాని కనిపెంచిన యీ దంపతులూరుకోగలరా? వారి హృదయాలు —కుమ్ములో పెట్టిన వంకాయలవలె –శోకాగ్నిలో మ్రగ్గిపోయినవి. వారి మొగమున నెత్తురుచుక్కలేదు. వారి చూపులో జీవకళ లేదు. వారి తీరులో నుత్సాహములేదు. వారు దుఃఖదేవతల కతిథులు. పోయిన యాస్తిపోగా మిగిలిన యాస్తి యంతయు వెచ్చించి యైనను కుమారునైను బ్రతికించుకోవలెనని నాయుడారాటపడజొచ్చినాడు. కాని చేతితో నెవ్వరు తీసివేయ గలరు?

ఒక నెలరోజులు గడచినవి. రెండవనెల జరుగుచున్నది. లోనికి ఆహారముపోదు. బలవంతాన మిల్లె

గంటెడు పాలు త్రావించినప్పటికి జీర్ణముగావు. లోపల నిముడవు. అందువల్ల నాగమణి చాల శుష్కించి పోయినది. ఒక గోగుపుల్లవలెఁ జాల నీరసించినది. తనకై తాను పండు కొనలేదు. ప్రక్కకు పొర్లలేదు. గడియసేపు కూర్చుండ లేదు. ఆమెస్థితి ప్రమాద భరిత మనక తప్పదు. ఆమెను జూచి కంట తడిపెట్టని వారే లేరు.

ఒక రోజున జానకమ్మ—ఆమె ప్రమాద స్థితి విని—నిలువలేక చూచుటకుఁ బోఁగా నంతదుఃఖములో మునిఁగి యుండికూడ మంగమ్మ యామెను జూచి కొఱకొఱలాడినది. నాయుఁడుగాని, డాక్టరుగాని, ఆమెను రోగిదగ్గఱకే చేరనీయ లేదు. అంత జబ్బులోనుండి కూడ నాగమణి మాత్ర మామెను గుర్తించి — యెచ్చటనో వినఁబడుచున్న గొంతుకతో "బావ సంగతి తెలిసినదా?" యని యడిగి కన్నులు మూసినది. జానకి గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచు నట నిలువ లేక మరలి వచ్చినది.

రెండవ నెల సగము గడచినది. విజయవాడనుండి యెందఱెందఱో పేరుమోసిన డాక్టర్లువచ్చి చూచి — పెదవి విఱచిపోయిరి. అంతకంతకూ నాగమణి స్థితి మారిపోఁ జొచ్చెను. నాడి సంచలనముకూడ క్షీణింపసాగెను. అట్టి స్థితిలో నాయుఁడు చివరి ప్రయత్నముగా వందలు గుప్పించి హైదరాబాదునుండి ఒక సుప్రసిద్ధ పాశ్చాత్య వైద్యుని రప్పించెను. అతఁడు రోగిని చక్కఁగాఁ బరీక్షించి — గుండె పనిచేయుట లేదని — ఎటువంటి మందు లిచ్చినప్పటికి బ్రమో

జన ముండదనీ శరీరములో నెత్తురు బొత్తిగా లేదనీ - రక్త నాళములోనికి నెత్తురెక్కించినఁగాని గుండె పనిచేయదనీ— ముందు పరిశుద్ధమైన మానవ రక్తము గావలెననీ - అది కూడ వెంటనే లభించుట మంచిదనీ — వలసినంత నెత్తు రెక్కించినచో దప్పక బ్రతుకవచ్చుననీ — ఆశ వదలు కొన్న వారంతటికి జీవితాశ కలిగించెను.

ఆ ఘనవైద్యుఁడు చెప్పిన మాటలను బట్టి యందఱి ముఖములు కళకళ లాడినవి. కాని నెత్తురు దొఱకుట యెట్లు? అదే కఠిన సమస్య. బిడ్డమీఁది ప్రేముకొద్ది నాయుఁడు తన నెత్తురిచ్చెదనన్నాఁడు. కాని వయసు మీఱినవారి నెత్తురు పనికిరాదన్నాఁడు వైద్యుఁడు. దానితో మంగమ్మకూడ మాటలాడలేకపోయినది. తక్కినవారెవ్వరు ముందుకు రాలేదు. అప్పుడా కొత్తవైద్యుఁడు మధుసూదన రావు నెత్తురు బరీక్షించి — పనికివచ్చునన్నాఁడు. కాని యేమికారణముచేతనో తన రక్తము నిచ్చుట కతఁడొప్పు కొనలేదు. మంగపతిరావు మనసు చివుకుమన్నది. నాగమణి మీఁద నతనికిఁగల ప్రేమ యెట్టిదో యచ్చటనున్నవారి కందఱకుఁ దెల్లమైనది. ఆ స్థితిలో రాజయ్యయేయున్న నతఁడటులనునా యని యందఱి భావములు నతనిమీఁదికి బరువు లెత్తినవి. చేసుకొన్న మగఁడే యీయనప్పుడు పరాయి వారెవ్వరిచ్చెదరు? నెత్తురిచ్చుటయన్న మాటలు గాదు. ఒకప్పుడిచ్చిన వానికే ముప్పు కలుగవచ్చు. అందు వల్లనే కాఁబోలు మధుసూదనరావు కాదన్నది!

జీవితాశ కన్పడిసూడ లేనట్లయినందుకు నాయుఁడు దంపతులు చాల దుఃఖపడిరి. ఎవ్వారెంత చెప్పినను మధుసూదనరావు సమ్మతింప లేదు. ఆ యాపత్సమయమునఁ జుక్కయూడి పడినట్లు—కాషాయరంగు ఖద్దరు వస్త్రధారి యొకఁడు—ఒక మాదిరి పొడుగుగా సందు లేకుండ బెరిగిన నల్లని గడ్డముతో—చిన్నచిన్న జడలుగట్టి మెడలుజారని తలకట్టుతో—లోనికి చకచక వచ్చి — ఒక్కసారి రోగివంకఁజూచి — అందున్న వారెల్లరుఁ దన రాకకుఁ విస్మయపడుచుండ — ఎవ్వరితో నేమియు మాటాడకుండ — సరాసరి యా ఘనవైద్యుని సమీపించి — తన రక్తమును బరీక్షించుమనది యని చేయి చాపెను. ఆ వైద్యుఁడతని రక్తమును దీసి పరీక్షించి చూచి "భేష్" అనెను. వెంటనే — ఒకరు కోరకుండగనే—తనరక్తము వలసినంత యిచ్చుటకు సమ్మతించెను. వైద్యుడతనినుండి రోగికిఁ గావలసినంత రక్తమును గ్రహించి—కడు మెలకువతో నా రోగి రక్తనాళములోని కెక్కించెను.

ఆ యాగంతకుఁడు — కోపవచ్చినట్లు — ప్రక్కనే యున్నట్టి యొక బల్లమీఁదఁ బరుండి — మొగమునిండఁ గావిరంగు దుప్పటి కప్పుకొనెను. ఆ తహతహాలో నతని సంగతి గమనించిన వారేలేరు. కాని యా వైద్యుఁడతనికిఁ బండ్లరసము రెండు — పాలు—ఇప్పించెను. అవి త్రాగిన తరువాతఁ గూడ [illegible] నతఁడట్లే పండుకొనెను.

ఒక గంటసేపటికి రోగిముఖములోఁ గొద్దిమార్పు కనఁబడినది. రోగి నాడి చక్కగాఁ గొట్టుకొనఁ జొచ్చినది. మెల్ల

మెల్లగా గుండె పనిచేయసాగినది. ఆ లక్షణములన్నియు గమనించి వైద్యుఁడు ప్రాణభయము లేదనినాఁడు. ఏదో కొంత ద్రవపదార్థము పండ్లరసములోఁ గలిపి గొంతులో బోసినాఁడు. ఇంతవఱకు నే పదార్థము ఇముడని రోగికి — ఆ పండ్లరసమిమిడినది. అదిచూచి యందఱికిఁ గొంచెము ధైర్యము కలిగినది.

తరువాత నా ఘనవైద్యుఁడు రక్తములోని కియ్యవలసిన మందులు-కడుపులోపలి కీయవలసిన యౌషధములు-వాని యనుపానములు - అన్నియు వివరముగా మధుసూదన రావుతోఁ జెప్పి-వ్రాసియిచ్చి-తాను మరల ఒక వారమురోజులలో వచ్చెదననీ-ఈలోపల నేమైన విపరీతపరిస్థితి యేర్పడినఁ దనకు తంతివార్త పంపవలసినదనీ - చెప్పి - నాయుఁడుగారి సెలవు గైకొని యప్పుడే బయలు దేఱెను. మధుసూదనరావు గూడ నా క్రొత్తమందులు తెచ్చునిమిత్త మప్పుడే బయలు దేఱి యతనితోఁ గలిసి విజయవాడకు వెళ్ళెను.

ఇదంతయు ముగియునప్పటికి మధ్యాహ్నము రెండు గంట లయినది. అప్పటివఱకు నాయుఁడు దంపతులు భోజనము చేయలేదు. వారి కాకలి దప్పులు మందగించినవి. తమ బిడ్డకొఱకుఁ గోరకుండగ నే తనరక్తము ధారపోసిన ఆ యోగంతకుఁడెవ్వఁడో తెలిసికొనవలెనని వారి మనస్సులు తొందరపడఁజొచ్చినవి. కాని యతఁడు పెట్టినముసుఁగు తీయలేదు. అతనిని లేపరాదని వారు మిన్నకుండిరి. అతఁడు లేచులోపల రెండు మెతుకులు తినివత్తురుగాని రండని కొంకను

భార్య బలవంతపెట్టగ వారు లోనికిఁ బోయిరి. వారు తిని వచ్చులోపలనే ఆ నాగరాజు తిన్నగా లేచి—మరొకసారి రోగినిఁ జూచి – నెమ్మదిగా నడిగడలోనికిఁ బోయినట్లుపోయి – సరాసరి వీధివాకిలి దాటి బయటికేగెను.

ఆ నాగరాజును జూచినప్పటినుండియు నేలకో యనుమానించుచున్న పెద్దిరెడ్డి – అతఁడు సరాసరి బయటికిఁ బోవుటకు మఱింత సందేహపడి – అతనికిఁ దెలియకుండ వెంబడించెను. అతఁడు ముందు – తాను వెనుక – ఇట్లు కొంతదూరము సాగిపోయిరి. ఆ క్రొత్తపురుషుఁడు గ్రామముదాటి పంటచేలు సమీపించునప్పటికి నడువలేక – సొమ్మవచ్చి — క్రిందఁ గూలఁబడెను. అంతలోఁ బెద్దిరెడ్డి సమీపించి – నిదానముగా నతని ముఖమునందుఁ దిలకించి – యతనిని రాజయ్యగా గుర్తించెను. అప్పుడతనికిఁ గలిగిన యాశ్చర్యమునకు — దుఃఖమునకు – మేరలేదు. అతని పవిత్ర ప్రేమకు – ప్రతిఫలశూన్యమైన యతని త్యాగమునకు – పెద్దిరెడ్డి యద్భుతపడి యతని పాదములు కన్నుల కద్దుకొన్నాఁడు. అతని కరస్పర్శవలన నా నాగరాజు మెలకువగలిగి కన్నులు విచ్చి చూడఁగనే యతఁడు " రాజయ్య బాబూ!" అని సంబోధించి చేతులు గట్టుకొన్నాఁడు.

అంతట రాజయ్య మెల్లగా లేచి కూర్చుండి యతనితో సంభాషించినాఁడు.

రాజు:— నన్ను గుర్తింపఁ గలిగితివా పెద్దిరెడ్డీ!

పెద్ది:— నా గురుదేవుని గుర్తింపలేనంతటి మూర్ఖుడనుగాను.

రాజ:- అచ్చట మరెవ్వరైనా నన్ను గుర్తించినారా ?

పెద్ది :- లేదు. చిరపరిచయులుగూడ చప్పున గుర్తింపలేనంతగా మీ రూపము మారిపోయినది. నేనుగూడా గుర్తింపగలిగినది ఇప్పుడే!

రాజ:- సరే ఈ సంగతి పూర్తిగా ఆరోగ్యము చిక్కేవరకూ నాగమ్మకుగానీ - ఆమె తలిదండ్రులకుగానీ - చెప్పవద్దు.

పెద్ది :- తమ యిష్టప్రకారము నడచుకొందును. అయితే జానకమ్మకు చెప్పమందురా ? ఈ యేడాదినుండి ఆమె మీ కోసము వేడి కన్నీటితో తడిసిపోవుచున్నది.

రాజ:- ఆమెతో చెప్పు. కాని రహస్యముగానే ఉంచమను. నేను యీ మల్లయ్యగుట్టదగ్గర - నా తండ్రి తన చివరిగాలి పీల్చిన యీ పూరిగుడిసెలోనే - ఉంటున్నాను. ఆ స్థలము నీకు తెలుసుననుకొంటాను.

పెద్ది :- తెలుసును కాని దారి బాగా గుర్తులేదు. చూచి యెంతకాలమైనదో ?

రాజ:- అయితే నా వెంట రా. నేను నడువలేకున్నాను. రక్తక్షయమువల్ల నాశక్తి చాల తగ్గిపోయినది. నాకు కొంచెము ఊతగా ఉండి నన్ను ఇంటికి చేర్చు.

అని పలికి రాజయ్య యతని బుజమును నూతగాఁగొని - మెల్లగా నడువఁజొచ్చెను. వారు కొన్ని మలుపులు దాటి - చెఱువు అవ్వలిగట్టు చేరి - తిన్నగా రెండు గుట్టల సందునఁ బడిపోయి - మల్లయ్యగుట్టను సమీపించిరి.

ఆ గుట్ట నానుకొనియే ఆ పూరిగుడిసె యున్నది. దానికి దాపుననే యతని పైతృకమైన యాస్తి. ఒక యెకరము పంటభూమి కొద్దిపాటి తోఁట — ఉన్నవి. పెద్దిరెడ్డి తిన్నగా తన గురుదేవుని నా యింటిలోఁ బ్రవేశపెట్టి — రాజయ్య వద్దన్నప్పటికి వినక - ఆ రాత్రి అచ్చటనే యుండి పోవుటకు నిశ్చయించుకొనెను.

ఇచ్చట నాయుఁడు దంపతులు భోజనము చేసివచ్చి- ఆ యాగంతకుఁడు తమకుఁ దెలియకుండగనే వెడలిపోయినందుకు విచారపడిరి. పెద్దిరెడ్డి యతనిని వెంబడించి పోయినట్లు తక్కినవారి వలనఁ దెలిసికొని - కొంత స్థిమితపడి - యతని రాకకెదురు చూచుచుండిరి. ఆరాత్రి నాగమణి సుఖముగా నిద్రించెను.

మఱునాఁడు - బారెడు ప్రొద్దెక్కినప్పటికి - పెద్దిరెడ్డి మరలివచ్చినాఁడు. అతనిని జూడఁగనే మంగపతిరావు నాయుఁడు పట్టరాని తమకముతో "పెద్దిరెడ్డీ! ఆ యాగంతకుఁడెవ్వఁడో తెలిసికొంటివా?" యని ప్రశ్నించినాఁడు.

పెద్ది :- లేదు బాబూ! వెంబడించి పోయినాను గాని అతఁడు నా కందలేదు. పంటచెఱువుదగ్గఱనున్న గుట్టలలో నతఁడు మాయమైపోయినాఁడు.

నాయు:అతని సంగతి కొంతన్నా తెలిసికోలేకపోతివా?

పెద్ది:- కొద్దిగా తెలుసుకొన్నాను. ఆ గుట్టలమీద కట్టెలు కొట్టేవాళ్ళను కలుసుకొని అడిగినాను. వారు - అతఁడెవ్వఁడో క్రొత్తగా వచ్చిన సన్యాసి అనీ - ఒక నెలరోజుల

నుండీ ఆ గుట్టలమీద తిరుగుతున్నాడనీ - అప్పుడప్పుడు తమకు కనుపిస్తూ ఉంటాడనీ —— అతనెక్కడ ఉంటాడో తమకు తెలియదనీ- చెప్పారు. ఇంతకంటె నాకు మరేమీ తెలియ లేదు.

నాయు:అతను మన రాజయ్యే అని నా అనుమానము.

పెద్ది:- మీ అనుమానము నిజము కావచ్చు. కాకపోతే పరాయివాడు మన నాగమ్మకోసము తన రక్తాన్ని ధార పోస్తాడా ? ఇటువంటి త్యాగము చెయ్యాలంటే ఎంత ప్రేముండాలి? ఎంతటి ధీరహృదయముండాలి?

నాయు:నిజము రెడ్డి ! నీ వన్నమాట నిజము. చేసుకొన్న మగడే కాదంటే పరాయివారి మాట చెప్పాలా? ఇంతేనా మా కర్మ మిట్లా కట్టికుడిపింది. లేకపోతే మా కీ పాడు బుద్ధి పుట్టనేపుట్టను. మా రాజయ్య మమ్మల్ని ఇట్లా విడిచిపెట్టి పొయ్యేవాడు కాదు. పెద్దిరెడ్డీ ! నీకు పుణ్య ముంటుంది. అతని నిజము సంగతి యేమిటో తెలుసు కొని నాకు చెప్పునాయనా !

పెద్ది:- విచారపడకు బాబూ! కొద్దిరోజుల్లోనే అతని ఆచూకీ తీసి తెలుసుకుంటాను. మీరు అమ్మాయి క్షేమాన్ని చూచుకోండి. అన్నీ ఒకయెత్తూ - ఆమె యారోగ్యము ఒక యెత్తు.

నాయు:అమ్మాయి కింక భయములేదు రెడ్డి! నాకా దిగులు తగ్గిపోయినది. రోగము తిరుగు మొగము పట్టిన లక్షణాలు బాగా కనిపిస్తున్నవి. ఇవ్వాళ మధుసూదనరావు

మందులు తీసుకు వస్తాను. కొద్దిరోజుల్లోనే పూర్తిగా నిమ్మళిస్తుంది. ఈ సంతోషాన్ని నాకు కలిగించి — నా వంశాన్ని ఉద్ధరించిన ఆ మహాపురుషుం డెవ్వండో తెలుసుకొనే వఱకూ నాకు నిద్దుర పట్టదు రెడ్డీ! నాకీ విచారము నీవల్లనే పోవాలి.

పెద్ది:- సరేలే బాబూ! నీవు నిశ్చింతగా ఉండు. మీ అనుమానాన్ని గురించి అమ్మాయితో కూడా చెప్పవద్దు. నిజము తెలిసే వఱకూ బయటికి పొక్కరాదు.

అని చెప్పి పెద్దిరెడ్డి యచ్చట మఱెక్కువసేపు నిలువక - సరాసరి జానకమ్మ యింటికి వెళ్ళి - యామెతో నిన్న జరిగిన విచిత్ర సంఘటనలను గుఱించి - పూసగ్రుచ్చినట్లు వివరముగాఁ జెప్పెను.

రాజయ్య సంగతి వినఁగానే జానకి నిర్ఘాంతపడినది. ఆమె కన్నులనుండి దుఃఖాశ్రువులు జలజల రాలినవి. కొంత సేపటి వరకు నామె మాటాడలేకపోయినది. చివరకుఁ గొంచెము తెప్పరిల్లుకొని "పెద్దిరెడ్డీ! రాజయ్య మహాపురుషుఁడు. తన ప్రేమకొఱకు తపస్వియైనాఁడు. తనకుఁ గలిగిన యపవాద పంకమును తన వేడిరక్తముతోఁ బ్రక్షాళించుకొన్నాడు. అతని పవిత్ర ప్రేమ యెట్టిదో యిప్పటికైనా ఆ దంపతులకు బోధపడవచ్చు. నాగమణి నిజముగా దురదృష్టురాలు. కాకపోతే అటువంటి పవిత్ర ప్రేమరాశిని పోగొట్టుకొంటుందా?" అని ఆమె అంగలార్చినది.

పెద్ది:- జానకమ్మా! ఈ రహస్యాన్ని బయట పెట్టకు. ఇది గురుదేవుని ఆజ్ఞ.

జాన:- అయితే నీవీ సంగతి నాయుడుగారికి చెప్పలేదా?

పెద్ది :- లేదు. గురుమూర్తి వద్దన్నాడు. నీకు చెప్పటకు మాత్రమే అనుజ్ఞ.

జాన:- ఆ మాత్రపు అభిమానమైనా చూపించినందుకు ధన్యురాలను. పెద్దిరెడ్డీ! నాకుగూడా ఈమాయ ప్రపంచముపై రోత పుట్టినది. నేనుగూడా సన్యసిస్తాను.

పెద్ది :- అదేమిటి జానకమ్మా! నీవంటి యువతికి సన్యాసమా?

జాన:- అవును. రాజయ్య యువకుడు కాదూ? ఆయన యెందుకు సన్యసించాడో నేనుగూడా అందుకే సన్యసిస్తాను. ఆయన అడుగుజాడలే నాకు అనుసరణీయాలు. అవే నా జీవితానికి ఆదర్శాలు.

అని చెప్పి జానకమ్మ ఆరోజునుండియే యోగినీదీక్ష గైకొన్నది. పెద్దిరెడ్డి యామె మనోనిశ్చలతకు - విషయసుఖ పరిత్యాగమునకు - పవిత్ర ప్రేమతత్వమునకు - అబ్బురపడి ఆ బాలయోగినిని లోలోపల దీవించినాడు.

ఈ జగన్నాటకములో జానకీరాజులు సమానపాత్రలు ధరించినారు. సమాన ధర్మ నిర్వహణమున కాయత్తపడినారు. ఇది మఱొక విచిత్ర సంఘటనము.

## ౧౩

ఒక వారముమురోజులు గడచిపోయినవి. నాగమణికి వ్యాధి నిమ్మళించినది. వారాంతమున హైదరాబాదు నుండి ఆ పాశ్చాత్య వైద్యుఁడు వచ్చి యామెను జక్కగా బరీ

క్షించి – తన సంప్రాప్తిని ప్రకటించుటయే గాక — అదంతియు రిక్తహస్తాన మొనర్చిన యా యువక సన్యాసిపెట్టిన భిక్షయేయని–యతని త్యాగబుద్ధిని గొప్పగా ప్రశంసించినాడు. అతని ప్రశంసా వాక్యములు మధుసూదనరావుకు మాత్రము కష్టమనిపించినవి. తరువాత నాగవైద్యుడు రోగికి బలము వచ్చుటకై మఱికొన్ని మందులు వ్రాసియిచ్చి వెంటనే బయలు దేఱి పోయెను.

మంగపతికి ఆ యువక సన్యాసి విషయము తెలిసికొన వలెనను యభిలాష మెండైనది. ఆ ఘనవైద్యుడు ప్రశంసించినప్పటినుండి యతని కోరిక మఱింత మెండయ్యెను. అతనిని గుఱించి పెద్దిరెడ్డిని అడుగని రోజే లేదు. కాని తన కింకను తెలియలేదని యతడు తప్పుకొనుచుండెను. రోజు రోజుకు మంగపతి తమకము మిక్కుటమగుచుండెను.

మఱొక వారము రోజులు గడిచి పోయినవి. నాగ మణికి కొంచెము బలముగూడా కలిగినది. ఆమె యిప్పుడు స్వయముగా మంచములోనుండి లేవ గలదు. కూర్చుండ గలదు. ఒకరి యాధారమున కొద్దిదూరము నడువ గలదు. ఆమె యారోగ్యము కొంతవఱకు పుంజుకొన్నదనియే చెప్ప వచ్చును. శరీరములో క్రొత్త నెత్తురు పట్టినది. తిన్న పదార్థ ములు చక్కగా సరిపడి జీర్ణమగు చున్నవి. రేయి హాయిగా నిద్రపట్టుచున్నది. పదహేను రోజుల క్రిందట మృత్యుదేవత తొంగిచూచిన యింటిలో నేడు మంగళదేవత కాపురము చేయుచున్నది. ఇట్టి మార్పునకు — ఆ యువక సన్యాసి

త్యాగమే మూలకారణ మన్న విషయము మంగపతి మనస్సులో జాగరిత మగుచునే యుండెను.

మఱికొన్ని రోజులు జరిగిపోయినవి. ఒకనాఁడు-పగలు పదకొండు గంటలకు — భోజనాదికములు ముగించుకొని — మంగపతి - అతని భార్య - కూతుఁరు — అల్లుఁడు — కొండప్ప దంపతులు - హాలులోఁ గూర్చుండి - ఏదో ఖులాసా కబుర్లు చెప్పుకొనుచుండిరి. ఆ సమయమునఁ బెద్దిరెడ్డి యచ్చటికి వచ్చెను. అతని ముఖములో నొక విధమైన యుత్సాహకళ ద్యోతక మగుచుండెను. అతని చూపులో నాతురత ప్రస్ఫుటమగుచుండెను.

మంగపతి అతని వాలకమును కనిపెట్టి — యేదో విశేష ముండవచ్చునని యూహించి - "పెద్దిరెడ్డీ! నిలబడినావేమి? వచ్చి కూర్చో. అతనిని గుఱించి యేమైనా తెలిసికొంటివా?" అని పట్టరాని తమకముతోఁ బ్రశ్న పరంపర కురియించినాడు. అతఁడు చెప్పునది వినుటకు ఒక్క మధుసూదనరావు తప్ప - తక్కిన వారందఱుఁ దమయాతురతను బ్రకటించినారు. "జాగుసేయక చెప్పు రెడ్డీ?" అని నాయుఁడు మరల బ్రశ్నించినాడు.

పెద్ది :- అతని సంగతి గతరాత్రి తెలుసుకున్నాను బాబూ!

నాయు:నిజముగా తెలుసుకొన్నావా? అతఁడెవ్వఁడు?

పెద్ది :- నాయనుమాన మే నిజమైనది?

నాయు:ఆఁ! మా రాజయ్యయేనా? మా రాజు సన్యాసి యైనాఁడా?

పెద్ది :- అవును. ఆతను మన రాజయ్యే.

నాయు :- అతనిని తెలుసుకొన్నావా? అతనితో మాట్లా డావా? నన్ను ఏమైనా అన్నాడా? చెప్పునాయనా! చెప్పు. నామనస్సు తపించిపోవుచున్నది. అతడు నాబిడ్డను రక్షించాడు.

పెద్ది : ఆతనను తెలుసుకొన్నాను. మాట్లాడాను. గడచిన రాత్రి అంతా అతని నద్దనే ఉన్నాను. మిమ్మల్ని ఎవ్వ రినీ ఏమీ అనలేదు. తనసంగతి మీకు చెప్పవద్దన్నాడు కూడా. కాని నాబలవంతాన చెప్పుమన్నాడు.

నాయు:వాడు ఎవ్వరిని ఏమీ అనడు. మిన్ను విరిగి మీద పడినా లోనికోడు. అటువంటివాడు మాబోటి పాపిష్ఠులకు దక్కుతాడా? అతడు లేని యీ ఒక్క రోజాదిలోనే మా అదృష్టమంతా తలక్రిందులై పోయినది. తన సంగతి యేమని చెప్పినాడు పెద్దీ!

అని మంగపతి యడుగుసరికి మధుసూదనరావు-ఆకథ వినుట కిష్టము లేకనో గనుకనో - ఏదో పనిమీద లేచిపోయి నట్లు - బయటికి వెళ్ళిపోయినాడు. అతని చర్య తండ్రిగారు తెలకేగాక - మంగమ్మకు గూడా జాల యసహ్యముగాం దోచినది కొండప్ప దంపతులకుఁ గూడ జాల కష్టమనిపించి నది. అల్లుని పోకను లక్ష్యపెట్టక - మంగపతి చెప్పుమని మరి మరి యడుగఁ బెద్దిరెడ్డి చెప్పుటకు బ్రారంభించినాడు.

పెద్ది:- ఇట్టివి జరుగుతవనే మాగురుదేవుడు చెప్పవద్దన్నాడు. అయినా చెపుతాను వినండి.

ఆ నాటి సాయంకాలము — ఆ చిట్టచివరిలో — నాగమణితో తన సంబంధము విచ్ఛిన్నమైనప్పటినుండి ఆయన ప్రపంచాన్ని రోసి - సన్యసించి - విజయవాడ కొండలలో నివసిస్తున్నారట. గడ్డాలు — మీసాలు - పెరిగి చిరపరిచయులుకూడా గుర్తుపట్టలేనంతగా తనరూపము మారిపోయ్యే వఱకూ రహస్యముగానే సంచరిస్తూ—కొన్ని నెలల క్రిందటనే బయటపడి — కనకదుర్గ గుడిలో ఉంటున్నాడట.

ఒక రోజున మనల్ని బాగా యెఱిగిన వాళ్ళెవరో నాగమ్మకు చేసిన జబ్బును గురించి ముచ్చటించుకొంటూ ఉండగా ఆ సంగతి విని మనసుపట్టలేక - చూచి పోదామని- యిచ్చటికి వచ్చి - పరుల కంటబడకుండా మల్లయ్య గుట్ట దగ్గఱ — తన తండ్రి యేనాడో కట్టించి — చనిపోయినట్టి శిథిలగృహములో-ఉంటున్నాడట. ఏరోజు కారోజు నాగమ్మ రోగపరిస్థితులను గూఢముగా తెలుసుకొంటూ - ఆరోజున హైదరాబాదునుండి ఘనవైద్యుడు వచ్చిన వార్తవిని-నిలువలేక - యేమైనాసరె కానిమ్మని కడసారి చూపైనా దక్కుతుందని —— మనయింటికివచ్చి గోడచాటున కొంచెముసేపు నిలబడి - ఆ వైద్యుడు చెప్పినదంతా విని - మధుసూదనరావు తన నెత్తురు ఇవ్వననుట కూడా గ్రహించి - పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకొని - లోనికివచ్చి - నాగమ్మ బ్రతుకు కోసము తనరక్తాన్ని ధార పోశాడట. తానిక్కడ ఎక్కువ సేపు ఉంటే ఎవరైనా గుర్తిస్తారేమోననీ - తనరాక మీకు కోపకారణ మవుతుందేమోననీ - భయపడి - మీరు లోప

లికి పోయినప్పుడు – బయటికి వచ్చిపోయినాడట. ఇదీ మన రాజయ్య కథ.

ఈ సంగతంతా నాకు ఆనాడే తెలిసినది. గురుదేవుడు నిన్నటి వరకూ చెప్పినట్లుగా నేనే మీతో బొంకుతూ వచ్చుకొన్నాను. ఆయన చెప్పవద్దనటానికి కారణముంది. ఆజబ్బులో హఠాత్తుగా తన సంగతి వింటే నాగమ్మకు మళ్ళీ ఏమైనా ప్రమాదము కలుగవచ్చునని—ఆరోగ్యము కుదుటపడినతర్వాత చెప్పుట మంచిదని — ఆయన చెప్పుట చేత కాదనలేక నేనూ ఊరకున్నాను. ఇప్పుడు చెప్పవచ్చునని గతరాత్రి ఆయన చెప్పుటవల్లనే మీకీకథ అంతా చెప్పగలిగాను.''

అని పెద్దిరెడ్డి చెప్పుట ముగించుసరికి మంగపతి నిలువున నీరైపోయినాడు. నాగమణి – పొరలి పొరలి వచ్చు దుఃఖములో ''బావవంటి మనిషి యీ ప్రపంచములో లేడు. నాసుఖము కోసము – అవసరమైతే తనరక్తాన్ని కూడా ధారపోస్తానని – ఏనాడో మాటవరుసకన్న మాటను ఈనాడు చెల్లించుకొన్నాడు. నిజముగా నేను పాపిష్ఠురాలను. ఆయన్ని ప్రేమించి మోసగించాను. ఆయన జీవితాన్ని పాడు చేశాను. అటువంటి ప్రేమమూర్తి నాకు దక్కుతాడా? '' అని బావురుమన్నది. మంగపతి కొంతసేపటికి తన్ను దాను సముదాయించుకొని ''పెద్దిరెడ్డీ! తాను జానకినికూడా ప్రేమిస్తున్నట్లు — ఆనాడు — ఒప్పుకొన్నాడుగదా? మరి ఎందుకు సన్యసించాడు? ఆమెను పెండ్లాడి సుఖింపవచ్చునే?

ఆసంగతి యేమైనా చెప్పినాడా? ” అని తనయనుమాన నివృత్తికొఱకు - అడిగినాఁడు.

పెద్దిరెడ్డి మరల సంభాషణ సాగించినాఁడు.

పెద్ది:- అయితే మీ కింకను ఆ యనుమానము పోలేదన్న మాట. రాజయ్య పవిత్ర ప్రేమతత్వాన్ని మీ రింతవఱకూ గుర్తింపలేరు. జానకమ్మను ఇప్పటికీ ఆయన ప్రేమిస్తున్నాడు. కాని యా ప్రేమ విషయసుఖాసక్తమైనది కాదు. అది పవిత్రమైన సోదర ప్రేమ.

నాయు:జానకీ కూడా అట్లే ప్రేమించినదా?

పెద్ది:- లేదు. ఆమె కులకన్యా ధర్మముతోనే ప్రేమించినది. కాని రాజయ్య సన్యాసముతో నామె పవిత్ర ప్రేమ భగ్నమైనది. దానితో నామె కూడా సన్యసించినది.

నాయు:ఆఁ! ఇది నిజమేనా రెడ్డి!

పెద్ది:- నిజము బాబూ నిజము. నాగమ్మ ప్రేమకోసము రాజయ్య సన్యసిస్తే ఆయన ప్రేమకోసము జానకమ్మ సన్యసించినది. ఇదొక విచిత్ర సంఘటనము. నేడామె యోగినీ వేషముతో యోగినీవృత్తి నవలంబించి బ్రతుకు చున్నది. మీకీ సంగతి తెలియలేదు కాబోలు! ఆమె యిప్పుడు తన గృహమును గూడ పరిత్యజించి - మన భాషామందిరములోనే నివసిస్తున్నది. ఏక భుక్తము - భూతల శయనము—— ఆమె స్థితి మఱీ వింతగా ఉన్నది. ఇరువది యేండ్లన్నా నిండని జానకమ్మ ఈ రీతిగా సన్యసించినదంటే రాజయ్య మీద ఆమెకు గల ఆ పవిత్ర

ప్రేమ యెట్టిదో నే నూహించ లేకున్నాను. ఆ బాల యోగి నికి మన మందరమూ చేతులెత్తి నమస్కరించాలి. ఆ పవిత్ర ప్రేమ దేవతా సమారాధనలో జానకమ్మ రాజయ్యను కూడా మించి పోయిందని నా దృఢవిశ్వాసము.

ఆమెను గురించి యెవ్వరైనా సాహసపడితే పుంగలు పడిపోతారని రాజయ్య బాబు అన్నారు. పవిత్ర ప్రేమలోగాని - సచ్ఛీలములోగాని - ఆమె పేరు సార్థకమనవచ్చు. ఈ కాలములో ఆమె పుట్టవలసినది కాదు.

నాగ:- నిజము పెద్దరెడ్డి! జానకి ఒక బీదయింటి పిల్లయైనప్పటికీ - పెద్ద చదువులు చదవక పోయినప్పటికీ — నేటి కన్యాలోకానికి పవిత్రప్రేమ తత్వాన్ని విప్పి చూపింది. భారత మహిళా సంఘానికి ఒక గుణ పాఠాన్ని నేర్పింది. నిశ్చలప్రేమ యెట్టిదో తెలియని మా చదువు లెందుకు? తగుల బెట్టనా. నీటిలోవేసి చదువు గోత.

ఆమె కున్నంత నిశ్చల ప్రేమ నాకు లేకపోబట్టేగా బావ బ్రతుకు ఇట్లా అయింది? ఒకప్పుడు నన్నన్నది కాని నాకంటె నిజముగా ఆమెయే ధన్యురాలు. తన ప్రేమకు ఫలము లేదని తెలిసియూ దాని కొఱకే తన జీవితాన్ని అర్పించింది. ఇక నేనో? నా ప్రేమకు ప్రతిఫల మున్నదని తెలిసి కూడా దానిని కాలదన్ని నీచప్రేమకు దాసోహమన్నాను. ఆమె యెదుట నేనెందుకూ కొఱగాను.

సింగయ్య చనిపోయినప్పటినుండీ జానకిలో యోగినీ లక్షణాలు గోచరిస్తూ వచ్చినవి. పితృవియోగ దుఃఖము—

నిరాధారస్థితి - ఫలసిద్ధిలేని ప్రేమ - ఇవన్నీ పెనవై చుక్కొని ఆమెను విరక్తురాలిగా చేసినవి. లేకపోతే వేలు పడ్డవని తనకై తాను జుట్టు కత్తిరించుకొంటుందా? దీనికంతకూ నేనే కారణము.

పెద్ది :- నాగమ్మా! ఒకరి కర్మానికి మరొకరెప్పుడూ కారకులుగారు. వారి విధి అట్లాఉంది. అది అంతే. ఇంక దాన్నిగురించి మాటాడకు.

మంగపతి బాబూ! రాజయ్య బాబు నీతో మరి రెండుమాటలు జెప్పమన్నాడు. మొదటిది: రూపలతాదేవి నీచురాలనీ — శీలవతి కాదనీ — ఆమె సహవాసానికీ, ఆమెతో భారత దేశము పర్యటించటానికీ అమ్మాయిని పంపవద్దనీ—అన్నాడు. రెండవది: జానకికి కొంత ఆస్తి — రొక్కమూ—ఆమె యెందు కిచ్చిందీ ముందు ముందు తెలియ వస్తుందనీ—ఆ విషయములో తన్నెంతమాత్రమూ శంకించవద్దనీ—తనయందు యెట్టిద్రోహమూ లేదనీ — తనమాట విశ్వసించ వలసినదనీ — అన్నాడు.

నాగ :- ఏపాడు ముహూర్తాన—బావ వద్దన్నకొద్దీ-ఆకోటకు పోయినామోకాని ఆ గడియనుంచీ మా కన్నీ కష్టాలే చుట్టుకొన్నవి. ఎవ్వరేమన్నా సరే నేను మాత్రము ఆ జమీందారిణి మొగమైనా చూడను. బావ చెప్పేది అక్షరాలా పాటించాలి నాన్నా!

నాయు:అవునమ్మా! బావ యెటువంటివాడో—జానకి యెటువంటిదో—నాకిప్పుడు చక్కగా బోధపడినది. ఆ దుష్ట

రాలు చెప్పిన మాటలు విశ్వసించబట్టే యింతఘోరము జరిగినది. లేకపోతే బావ నీకూ—నాకూ దూరమైపోడు.

పెద్దిరెడ్డి! మారాజయ్యను ఒక్కసారి చూడాలి. లేకపోతే నా మనస్సుకు శాంతి ఉండదు. ఆ పాడుదారి నాకు బాగా గుర్తులేదు. ఆ యింటికి పోతే చచ్చిపోయిన నా బావ నామోలి సాక్షాత్కరిస్తాడు. ఆయనకు నే జేసిన అన్యాయానికి సమాధానము చెప్పలేను. నా వాగ్దానాన్ని చెల్లించుకోలేక పోయినాను. నాపాపానికి ప్రాయశ్చిత్తమనేది ఉన్నదో? లేదో? నేను ఒక్కడనూ పోలేను. నీవెంటవస్తాను తీసుకుపో నాయనా!

పెద్ది:— ఇప్పుడు కాదు. తన యనుజ్ఞలేనిదే యెవ్వరినీ తీసుక రావద్దన్నాడు. అదీగాక సత్తురు ఇచ్చినందువల్ల కాబోలు ఆయన చాలా సీరసించి ఉన్నాడు. వద్దన్నప్పటికీ ఆయన స్థితిని గమనించి నేను ప్రతిరాత్రీ అక్కడకి వెళ్ళుతున్నాను.

నాయు:పో నాయనా పో. అవసరమైతే పగలు కూడా అక్కడే ఉండు.

నాగ:— నన్ను వద్దనడు లే మా బావ. రెడ్డి! నన్నెప్పుడు తీసుక పోతావు?

పెద్ది:- పోదాములే. నీ ఆరోగ్యము బాగా చక్కబడనీ తల్లీ!

మంగ: ఈ పాపిష్టిదాన్ని—నన్ను మఱచిపోకు పెద్దిరెడ్డి! ఇంత ఘోరానికి ముందుగా ఒడిగట్టినది నేనే. అమ్మాయిని కోటకు పొమ్మన్నరోజున రాజయ్యను ఎంత తూలనాడి

నాను ? ఎన్ని అనరానిమాట లన్నాను ? ఏమన్నా నోరెత్తినాడా? నన్ను ఒక్కమాటైనా అన్నాడా? అంతటి మంచివాడు మా కెందుకు దక్కుతాడు ?

పెద్ది:- జానకమ్మకూడా స్నానంటున్నది. అందరమూ కలిసి ఒకసారి పోయివద్దాము.

అని చెప్పవలసిన దంతయు జెప్పి — పెద్దిరెడ్డి యట నుండి కదలి — తిన్నగా భాషామందిరమున కేగినాఁడు. అతఁడు పోయినగంటకు మధుసూదనరావు ఇంటికి తిరిగివచ్చి నాఁడు. అతని ముఖ మెందులకో ఎఱ్ఱఁబారి ఉన్నది.

మంగపతినాయుఁ డల్లునిఁజూచి "ఎందుకు నాయనా కోపముగా ఉన్నావు? బయట యేమైనా జరిగినదా?" అని ప్రశ్నించినాడు.

మధు:-బయట జరిగినది యేముంది ? జరుగవలసినదంతా యింట్లోనే జరిగింది ?

నాయు:ఇంట్లో యేమిజరిగింది మధూ?

మధు:-ఇన్ని గంటలసేపు ముచ్చటించుటయే - ఈ ఆసోది అంతా ఎందుకు?

నాయు:ఇందులో ఆసోది యేముంది ? మనకింత మహోప కారము చేసిన రాజయ్యను గుఱించి తెలుసుకొన్నాము. ఇంతేగా? ఇదికూడాతప్పేనా?

మధు:-తప్పా—తప్పున్నర కూడా. ఏమిటి ఆయన చేసిన మహోపకారము?

నాయు:అదేమిటి నాయనా అట్లా అంటావు? తన నెత్తురిచ్చి నీ భార్యను బ్రతికించినాడన్న గౌరవమైనా చూపవేమి? ఆమాత్రపు సాహసము నీకు లేకపోయెనే!

మధు:-ఆయన నెత్తురివ్వకపోతే బ్రతుకదు కాబోలు! ఆయుర్దాయమున్నవారికి ఏమందులూ అక్కర లేదు. అదిలేని వారికి ఏమిచ్చినా ప్రయోజనముండదు. ఆయుర్దాయము గట్టిగా వుండబట్టి అది బ్రతికిందిగాని ఆయన నెత్తురిచ్చినంత మాత్రాన బ్రతికేది కాదు.

నాయు:చాలా బాగున్నవి నీ మాటలు మధూ! ఈ కాలపు వారి సిద్ధాంతాలన్నీ ఇట్లేవుంటవి. అయితే ఈడాక్టర్లంతా యెందుకు? ఈ మందులన్నీ యెందుకు?

మధు:-ఎందుకా? డబ్బు గుంజేటందుకు. నెత్తురిచ్చిన యీ కాస్త పనికి ఆ రాజయ్యను కొండమీద కెత్తుతున్నారే! అవసరమైతే మీరు గొప్పగానైనా ముచ్చటించుకోండి గాని నా భార్యదగ్గర అతని ప్రసంగాన్ని తేవద్దు. అది నా కిష్టము లేదు.

నాయు:అతడు మాత్రము పరాయివాడా? నాయనా! నా సొంత మేనల్లుడు. ఈ యింట్లో చిన్నప్పటినుంచీ మా రక్షణలో పెరిగి పెద్దవాడైనాడు. ఏదో మాదురదృష్టము వల్ల ఈనాడు దూరమై పోయినాడుగాని లేకపోతే ఈ యింట్లో ఉండవలసినవాడు కాదూ?

నాగ:- వారి కిష్టము లేనప్పుడు నీ కీ మాటలన్నీ యెందుకు? ఊరుకో నాన్నా?

మధు:-'వారికి' అని ప్రత్యేకముగా నన్నంటున్నావు. అయితే నీ కిష్టమున్నట్లేగా ?

మంగ: అదేమిటి నాయనా? తరతరాలనుండి వచ్చే చుట్టరికము ఈ నాడు తీసివేస్తే పోతుందా? నీకు మాత్రము కావలసినవాళ్ళు లేరూ?

మధు:-ఇటువంటి చుట్టఱికాలు నా కేమాత్రమూ నచ్చవు. నామాట మీరు విని తీరాలి. లేకపోతే మొదటికే మోసము వస్తుంది.

అంత నిక్కచ్చిగా మధుసూదనరావు మాట్లాడినందువల్ల అతనికి మఱెవ్వరు సమాధానము చెప్పలేదు. కాని యతని మాటలనుబట్టి రాజయ్యమీఁద నతనికి ద్వేషమున్నట్లు స్పష్టముగాఁ దెలియవచ్చినది. ఇది చివరికెట్లు పరిణమింప నున్నదో యని ఆ దంపతులు లోలోపల భయపడఁ జొచ్చిరి. రాజయ్యపట్ల తన భర్తకుఁ గల నీచాభిప్రాయానికి నాగమణి చాల ఖిన్నురాలైనది.

తన యారోగ్యము పూర్తిగాఁ జక్కఁబడిన తరువాతఁ దాను రాజయ్యబావ వద్దకు వెళ్ళుటకుఁ దనభర్త సమ్మతించునా యని కూఁతురు — ఒకవేళ ఎప్పుడైనఁ దమ మేనల్లునిఁ జుట్టపు చూపుగాఁ దమయింటికి తీసుకు రాఁ దలచిన అల్లుఁడు సహించునో సహించడో యని తల్లిదండ్రులు — అప్పుడే అనుమానపడిరి. మొత్తముమీఁద నాటి ప్రసంగమును బట్టి మధుసూదనరావు వర్తనము వారి కేమాత్రమూ నచ్చలేదు.

జానకమ్మ యోగినీదీక్ష గైకొన్నసంగతి క్రమక్రమముగా నాయుడు పేటలోని యాబాలగోపాలమునకుఁ దెలిసిపోయినది. అంతా చిలుతప్రాయమునందే యామెలోఁ గలిగిన యీ అద్వితీయమైన మార్పునకు గ్రామీణులందఱుఁ జాల యబ్బురపడి ముక్కుమీఁద వ్రేలు పెట్టుకొనిరి. పవిత్ర ప్రేమ తత్త్వమునకు అటు రాజయ్య—ఇటు జానకమ్మ—ఆదర్శ వ్యక్తులని కొనియాడిరి. ఆ జానపదు లామెను 'మాతా' యని పిలువసాగిరి.

జానకమ్మకు రాజయ్య స్థాపించిన యా భాషా మందిరమే పరమ పవిత్రమైన యాశ్రమము. ఆమె తన యావజ్జీవితమును దాని కంకితము చేసినది. అందలి విద్యార్థినీ విద్యార్థులకు మాతృ హృదయముతో విద్యగఱపుటయే యామె యనుదిన కాలక్షేపము. ఆ మందిరపు హద్దులను దాటి ఆ బాలయోగిని బయటికేఁ గూడఁ బోదు. ఆమె కితర మైన ప్రసక్తి లేనే లేదు. ఆమెది లోకవాసన లేని యేకాంత జీవితము.

ఒక ఋతువు గడచిపోయినది. నాగమణికిఁ బరిపూర్ణమైన యారోగ్యము గలిగినది. ఆమె ముఖము కళా ప్రపూర్ణమైనది. శరీరమునకుఁ దగినంత పుష్టి వచ్చినది. రాజయ్య త్యాగమువల్ల — ఆ ఘనవైద్యుని చేతి చలువవల్ల మధుసూదనరావు చికిత్సా సామర్థ్యమువల్ల—నాగమణి పూర్తిగా బ్రదికి బయటపడినది.

ఒకనాఁటి సాయంకాలము – ప్రొద్దు పడమరకు జారు వేళ – తల్లిదండ్రులతోఁ గలసి యామె జానకమ్మను జూడఁ బోయినది. భాషామందిరపు టావరణములో – ఆ ప్రశాంత వాతావరణము ననుభవించుచు – ఒక చల్లని వేపచెట్టు క్రింద – మూర్తీభవించిన శాంతి దేవతవలె – ఆ బాల యోగిని రాట్నము త్రిప్పుచున్నది. అలలు సుళ్ళు లేని ఒక ప్రశాంత మహాసాగరవలె గంభీర ముద్రలను ద్యోతించుచున్న యామె లేమొగముఁ జూచుసరికి ఆ ముగ్గురి మేనులు నొక విధమైన పూజ్యభావముతో గగుర్పొడిచినవి. వారామెను సమీపించిరి. నాగమణి హృదయ మెందుకో తీవ్రముగా గొట్టుకొనఁ జొచ్చినది.

జానకమ్మ వారినిఁ జూచి – లేచి– నాగమణి చెంతకు బోయి – అనురాగ రప్లుతమైన తన చల్లని హస్తమును ఆమె బుజముపై వైచి – తల్లీ! సుఖముగా నుంటివా? మన పరిస్థితుల మార్పువల్ల – అంతజబ్బులోఁ గూడఁ నిన్ను గని పెట్టుకొని – నీ దగ్గఱనే ఉండి – నీకు సేవ చేసే భాగ్యము నాకు లేకపోయినది. అయినప్పటికీ నీ ప్రేమ బంధము ధన్య మైనది” అని కన్నుగొలకులనుండి ప్రేమమయ దుఃఖ బాష్పములు రాల్చినది.

ఆ మాటలకు వేడినీటితోఁ దడిసిన తన కన్నులను పైటచెఱఁగుతో నద్దుకొనుచు – మంగమ్మ జానకమ్మ చేయిపట్టుకొని – తల్లీ! నీ కా భాగ్యము లేకుండ–నిన్నింటికి రాకుండ– కొఱకొఱ లాడిన పాపిష్టురాలను నేనే. మనసులో

అది పెట్టుకోవద్దు. నీ నిజస్థితిని గ్రహించేబుద్ధి నాకు లేక పోయినది. నావంటి పాతకురాలు ఎక్కడా ఉండదమ్మా! నాపాపాన్ని మన్నించు'' అని యెంతగనో నొచ్చుకొన్నది.

జానకమ్మ మంగమ్మ మాటలకు బదులు పలుక లేదు. నాగమణి పరితప్త హృదయముతో - దైన్యము ప్రస్ఫురించుచున్న చూపులతో - ఆమె ముఖమువంకఁ జూచినది. కాని జానకీ వదనమండలము కించిత్తు మార్పునకుఁ గూడ లోనుగాక - చాల ప్రశాంతముగా నున్నది. వారు నలువురు పంచపాళిలోనికిఁ బోయి కూర్చుండిరి.

అప్పటివఱకు నోరువిప్పక - మౌనముద్రతోఁ దల వంచుకొనియున్న మంగపతినాయుఁడు- కూర్చున్న తరువాత తీరని విచారమునకుఁ గుఱుతైన తన ముసలిమొగము నెత్తి - జానకమ్మవంకఁ దిలకించుచు - వణఁకుచున్న యెలుగుతో మాట్లాడుట కుపక్రమించినాఁడు.

నాయు: తల్లీ! జరిగిపోయినదానికి ఏమీ అనుకోకు. మా దుర దృష్టము వల్లనే మాకీ పాడుబుద్ధి పుట్టినది. ఇప్పటి కీవిధముగా మా పాపము పరిపక్వమై మాకిట్టి దుర్దశ ప్రాప్తించినది. ఇంక ముందేమి కానున్నదో? అంతా ఈశ్వరేచ్ఛ. ఏదట్లు జరిగినా ముందు రాజయ్యను చూడాలని మాత్రము నా మనస్సు తపించిపోతూఉంది. పెద్దిరెడ్డి యేమైనా కబురుతెచ్చాడా తల్లీ? నీవుకూడా వస్తానన్నావట. అమ్మాయి కూడా అతనికోసము కలవ

రిస్తున్నది. ఎప్పుడు పోదామన్నా? నేనొక్కడనూ పోలేకున్నాను.

నాగ : పెద్దిరెడ్డి యెప్పుడు వస్తాడు జానకీ!

జాన : అతడు మొన్నరాత్రి వెళ్ళినాడు. ఇంతవఱకూ రాలేదు.

నాగ : బావకు అన్నము పంపుతున్నావా?

జాన : లేదు. ఇక్కడకు వచ్చినప్పటినుండీ ఆయన భోజనము మానివేసి– పాలూ పండ్లతోనే బ్రతుకుతున్నాడట. అవన్నీ రెడ్డి పట్టుకపోయి యిస్తున్నాడు.

నాయు: అన్నముగూడా మానేశాడా జానకమ్మ? ఎంత ఘోరము? మా యింట్లో ఉన్నప్పుడు వాడెంత సుకుమారిగా భోంచేసేవాడు? చివరి కిట్లా మారిపోయింది వాడిస్థితి.

నాగ : నీవుగూడా సన్యసించిన సంగతి బావకు తెలుసునా జానకీ?

జాన : తెలుసు తల్లీ! ఇందులో రహస్యమేమున్నది? నా కింతకంటే కావలసిన దేమున్నది? ఒక్కసారి ఆయనను దర్శించి రావాలని మాత్రమే నా చివరి కోరిక. అదైనా ఫలిస్తే చాలు ఈ జన్మ కృతార్థత చెందుతుంది. అందు కింకా అనుజ్ఞ రాలేదు.

నాయు: ఆయన అనుజ్ఞకోసమేనమ్మా నేనూ ఎదురు చూస్తున్నాను. అది నేను బ్రతికి ఉండగా వస్తుందో లేదో? మా రాజయ్యను చూస్తానో చూడనో?

అని మంగపతి నాయుఁడు కన్నీరు పెట్టుకొనెను. చిన్నప్పటినుండి అతనిని పెంచి - పెద్దఁజేసిన మమకార మంతయు నప్పుడొక్కసారిగా నా ముదుసలి శుష్కహృదయములో దూరి — అతనిని మిక్కిలి బాధపెట్టినది - అతఁడు దానివలె నతిఁడు గోపురమున్నాఁడు.

అట్టి సమయమునఁ బెద్దరెడ్డి యచ్చటికి వచ్చినాఁడు. అతనిని జూడఁగనే ముసలినాయుడు మొగము వికసించినది. అతఁడు పట్టరాని యానందవేగముతో "ఎంత కాలమని మమ్మిట్లా వుట రెడ్డీ? ఇప్పటికైనా అనుజ్ఞ వచ్చినదా?" అని అడిగినాఁడు.

పెద్ది : ఆఁ! వచ్చినట్టే. రాఁదలచిన వారందఱూ రావచ్చును.

నాయు: అమ్మయ్య! బ్రతికినాము నాయనా! మఱి పోవు టెప్పుడు?

పెద్ది : ఎల్లుండి ఉదయమున.

నాగ : పెద్దిరెడ్డీ! మున్ను బావ చాల నీరసించి వున్నాడంటివి. యిప్పుడు బాగా ఉన్నాఁడా?

పెద్ది : ఆ రక్తక్షయమునుండి చాలవరకు తేరుకొన్నాడు. ఆయన కినుక సరిపోయినది. మనబోటి వాళ్ళయితే యీపాటికెప్పుడో యమునిలోకానికి పోవలసి వచ్చేది. ఆనాడు ఎంత రక్తము తీసినాడు వైద్యుడు? తాను కోలుకోలేనని నీభర్త కాదన్నాడు.

ఆ మాటలతో నాగమణి నవనీత హృదయము ప్రగాఢ విషాద పరితాపమునఁ గరగిపోయినది. ఆమె

ప్రత్యుత్తరము చెప్పలేక క్రుంగిపోయినది. చెమ్మగిల్లిన కన్నులతో జానకి యామె నోదార్చినది. కొంచెము సేపైన తరువాత మంగపతి కుటుంబము - ఆ యోగినీ మాతవద్ద సెలవుగైకొని - అటనుండి కదలిపోయినది.

అనంతరము పెద్దిరెడ్డి "జానకమ్మా! నీవు వచ్చినపుడు ఆ జమీాందారిణి నీకు వ్రాసియిచ్చిన దానపత్రాలు- ఉత్తరాలు - వెంట తెమ్మని గురుదేవుని ఆజ్ఞ. నేనిప్పుడే వెళ్ళుచున్నాను. మరల రేపురాత్రికి వస్తాను" అని చెప్పి యప్పుడే బయలుదేరి పోయినాఁడు. ఒంటిరిగానున్న జానకి ఆలోచనా సముద్రములో మునిఁగిపోయినది.

ఆ రాత్రి భోజనములైన తరువాత మంగపతి అల్లునిఁ జూచి "నాయనా! ఎల్లుండి మే మందఱము పోయి మా రాజయ్యను జూచిరావాలని అనుకొన్నాము. నీవుకూడా వస్తే చాలా బాగుంటుంది. లేకపోతే అమ్మాయినైనా పంపించు. ఈ జన్మకు మేము చేయగలిగేది ఇంతేగా? ఈ ముదుసలి కోర్కె కాదనకు" అని పలుక మధుసూదనరావు ఏ బుద్ధితో నున్నాఁడో కాని బదులుమాట చెప్పక- "సరే. మీా యిష్ట"మన్నాఁడు. తాను మాత్రము రానన్నాడు. ఆ సమస్య అంత సులభముగాఁ దేలిపోయినందుకు నా వృద్ధుఁడేగాక తల్లి గూతుఁలు గూడఁ జాల సంతోషించిరి. కొండప్ప దంపతులును వారి వెంట వచ్చెదమనిరి.

ఆ రోజు ఉదయాన - మంగపతినాయుఁడు చాల వెందలకడనే లేచి — ప్రయాణమునకు సిద్ధపడినాఁడు.

నాగమణి మామూలు పల్లెటూరి దుస్తులే ధరించినది. వారందఱు బయలుదేరుసరికి పెద్దిరెడ్డి జానకమ్మతో బయలుదేఱివచ్చి వారిని గలిసికొన్నాఁడు. పాపన్నగూడ జానకి వెంట వచ్చెనది. గ్రామముపొలిమేరలు దాటుచునప్పటికి వారెల్లరు గ్రామమును నిర్గమించి పంటపొలములను సమీపించిరి. తాను మొట్టమొదట – అచ్చట గురుదేవునిఁ గలిసికొన్న చోటును – వారి కందఱకుఁ జూపించెను.

యోగిని వేషములోఁగూడ జానకమ్మ సహజసౌందర్య కళ మాసిపోలేదు. ఆమె ధరించిన కావిరంగు ఖద్దరుచీర ఆ బంగారు లేయెండ కాంతిలో మిలమిల మెఱసిపోవుచుండెను. ఆమె శిరోజములు–ఈ యేడాదిలోపలఁ గొంచెము పెరిగి మెడక్రిందికి జారినప్పటికి – సంస్కారము లేకపోవుట చేతఁ జిక్కువడి యున్నవి. యోగిని తిలకము దిద్దిన యామె మొగమునఁ బ్రశాంతి గంభీర భావములు ప్రస్ఫుటములగుచుండెను.

వారందఱు– ముందు పెద్దిరెడ్డి దారితీయుచుండఁగా– పంటచెఱువు సన్నాలి గట్టును దాటి– కొన్ని మలుపులు గడిచి– రెండుగట్టులనడుమ నడుమనఁ జొచ్చిరి. ఆ గుట్టలమీఁద – అప్పుడప్పుడు – క్రూరజంతువులు తిరుగుచుండును గనుక – ఆ ప్రాంతమున జనులు పిచ్చలవిడిగా సంచరించుచుండరు. కట్టెలుగొట్టువారు – కొండగడ్డికి పోవువారు – పసుల కాపరులు – తగు జాగ్రతతోఁ బ్రతిదినము వచ్చుచుంబోవుచుందురు.

నాయుఁడుపేటకు – మల్లయ్యగట్టుకు – షుమారు ఒక మైలుదూరమునకు మించియుండును. నాగమణి – లోపలనున్న ఉత్సాహశక్తివల్లనో యేమో – ఆయాసపడకుండ సాగిపోవుచున్నది. కొంతసేపటికి వారా యిరుకుత్రోవను గడచిన – కొద్దిపాటి మెరకయెక్కి దిగి – మల్లయ్యగట్టును సమీపించిరి. కొలఁది దవ్వులోనే రాజయ్య నివసించుచున్న పూరియిల్లు కానవచ్చెను. ఆ తృణకుటీరమును డగ్గఱించు కొలంది నాగమణి హృదయస్పందనము తీవ్రముగా హెచ్చెను. మంగపతి యెందుకో కంపించుచు నడువలేక పోయెను.

ఎట్టకేలకు వారెల్లరు నా గృహావరణములోఁ బ్రవేశించి తిన్నగా లోనికిఁ బోయిరి. అందొకమూల– ఒక చిన్న తిన్నెమీఁద – కావిరంగు దుప్పటిపఱచిన నారికేళకటాసనముపైఁ గూర్చుండి – రాజయ్య ప్రశాంత వదనముతో నేదో గ్రంథమును బఠించుచుండెను. వారి రాక కతఁడచ్చెరువు పడలేదు.

పెద్దిరెడ్డి యందఱికంటె ముందుగా గురుదేవుని పాదములకుఁ బ్రణమిల్లెను. తరువాత యోగినీమాత – జానకి – అతని యడుగు దోయిపై వ్రాలి – అశ్రుజలములతో గురుచరణములను గడిగి – పవిత్రప్రేమభావ కుసుమములతోఁ బూజించి – హృదయనైవేద్య మొసంగెను. నాగమణి – అతనిని గన్నెత్తిచూడలేక – మృదుకపోలములపైఁ గన్నీటిధారలు జాలువాఱ – అవనతవదనయై యట్లే నిలబడి యుండెను. మంగపతి చెమ్మగిల్లిన కన్నులతోఁ జేరఁబోయి–

మేనల్లునిఁ గౌఁగలించుకొని – శాఫురుసుని యేడ్చెను. మంగమ్మ ప్రక్కనే నిలఁబడి గ్రుక్కెడునీరు గ్రుక్కుకొనుచుండెను. పాపమ్మ బిత్తరపోయిన దానివలె నేమియుఁ దోచక నాగమణిచెంతనే నిలువఁబడి – కన్నులప్పగించి చూచుచుండెను.

కొన్ని నిముసములైన తరువాత రాజయ్య తిన్నె దిగి లేచివచ్చి – నాగమణిని సమీపించి – "ఇట్లు నిలఁబడియున్నావేమి నాగూ! ఈ విచార మెందుకు? అధోముఖివగుట యెందుకు? ఇది ప్రశాంతమందిరము. ఇచ్చట విషయక సంబంధములైన సుఖదుఃఖములకు చోటులేదు. శాంతిసాధన చేయుచుండువారి తపస్సిద్ధి. రా. ఇటువచ్చికూర్చో –" అని ప్రశాంత వచనములతో నామె నోదార్చి – తిన్నెదాపునఁ గూర్చుండఁజేసి – తాను మరల యథాస్థానమునఁ గూర్చుండి – యింకను కుమిలి కుమిలి వాపోవుచున్న మామను సనుననుంచి "మామయ్యా! దేవుని కృపవల్ల – నాగమణి నిరుపద్రవముగా బ్రతికి బయటపడినందుకు మనమందఱము సంతోషింతము. భక్తితో పరంధాముని ప్రార్థింతము. దుఃఖము మాను"మని హెచ్చరించి కొంచెముసేపు దైవసంకీర్తనము గావించెను.

ప్రార్థనానంతరము మంగపతి మేనల్లునిఁ జూచి "నాయనా! నాగమణి బ్రతుకు నీవు పెట్టినభిక్ష. నీ ఋణము మును జన్మజన్మాలకూ మేము తీర్చుకోలేము" అని పలికెను.

రాజ : అట్లనరాదు. నాగు బ్రతుకు ఒకరి భిక్ష కానేరదు. ఇదంతా దేవుని దయాభిక్ష. మన మందఱము ఆ విశ్వమయుని చేతిలోని కీలు బొమ్మలము.

నాయు: దేవుడెప్పుడూ ఏపనీ తాను చేయడు. ఒకరి ద్వారా చేయిస్తాడు. నీరూపముతో ఆయన మాకీ దయాభిక్ష పెట్టినాడు. ఇందుకు నీవ్వూ కాదనలేవు నాయనా!

మంగ: రాజయ్యతండ్రీ! నాగును నీకు కాకుండా చేసినదాన్ని నేనే. ఈ మార్పుకంతా కారణమూ నేనే. మా దుర దృష్టానికి కారకురాలనూ నేనే. ఏనాడు నీవు మాయిల్లు విడచిపెట్టి పోయినావో ఆరోజునుండీ మా యదృష్ట మంతా మారిపోయినది. కష్టాలన్నీ మమ్మల్ని చుట్టు కొన్నవి. నాతప్పు మన్నించు నాయనా!

రాజ: మన్నించుటకు నేనెవ్వఁడను తల్లీ! ఇందెవ్వరి తప్పూ లేదు. ఇదంతా దైవనిర్దేశము. ఆ నిర్దేశాన్ని ఎవ్వరూ తప్పించలేరు. చూడు. జానకి నాకంటె ఎంతో చిన్నది. సుఖపడవలసినది. ఈ పసితనములో – ప్రపంచ మంటే యేమిటో తెలియక మునుపే – ఈలాంటి కఠినమైన యోగిని దీక్ష గైకొన్నదని విన్నప్పుడు నా మన సెంతో పరితపించినది. అయినప్పటికీ – ఇదికూడా దైవనిర్దేశమే నని – దాని నెవ్వరూ తప్పింప లేరనీ – నాకు నేనే సమాధానము చెప్పుకొన్నాను. ఈ మహావిశ్వములో అనుక్షణమూ జరిగే సంఘటనలన్నింటికీ ఆయా వ్యక్తులు కారకులంటారు కాని నిజము పరికిస్తే ఎవ్వరూ కారకులు గారు. అయినప్పటికీ ప్రపంచ నటన కొఱకు అట్లా అను కోక తప్పదు. లేకపోతే ప్రపంచమే శూన్యమై పోతుంది.

మామయ్యా! మిమ్మొందఱిసే రప్పించటానికి ఒక మహా కారణముంది. ఇంతవఱకూ ఒక రహస్యాన్ని మీకు చెప్పలేను. అది యెందుకు చెప్పలేదో తరువాత చెప్తాను. అసలు రహస్య మేమిటో తెలుసుకోండి. జానకీ! ఆ జరిగిన దంతా మామయ్యకు వినిపించు. మన జీవితాలే మారిపోయి నప్పుడు మనకింకా రహస్యాలెందుకు? ప్రాణిక సంబంధమ్ములైన యీ గొడవ లెందుకు? మన నిర్దోషిత్వాన్ని ప్రకటించుకో వలసిన సమయము వచ్చింది.

ఈతీరున రాజయ్య చెప్పినంతనే జానకి — కన్నీరు తుడుచు కొనుచు నిశ్చల హృదయముతో ఆదినుండి నాగమ్మ పెండ్లివరకును — పున్నమ్మ ద్వారా తన మధ్య — జమీందారిణి మధ్య — నడచిన వృత్తాంతమును — తన వెండ్రుకలను చివరకు చావెందుకుఁ గత్తిరించి యిచ్చినది — మొదలగు విషయములన్నియుఁ బూసగ్రుచ్చినట్లు వినిపించెను. ఆమె చెప్పునప్పుడు కొన్ని కొన్ని సందర్భములలోఁ బెద్దిరెడ్డితోఁ బాటు తల్లిబిడ్డలు గూడఁ గన్నీరు పెట్టుకొనిరి.

ఆ విషయమంతయుఁ జెప్పుట ముగిసిన తరువాత జానకి — తన పేర జమీందారిణి వ్రాసిపంపిన దానపత్రమును — ఆ యుత్తరమును — మంగపతిచేతి కందిచ్చెను. అతఁడు పెద్దిరెడ్డిచేతికిచ్చి చదువుమనెను. పెద్దిరెడ్డి వానిని జదివెను. ఆ యుత్తరములోని సంగతులు విన్నంతనే యందఱు తెల్లఁబోయి జానకి రాజులవంకఁ జూచిరి. మంగపతికి రూపలతాదేవి కుట్రయంతయు నప్పటికి బోధపడెను.

కోటకుఁ బోయినప్పుడు తన కా సీచురాలు కల్పించి చెప్పి విషయములన్నియు నతఁడు వారికి వినిపించెను. ఆ యభూ కల్పనలకు జానకీ రాజుల హృదయము లేగాక తక్కినవా చిత్తములుగూడఁ జాల తపించినవి. ఇప్పటికైన నిజమ తెలియనచ్చినందుకు వారెల్లరు దేవునకు నమస్కరించిరి వారందరి దృష్టిలో జానకి — రాజయ్య — సాటిలే పవిత్రమూర్తులు.

ఇంత కాలమునుండి మనస్సును బాధించుచున్న రహస్యమంతయుఁ దెలిసిపోయినతర్వాత మంగపతిరావు తన యవివేకమునకు— దూరదృష్టి లేమికి — చాల నొచ్చు కొనుచు "రాజయ్యా! ఈ రహస్యమును దాచియుంచక నా కప్పుడే చెప్పినట్లయితే ఇంత జరిగేది కాదుగదా? నాకుగూడ దూరాలోచన లేకపోయినది. ఆతుచ్ఛురాలు పన్నిన మాయ వలలో పడి ఇంత దుర్దశ తెచ్చుకొన్నాను." అని యెంతో విచారపడెను.

నాగమణికూడ ఖిన్నవదనయై "బావా! ఇదంతా చేతులార తెచ్చుకొన్న యనర్థకము. నీవుగాని -జానకిగాని- ఈ గుట్టంతా నాతోనైనా చెప్పివున్న నాస్థితి ఇట్లయ్యేది కాదు. నాకింత చెడ్డపేరు వచ్చేదికాదు. ఈ రహస్యాన్ని నాకుకూడా చెప్పకుండ దాచిపెట్టితివి గదా?" అని కంటికి మంటికి నేకధారగా విలపించినది.

అప్పుడు రాజయ్య-ఒక్కదీర్ఘనిశ్వాసము పుచ్చి-తాను చెప్పకుండుటకు గల కారణము నిట్లు వివరించి చెప్పెను.

"మామయ్యా! నామీద — జానకిమీద — ఆ జమీందారిణికి కోపమున్నది. కొన్ని సంవత్సరాల క్రిందట నేనొకసారి మన లారీనిండ కలప యెత్తించుకొని — మన యూరి డొంక దారిలో పోతూవుండగా - ఆ జమీందారిణి యెక్కివస్తున్న చిన్న కారు మా కెదురుపడ్డది. దారి యిరుకుగా ఉండుటచే తొలగిపోవటానికి వీలు లేక పోయినది. అందుమీద తన అధికారాన్ని చెలాయిస్తూ మనలారీని వెనుకకు నడుపుమన్నది. నేనందుకు ఒప్పుకోలేదు. నాకూ — ఆమెకు కొంత ఘర్షణ జరిగినది. తరువాత తానే తనకారును వెనుకకు నడిపించుకొనిపోయి మాకు దారి యిచ్చినది. తన అధికారాన్ని ధిక్కరించానన్న కోపము ఆమెకు నామీద పూర్తిగావుంది.

ఇక జానకిమీద ఎందుకంటారా? సింగయ్యను తనకు తానై కోటకు పిలిపించి — జానకిని సినిమాలోకి పంపమని కోరింది. అతను కాదన్నాడు. ఎంతో డబ్బు ఆశపెట్టి ఆమె తలకట్టు ఇప్పించమని అడిగింది. అందుకూ అతడు కాదన్నాడు. కూటికి గుడ్డకూ లేని సింగయ్య కూడా తనమాటను కాదన్నాడే అని ఆమెకు ఒళ్లు మండి పోయింది. ఆ కసి తీర్చుకోటానికి — తనకోర్కె నెరవేర్చుకోటానికి — ఈ పన్నాగము పన్ని పున్నమ్మ ద్వారా నాటకమాడింది. తనగుట్టు బయటపడకుండా — బయటపడ్డప్పటికీ నీవు నమ్మకుండా — ఉండటానికని నన్ను కూడా కోటకు రప్పించుకొని నామీద లేనిపోనివన్నీ కల్పించి — నీకునూరిపోసింది. ఈవిధముగా తన

కోర్కెను నెఱవేర్చుకొని — జానకిని పరాభవించి రచ్చ కెక్కించింది.

నిన్ను—ఇంతగా నీ కాను చెప్పి — నమ్మింపఁజేసి నప్పుడు నీకీ గుట్టంతా చెప్పి నిన్ను ఒప్పిస్తే— తన గుట్టంత బయటపడ్డదనీ — నీవుకూడా తనమాటను పాటించ లేవని_ నీ మీద విఱుచుకుపడి – నీ వ్యాపారానికీ—నీ జీవితానికీ _ తీరని నష్టము కలిగిస్తుంది. తన జమీలోనికే నిన్ను కాలు పెట్టనీయదు. నాకొఱకై యింత అన్యాయము నీకు జరుగు తుందని దూరదృష్టితో ఆలోచించి — నీకీ రహస్యాన్ని అప్పుడు చెప్పకుండా దాచిపెట్టినాను. ఇందువల్ల కలిగే ఫలి తాన్ని—మంచి కానీ చెడ్డకాని — నేనే అనుభవించటానికి సిద్ధపడ్డాను.

నాగూ! నీకుకూడా చెప్పకపోవటానికి ఒక కారణ మున్నది. నామీద మొదటనుండీ మీ అమ్మకు ఇష్టము లేదన్నసంగతి నీకూ తెలుసు. నా సంబంధము ఆమెకు గిట్ట లేదు. ఆమె దృష్టి అంతా వేఱుగా ఉన్నది. నీవా తల్లి దండ్రుల చాటు పిల్లవు. వారిమాటకు కాదనలేవు. అట్టి సందర్భములో ఇదంతా నీకు చెప్పి – నీ మనసు కష్టపెట్టి— వారిమధ్య నీమధ్య—పొరపులు కల్పించదలచుకోలేదు. అదీగాక జానకిని గుఱించి నీవు అనుమానించినట్లు నేను ఊహించాను. కాబట్టి నీకు నిజస్థితి చెప్పినా ప్రయోజనము లేదని ఊరకున్నాను.

ఏది యెట్లు జరిగినా మనము కర్తలము గాము. ఇదంతా యిట్లవుతుందని ఎవ్వరూ అనుకోలేదు. అయినప్పటికీ దైవనిర్ణయము వేఱుగా ఉన్నది గనుక యిట్లా జరిగింది. దీని కెవ్వరూ బాధ్యులుగారు. ఎవ్వరివల్లనూ ఎట్టి తప్పూ లేదు. ఇప్పటికైనా నేను ద్రోహిని కానని – జానకి శీలవతి యని – మీరందఱూ నమ్మితే చాలు. నా కింతకంటె కోరదగినది లేదు. ఇంతకంటే మీకు నేను చెప్పవలసినది లేదు. మీకూ నాకూ గల లౌకిక సంబంధాలన్నీ తెగిపోయినవి. ఇక మీ దారి మీది. నా దారి నాది. దేవుడు మిమ్ము దయతో చూచుగాక!"

రాజయ్య చెప్పిన దంతయు వినుసరికి మంగపతిరావు నిశ్చేష్టుడై పోయినాడు. నాగమణి – యేడ్చియేడ్చి – వట్టిపోయిన కన్నులతో – తిన్నెకు చేరగిలఁబడినది. మంగమ్మ దెబ్బతిన్న మనస్సుతో – ఏమనుటకు నోరురాక – దిగాలుపడి చూడసాగినది. పాపమ్మ చిత్రప్రతిమవలెఁ బలుకకనే లేదు. పెద్దిరెడ్డి గురుదేవుని స్వార్థరహిత బుద్ధికి అంజలించినాఁడు.

అందఱి హృదయాలు క్రొంచెము కుదుటపడిన తరువాత జానకి గురుదేవుని సన్నిధికేఁబోయి – తనకు జమీందారిణీ వలన సంక్రమించిన యావదాస్తిని – అతని ధర్మకర్తృత్వము క్రింద – భాషాసుందరమునకుఁ దాను వ్రాసియుంచిన దాన పత్రమును– ఆయన పాదముల ముందఁ బెట్టి నమస్కరించినది. రాజయ్య విభ్రాంత నయనములతో నా పత్రము నామూలాగ్రము చదువుకొని – నిర్ఘాంతపోయినాఁడు. అవనత

వదనయై నిలబడియున్న జానకిని హెచ్చరించుచు "ఇదేమిటి జానకీ! ఈపని యెవ్వరు చేయుమన్నారు? చేయుటలోని భావమేమి?" అని ప్రశ్నించినాడు.

జాన:- గురుదేవా! ఎవ్వరూ చేయుమనలేదు. నాకై నేనే చేసినాను. ఈపని చేయుటలో నాకెట్టి భావముగూ లేదు. ఇది గురుదేవునకు—దేశసేవార్థము—ఒక శిష్యురాలిచ్చు నట్టి కానుక—దీనిని మీరు కాదనరాదు. నా జీవితములో నేను కోరే కోరిక ఇదొక్కటే.

రాజ:- నేను కాదనను. కాని యీ ఆధారమును గూడా పోగొట్టుకొని యెట్లు బ్రతుక గలవు?

జాన:- నా బ్రతుకుని గురించి యెట్టిచింతా నాకు లేదు. మీ రెట్లు బ్రతుకుచున్నారో అట్లే బ్రతికెదను. ఈ బొందిలో ప్రాణమున్నంత వఱకూ మీరు స్థాపించిన ఆ మందిర సేవ చేయుచూ—తద్వారా దేశ సేవ చేయుటే నా కృత నిశ్చయము.

రాజ:- జానకీ! నీ నిశ్చయము మెచ్చుకోతగినది. నీవు నిజముగా యోగినీ మాతవు. నీ వింతటినుండి 'మాత' అను పేరుతో దేశసేవ చేయుము. దేవుడు నిన్ననుగ్రహించుగాక!

జాన:- ధన్యురాలను. నా జన్మ చరితార్థమైనది. మీ రింత నుండి 'గురుదేవ్' అను పేరుతో మమ్ము నందఱినీ పునీతులుగా చేయండి!

రాజ:- పెద్దిరెడ్డీ! మా సంభాషణమునకు మీరు వింత పడ నక్కరలేదు. మాత వ్రాసియిచ్చిన యీ దాన పత్ర మును అందఱికీ చదివి వినిపింపుము. భాషామందిర సేవ చేయుటలో మాతకు అన్నివిధాలా నీవు చేయఁగలిగిన సహా యము చేయుచుండుము. నీ చదువునూ - నీ తనువునూ- దేశ క్షేమానికి వినియోగింపుము.

పెద్ది:- అనుగ్రహింపబడితిని. గురుదేవునియాజ్ఞశిరోధార్యము

అని పెద్దిరెడ్డి యా దానపత్రము నగైకొని యందఱికిఁ జదివి వినిపించెను. మంగపతి ఆమె త్యాగమునకు ముక్కుపై వ్రేలు పెట్టుకొన్నాఁడు. నాగమణి తన్ను దానెంతో నిందించు కొన్నది. తానుగూడ మాతతోఁ గలిసి మందిర సేవ చేయు టకు నిశ్చయించుకొన్నది. వారి సంభాషణ మంతటితో ముగిసినది. మాతా గురుదేవులతోఁ గలిసి వారందఱు దైవ సంకీర్తనములో మునిఁగిపోయిరి.

౧౨

గురుదేవునితో బ్రిదమసమావేశమైనప్పటినుండి — నాగమణి — అనేక విధమైన బుద్ధితోఁ స్వవిషయము నందుఁగాని—సంసార విషయములందుఁ గాని — అంతగా శ్రద్ధచూపక ప్రవర్తింపఁజొచ్చినది. అప్పుడప్పుడు మాత తోను — పెద్దిరెడ్డితోను — గలసి గురుదేవుని సన్నిధికిఁ బోయి వచ్చుచుండెడిది. ఇది మధుసూధనరావున కేమాత్రే

మిష్టములేదు. అయినప్పటికి భార్యా పరివర్తనమును గ్రహించి యతఁడు వద్దనఁజాలక - చూచీ చూడనట్లు-మిన్నకుండెను. తఱచు తమయింటినుండి గురుబేప్రునకు పాలు—పండ్లు మొదలైనవి పంపఁబడుచుండుట గూడ నతనికిఁ జాల కష్టముకలిపించెను. కాని యందుగూర్చి గూడఁ గాదనలేక పైకి యెంతో యిష్టమున్నవానివలె నటింపఁజొచ్చెను.

ఈప్రకారము కొన్ని నెలలు గడచిపోయినవి. ఇంతలో మధుసూదనరావు శీలమునుగుఱించి గ్రామములో నొకవిధమైన పుకారు బయలుదేఱినది. మందులకొఱకుఁ బోయిన పడుచులతో సరసములాడుననీ — ఒంటరిగా స్త్రీలను బరీక్షించునప్పుడు పిచ్చిపిచ్చి పనులుచేయుననీ — క్రొత్తగాఁ దనకై తాను తెచ్చిపెట్టుకొన్న మంత్రసానితోఁ జాల నీచముగాఁ బ్రవర్తించుననీ — అతనిని గుఱించి గ్రామీణులు రకరకాలుగాఁ జెప్పుకొనసాగిరి. అతని దౌష్ట్యములకు గురియైన యువతులు గొందరు బహిరంగముగనే తిట్టిపోయఁజొచ్చిరి. చాలమంది మందులకొఱకుఁ బోవుటయే మానుకొనిరి.

మర్యాదగల కుటుంబీకులు గొందఱు మంగపతిరావు నొద్దకుఁబోయి - యతని దుష్టచర్యలను వినిపించి—మా గతియేమని మొత్తుకొనసాగిరి. తఱచు ఇట్టి ఫిర్యాదులు నాయుఁడుగారి చెవినిఁ బడుచుండెను. కాని యతఁడు జామాతను మందలింపఁజాలక జానపదుల కెట్లో సమాధానము చెప్పుచు —— లోలోపలఁ గుటుంబ గౌరవము కూలిపోవు

చున్నందులకు కెంతగనో కుమిలిపోవుచుండెను. ఎటుపోయి ఎటువచ్చునో – ఏమి జరుగునో యని యతఁ డనుదినము— అల్లుని జీవితమును గురించి భయపడజొచ్చెను.

ఊరిలోని అమ్మలక్కలద్వారా ఈ దుర్వార్తలు తల్లి కూఁతురులకుఁ గూడఁ దెలియవచ్చెను. అసలే అంతంతగా నున్న నాగమణికి — ఈ చెడు సంగతులు విన్నప్పటినుండి భర్తపై రోత పుట్టినది. కాని కులవతి– గుణవతి విద్యావతి అగుటచేత లోలోపలనే తన యసహ్యము నణంచుకొని – ఆ దుశ్చేష్టలను సహించినదానివలె భర్తనేమనక మెలగఁ జొచ్చినది. కుమార్తె కాపుర మేమగునోయన్న వెఱపుతో మంగమ్మకు దిగులు కూడైనది.

ఇట్టి పర్యావసానములతో మఱికొంత కాలము జరిగిన మీఁద – ఒకరోజు సాయంకాల మైదుగంట లప్పుడు — డాక్టరు మధుసూదనరావు — ఆసుపత్రినుండి తిరిగివచ్చి - వరండా గదిలోఁ గూర్చిండి—పత్రిక చదువుకొనుచుండెను. నాగమణి లోపల సాలులో తల దువ్వుకొనుచుండెను. మంగపతినాయుఁడు వరండాలో — ఒక పడక కుర్చీలోఁ బరుండి చుట్టఁ ద్రాగుచు — ఎదురుగా నిలబడి యున్న కొండప్పతో ముచ్చటించుచుండెను.

అట్టియెడ నొక గుఱ్ఱపుబండి వచ్చి వీధివాఁకిట ఆగినది. అందుండి ఒక పురుషుఁడు – ఒక స్త్రీ– దిగిరి. పురుషుఁడు కోటలోని ప్రతినిధి. స్త్రీ జమీందారిణి పరిచారిక పున్నమ్మ. వారిద్దఱు చరచర వరండాలోనికి వచ్చిరి. ప్రతి

నిధి - ఒక కుర్చీలోఁ గూర్చుండి- "డాక్టరుగారున్నారా?" యని మంగపతిరావు నడిగెను. పున్నమ్మ లోనికిఁ బోయెను.

వారి రాకకుఁ అచ్చెరువుపడి చూచుచున్న నాయుడు "ఉన్నారు" అని సమాధానము చెప్పెను. లోనికిఁబోయిన పున్నమ్మనుజూచి - తల్లి గూఁగొరు మనసులో సేవగించుకొనియు - మర్యాద కొఱకుఁ బలకరించిరి. ఆవులించినఁ బేవులు లెక్కించు నేర్పుగల పున్నమ్మ వారి మనోభావమును వారి మాటలలోనే గ్రహించి - ఎక్కువ సేపు అట నుండక మరల వరండాలోనికి వచ్చెను. అంతలోఁ దన కొఱకెవ్వరో వచ్చినారన్న భావముతో డాక్టరు గదితలుపు తెఱచుకొని బయటికి వచ్చెను.

అప్పుడు పున్నమ్మ డాక్టరుగారినిఁ జూచి - కన్నీరు పెట్టుకొని- " అయ్యా! తొందఱగా తాము కోటకు బయలు దేఱవలెను. మా అమ్మగారు చాల ప్రమాదస్థితిలో ఉన్నది. ఆలస్యము చేయవద్దు. మనము రెక్కలు గట్టుకొన్నట్లు పోవలెను" అని చెప్పెను.

డాక్ట:- ఎందుకంత తొందర ? అసలు ప్రమాద మేమిటో ముందు చెప్పండి.

పున్న:- ఈ సాయంకాలము మూఁడుగంటలకు అమ్మగారు బండిమీఁద - షికారునకు బయలుదేఱినది. త్రోవలో నొక మెరక యెక్కి బండి బోల్తాపడినది. అమ్మగారికి తలమీఁద బలమైన గాయము తగిలినది. చేతి మణికట్టు దగ్గర బొమికె విరిగినట్లున్నది. ఆమె స్పృహతప్పి పడి

పోతే మేమందరమూ చేతులమీద కోటకుచేర్చి — మీ కోసము పరుగెత్తుకొని వచ్చినాము. అక్కడ ఆమెగారి స్థితి యెట్లున్నదో? త్వరగా బయలుదేరండి!

నాయు:ఏమిటంత హాడావుడి పున్నమ్మా! అంతతొందరపడితే యెట్లా? కాసేపు నిదానించండి. నాయనా మధూ! రెండు మెతుకులు తినిపో. తిరిగి వచ్చునప్పటికి ఎంత ప్రొద్దుపోతుందో? వెంట కొండప్పనుగూడా తీసుకొనిపో. చీకట్లో తోడుగా ఉంటాడు.

పత్రి:— నాయుడుగారూ! భోజనానికి ఇది సమయముకాదు. అనతల అంతగా ప్రొద్దుపోతే డాక్టరుగారు అక్కడే భోంచేస్తారు. రాత్రికి కోటలోనే ఉంటారు. మాతో కొండప్ప యెందుకు? తోడుగా వెంటరావటానికి మా పరిజనులు లేరా యేమి?

నాయు:సరే. మీ యిష్టము డాక్టరుగారి యిష్టము. అమ్మా నాగూ! బావకు కొంచెము కాఫీఅయినా చేసి ఇవ్వు. పున్నమ్మా! నిలబడ్డావేమి? ఆ బల్లమీద కూర్చో.

డాక్ట:— మీరిక్కడే ఉండండి. ఆసుపత్రికి పోయి మందులు తీసుకొని వెంటనే వస్తాను.

అని చెప్పి మధుసూదనరావు ఆసుపత్రికిఁబోయెను. పున్నమ్మ జమీందారిణి ప్రమాదమును గురించి — నాయుఁడుతో ఏమేమో చెప్పుచుండెను. తల్లికూఁతులు లోపల కాఫీ ఉప్మాలు తయారుచేయుచుండిరి. ఒక యర గంటలో డాక్టరు కావలసిన మందులు—దూది—కట్టుగుడ్డలు —ఇతర

పరికరములు—తీసికొని మరలివచ్చెను. ప్రతినిధి అవన్నియుఁ దీసికొని పోయి బండిలోఁ బెట్టివచ్చెను.

మంగమ్మ అతిథులిద్దరికి కాఫీ ఉపాహారములు తెచ్చిపెట్టెను. నాగమణి తన భర్తకు ఉపాహారప్లేటు చేతికందిచ్చి — కాఫీ చల్లారఁబోయుచు — "మీరు రాత్రికి కోటలో ఉండవద్దు. ఎంత ప్రొద్దుపోయినాసరే – త్రోడుతీసుకొని – యింటికి తిరిగి రండి. నేను మీ కోసము భోజనము చేయకుండా కనిపెట్టుకొని ఉంటాను" అని అన్నది.

డాక్ట:— అలా అంటున్నా వెందుకు? అచ్చట భోజనముచేస్తే తప్పా ? ఇవన్నీ పెట్టుకొంటే నా వృత్తిసాగదు. రోగి ప్రమాదాన్నిబట్టి ఉండవలసివస్తే ఉంటాను. లేకపోతే తిరిగివస్తాను. ఈ మాత్రానికి నీవు నాకోసముకనిపెట్టుకొని యెందుకుండాలి? నీయిష్ట ప్రకారము వైద్యము చేస్తే చాలా బాగా పైకివస్తాను.

నాగ:— అది కాదండీ! రూపలతా దేవి ప్రవర్తన అంత మంచిది కాదు. ఆమె యెంతకైనా సాహసురాలు. అక్కడ మీరు రాత్రికివుంటే ఏమి పుట్టిమునుగుతుందో అని నా భయము.

డాక్ట:— ఏపుట్టి మునుగదు. ఎప్పుడుకూడా ఒకరినిగురించి నీచముగా అనుకోరాదు. అలా అనుకునే వాళ్ళందరూ నా దృష్టిలో పరమనీచులు. ఆమెకూ కులమున్నది. గౌరవమున్నది. వ్యక్తిత్వమూ ఉన్నది. నీ వొక్కదానివే మహాపతివ్రతవని అనుకోకు.

అని చిరాకుతో సంభాషణ ముగించి - కాఫీత్రాగి - డాక్టరు గదిలోకిబోయి — ఇస్త్రీ మడత చెడంగని తెల్లని దుస్తులు ధరించెను. కండ్లకు చలువఅద్దాలు పెట్టుకొనెను. అన్నివిధాల అపర పాశ్చాత్యునివలెం దయారై ఫెళ్ళుఫెళ్ళున బయటికి వచ్చెను. వెంటనే ఆ వచ్చినవారు - అతండు-కలిసి బండినెక్కి- బయలు దేఱిపోయిరి.

అప్పటికిం బ్రొద్దుగుంకి -చీకట్లు నలుగడల వ్యాపింప జొచ్చెను. అదిచూచి తన బ్రతుకునకింకం జీంకటియే కాని వెన్నెల వెలుంగు లేదన్నట్లు నాగమణి యెందుకో వెక్కి- వెక్కి- యేడువసాగెను. భార్యా భర్తలమధ్య జరిగిన సంభాషణ మెట్టిదో బోధపడక మంగమ్మ-ఆందోళన పడుచు-బిడ్డను ఓదార్పంజొచ్చెను. అల్లుని శీలమెట్టిదో తెలిసినవాండు గనుక మంగపతిరావు నాయుండు — ఆ మాయలమారి సినిమా సుందరి మూలాన తన బిడ్డ కాపురమున కేమి మూడునో యని అనుమానపడెను. ఆ ముప్పురకు నిట్టి యనుమానమున్నప్పటికి నొక్కరుగూడ నతనిని పోవద్దనలేకపోయిరి.

డాక్టరు కోటకుం జేరునప్పటికి రాత్రి యేడుగంటలైనది. బండినుండి ముందుగా పున్నమ్మ — ఆమె వెనుక డాక్టరు ఆయన వెనుక ప్రతినిధి — దిగి -సింహద్వారము దాటి - వారు ముప్పురు లోనికిం బోయిరి. ప్రతినిధి క్రింది యంతస్తులోనే యాగిపోయెను. పున్నమ్మ డాక్టరును వెంటం బెట్టుకొని - సరాసరి పైకింబోవు మెట్లమీదుగా మూడువ యంతస్తులోనికిం దీసుకొనిపోయి — జమీందారిణి యున్న

గదినిసమీపించి - తాను ముందుగా లోనికేగి - అంతలోనే బయటికివచ్చి - అతనిఁజూచి - లోపలికిఁ బోయి రోగినిఁ బరీక్షించుచుండవలసినదనీ ___ తా నిప్పుడే వచ్చెదననీ ___ చెప్పి క్రిందికి దిగిపోయెను. డాక్టరు దగ్గరను వేసియున్న తలుపులఁ దెఱచి ___ మెల్లగా లోనికిఁ బోయి___ నలుమూలల పరికించెను.

అదియొక విశాలమైన గది. మనోహరముగాఁ జిత్ర విచిత్రములైన వస్తువులతో నలంకరింపఁబడి యు న్న ది. చల్లనిగాలి ధారాళముగా వచ్చుచున్నది. దేదీప్యమానముగా గాజుదీపములు వెలుగుచున్నవి. అగరువత్తుల కమ్మనిపొగలు గుమాయించుచున్నవి. రకరకాల కుసుమకుమారికలు___ తియ్యని వలపు లెగఁజిమ్ముచు - నిలువు టద్దాలనీడలలో మలయసమీర కుమారులతోఁ గలిసి సయ్యాటలాడుచున్నవి.

ఆ సుందర మందిరమునం దొకమూల - గవాక్షము దాపున -మెత్తని పట్టుపరుపు పఱచిన యొక శయ్యమీఁద- ఎడమచెంపను మోయుచున్న హస్తము తలగడను నొక్కుచుండ - రూపలతాదేవి - అదొకవిధమైన యొయ్యార ముతో - నరమోడ్పు గన్నులతో - పాదములు మెలవైచి-పక్కవాటుగాఁ బండుకొనియున్నది. ఆ దీపకాంతిలో ___ ఆమె నవనాగరక సౌందర్యము - ఆకర్షణీయముగ మెఱసి పోవుచున్నది.

నున్నని చెలువములు కుప్పలువోయు మె త్త ని మెఱుఁగుపూతలతో ___ నిగనిగలాడుచున్న యౌ|జవని

సుందరముఖాబ్జముపై ముద్దులుగురియు ముంగురులు చిరుగాలికిఁ దూఁగాడుచున్నవి. కంచుకబంధములఁ ద్రెచ్చుకొని బయటపడ సుంకించుచున్న వక్షోజముల మీఁదుగాఁ గ్రిందికి వ్రేలాడుచున్న యా వేణీ బంధము – ఆమె సౌందర్యలక్ష్మికి వింతసొగసులు దిద్దుచున్నది. ఆమె వేషము —— ఆకారము —— అప్పటితీరు ——సినీమాలో దిద్దితీర్చిన యొక పచ్చిశృంగార నాయికను స్మృతికిఁ దెచ్చుచున్నవి. డాక్టరు దృష్టికి —— ఆ యువతి —— దివినుండి యవతరించిన యొక యప్సరోభామిని.

ఆమె బండి ప్రమాదమువలన గాయపడిన దానివలె లేదు. అట్టి లక్షణములు – ఒకకట్టుగాని – బాధపడుట గాని – మరెవ్వియు లేవు. ఈచిత్ర కథ యేమాయని డాక్టరు కొంచెముదూరములో నిలఁబడి యాలోచించుచుండ – రూపలత మెల్లన లేచి కూర్చుండి —— అతనిఁజూచుచు "డాక్టరు గారూ! ఆలా నిలఁబడి యేమాలోచిస్తున్నారు? ఇటువచ్చి కూర్చోండి!" అని తన శయ్యదాపుననున్న కుర్చీని చూపించెను. అతఁడేమియు మారుమాటాడక పోయి అందుఁ గూర్చుండెను.

తరువాత రూపలతాదేవియే సంభాషణ కుపక్రమించెను.

రూప : ఏమిటండీ ఆలోచిస్తున్నారు! నన్ను చూచి భ్రమపడ లేదుకదా?

డాక్టరు : అది కాదండీ! తమరు బండి ప్రమాదము నుండి గాయపడినారని పున్నమ్మ చెప్పింది. అట్టి లక్షణాలు ఏమీ లేకపోవుటచేత ఆలోచిస్తున్నాను.

రూప : మా పున్నమ్మ ఆలోచించరలో పొరపడినది. నేను గాయపడిన మాట వాస్తవమేగాని బండిప్రమాదమువల్ల మాత్రము కాదు. మాతోటలో విహరించుచుండగా మా చిన్నమ్మకొడుకు మదనమోహనరావు – అనామాక్షీగా వదలిన పువ్వుటమ్ము నాగుండెలో వచ్చి గ్రుచ్చుకొన్నది. దానివల్ల నేను చాలా బాధ పడుచున్నాను.

డాక్టరు : ఏమైనా గాయమైనదా? గుండెలో గ్రుచ్చుకుంటే చాలకష్టమే.

రూప : అవును. ఆసంగతి తెలిసే మిమ్ము రప్పించాను. మరి పరీక్షిస్తారా? అలాచూస్తారేమి? పరీక్షించుటకు భయ పడుతున్నారా? ఈలాటి పరీక్షలు మీచేతి మీదుగా ఇదివరకెన్ని జరిగినవో? ఇంకెన్ని జరుగనున్నవో? మా బోటి యువతుల హృద్రోగములను బోగొట్టుటలో మీరు అందెవేసిన చెయ్యనివిన్నాను.

డాక్టరు : పున్నమ్మను రానీయండి పరీక్షిస్తాను.

రూప : పరీక్షించటానికి పున్నమ్మ యెందుకు? మీరు పరీక్షించేది రోగిని కదా?

డాక్టరు : అవును. కాని మీరు...

రూప : స్త్రీ అని శంకిస్తున్నారా? మీ కిది క్రొత్త కాదు గదా? నాయుడుపేటలోని పల్లెపడుచులను చాలా మందిని

పరీక్షించినారటగా? నాదగ్గఱ అనుమాన మెందుకు!
ఈలాంటి అనుమానాలు పెట్టుకుంటే మీా వృత్తి
సాగుతుందా?

డాక్ట : పరికరములన్నీ క్రిందఉన్నవి. పోయి పైకి తెస్తాను.

రూప : పరికరాల కేమిలే. చేతితో ముందుపరీక్షించి చూడండి.
తరువాత కావలసిన సాధనసంపత్తి అంతా పైకి వస్తుంది.

అని రూపలత పరపురుషుడన్న బిడియ మెంతమాత్ర
మును లేక — స్వేచ్ఛగా మాట్లాడి — అదొాకవిధమైన
మాపుతో నతనివంకఁ జూచినది. దానితో డాక్టరు ముగ్ధుఁడై
పోయినాఁడు. అతనికిఁ దెలియ కుండఁగనే మెయి పులక
ించినది. రక్తాభిసరణము హెచ్చినది. సహజముగా మనో
నిగ్రహము లేనివాఁడు గనుక అతఁ డుద్రేక పూరితుఁడై
నాఁడు. అతని ముఖములో వికారములు పొడసూపినవి.

రూపలత అతని యుద్రేకమును- ముఖవికారములను-
గమనించి - పెదవులపై మొలగనగవు తొాలుకాడ - మరల
సంభాషణ సాగించినది.

రూప : నీ యుద్రేక స్వభావము నాకు నీ విద్యార్థి దశనుండీ
తెలుసు. నీవు మద్రాసులో కాలేజిలో చదువుతూ
ఉన్నప్పుడు ఒక యువతి కూడా ఆ కాలేజిలోనే చదువుతూ
ఉండేది. ఆమెను నీవు గాఢముగా ప్రేమించావు. ఆమె
గూడా నిన్ను ప్రేమించింది. మీారిద్దఱూ ఒకనాటి
సాయంకాలము బీచీకి వెళ్ళారు. అచ్చట ఆమె ఇసుకలో
నడువలేక పోతే నీవు నీచేతిని ఆమె నడుము చుట్టూ

చుట్టి తిన్నగా నడిపించావు. తరువాత మీరిద్దరూ తిరిగి వచ్చునప్పుడు ఆమె తన మణిపర్సును కూర్చున్నచోటనే మఱచిరాగా దాని కొఱకు నీవు తిరిగి ఆ చోటికి వెళ్ళావు. కాని నీవు మరలి వచ్చేసరికి ఆమె నీకు కన్పడకుండా మాయమైపోయింది. నీవామె కొఱకు ఎంతో వెదకి యుంటావు. ఆనాటితోనే ఆమె చదువు ముగిసి పోవుట చేత నీ కెక్కడా కనిపించ లేదు. నీకా కథ గుర్తున్నదా మధూ!

మధు: గుర్తున్నది. ఆమె నేను ప్రేమించిన రూప - ఆరాధించిన రూప. నాకింత వఱకూ ఆమె యేమైనదీ తెలియదు.

రూప: ఇప్పటికీ తెలీదా?

మధు: లేదు. ఆమె యెచ్చట ఉన్నదో?

రూప: నీ యెదుటనే ఉన్నది. నీతోడనే మాట్లాడుచున్నది. పల్లెటూరి పడుచుల సహవాసముచే నీవామెను గుర్తింప లేకున్నావు. నీవు కన్నులున్న గ్రుడ్డివాడవు. చదువుకొన్న మతిహీనుడవు. కాకపోతే నన్నెందుకు గుర్తింప లేవు.

మధు: ఆఁ! నీవు రూపవా? నా ప్రణయ రాశివా? రూపా! రూపా! నిజము చెప్పు.

రూప: అవును మధూ! నేను రూపనే.

మధు:-అప్పుడు నీకింత తలకట్టు లేదే? ఈ యందమైన బారు తలకట్టువల్లనే నిన్ను గుర్తింప లేకపోయాను రూపా! అయితే నాచరిత నీకెలా తెలిసింది?

రూప:-మంగపతి నాయుడుతో నీవు నీపుట్టు పూర్వోత్తరాలు చెప్పుతూ వుండగా మాకాపలాదారు విని పున్నమ్మతో చెప్పాడట. ఆమె నాకు చెప్పింది.

మధు:-ఇదంతా నా పెండ్లికి పూర్వమేకదా? అప్పుడెందు కూరకున్నావు?

రూప:-పీటలమీది పెండ్లి చెడగొట్టుట మంచిపని కాదు. అదీ గాక అప్పుడే నీకిదంతా చెప్పితే పెండ్లే చేసుకోవు. నాదగ్గఱనే ఉండిపోతావు. అందువల్ల నా కెంతో అప్రతిష్ఠ కలుగుతుంది. తెరచాటున ఏ స్లేడ్స్నా పైకి మాత్రము సంఘ సంప్రదాయములకు కట్టుబడినట్లు ఉండాలి. అందుకనే ఊరుకున్నాను.

మధు:-మంచిపని చేశావు రూపా! మఱి నీభర్త యేమైనాడు?

రూప:-భర్త అని అనకు మధూ! ఆ వివాహమే నాకిష్టము లేనప్పుడు ఆయన నాకెట్లు భర్త అవుతాడు? తాళిగట్టినంత మాత్రాన ఇష్టముగాని పురుషుని ఎట్లా ఆరాధిస్తాను? నామనస్సును నేనెలా వంచించుకొంటాను? ఇందుకు తగినట్లుగా అతడు పిచ్చివాడై దేశదిమ్మరి యైనాడు. అప్పటినుంచీ కష్టాలపాలైంది. ఆ కష్టాలన్నీ మఱచి పోవటానికని — ఒక సినీమా కంపెనీ ప్రారంభించి-సర్దాగా వేషాలువేస్తూ - కాలక్షేపం చేస్తున్నాను.

నీ పెండ్లి అయినాక కూడా వెంటనే పిలిపించటానికి సందేహించాను. ఇంతలో నీభార్యకు జబ్బు చేసింది. ఆమెకు బాగా స్వస్థత చిక్కేవఱకూ వేచిఉన్నాను. ఇప్పటికి సరి

గ్యైన వీలుచిక్కింది. కనుక బయటపడ్డాను. మధూ! నా ప్రయాణాలన్నీ మానుకొని - ఇంత కాలమునుండీ యిక్కడ కదలకుండా ఉన్నది నీకోసమే.

అని రూపలతాదేవి తన గాథను పూర్తిగా వినిపించు సరికి మధుసూదనరావు మనసంతయు మారిపోయినది. అతఁడు తన గృహస్థ ధర్మమును పాటింపలేదు. తన భార్యను మోసగించుచునట్లు తలంపలేదు. తన ప్రవర్తనము సంఘ దూష్యమగునని గ్యైనను శంకింపలేదు. ధర్మాతిక్రమణమున కతని హృదయము జంకలేదు. అతఁడిప్పుడు కామాంధుఁడు. పట్టరాని తమకముతో —ముందు వెనుకలు చూడకుండ —క్షణిక సుఖమున కాసించి రూపలతను తన బాహు పంజరములో బంధించినాఁడు. ఇఁక జెప్పునదేమున్నది? అతఁడారాత్రికిఁ గోటలోనే యుండిపోయినాఁడు.

పాపము! ఇంటివద్ద నాగమణి - భర్తకోసము చాల ప్రొద్దుపోవు వఱకు గనిపెట్టుకొని యుండి - చివరకు రాఁడని నిరాశ చేసికొని - భోజనము గూడ మాని - మేను వాల్చినది. ఆమె పక్కదుప్పటి యెడతెగని కన్నీటితోఁ దడిసిపోయినదని వేఱుగాఁ జెప్పనేల? ఆమె విషాదనాటకమునకు నాందిగ్యైనది.

మఱునాఁడు గూడ మధుసూదనరావు తిరిగిరాలేదు. రోగికి జాల ప్రమాదముగా నున్నదనీ — తానచ్చటనుండి రెండు రోజులవఱకుఁ గదలుటకు వీలులేదనీ — యతఁడు కబురు మాత్రము పంపినాఁడు. దానితో [illegible]

వునఁ గూలిపోయినది. వద్దన్నకొద్ది ఆనాఁడు తాను కోటకుఁ బోయినందుకు ఫలముగాఁ దన పరిణయగాథ మారిపోయినదనీ — ఈనాఁడు తన భర్త యరిగినందువల్ల దన జీవిత సుఖలేశము గూడ సంతరింపనున్నదనీ — పెద్దపెట్టున వాపోయినది. ఇఁక మంగమ్మ — మంగపతి — యేమి చేయుటకుఁ దోచక — యేమనుటకు నోరురాక — బిడ్డదుఃఖమును జూడలేక కోరికోరి రాజయ్యనుగాదని — ఈ యల్లునిఁ దెచ్చుకొన్నందుకుఁ దనకుఁ జెప్పుతోఁ గొట్టినట్లు — తగిన శాస్తి జరిగినదనీ — జరుగుచున్నదనీ — జరుగనున్నదనీ-లోలోపల కాలకుమిలిపోయిరి. బిడ్డను ఏమని యోదార్చవలెనో వారికి బోధపడలేదు. తానొకటి తలచిన దైవమొకటి తలంచు నన్న సామెత వారిపట్ల సార్థకమైనది.

## ౧౬

మూఁడు రోజులు గడచినవి. నాలుగవరోజు — ఉదయము — తొమ్మిది గంటలగుసరికి — ఒకగుఱ్ఱపు బండి మీఁద — జస్టిసు కోటనుండి మరలి యింటికి వచ్చినాఁడు. బండి మాత్రము వాఁకటనే నిలచియున్నది.

అతఁడు సరాసరి గదిలోనికిఁ బోయి టోపీ మాత్రము బల్లమీఁద పెట్టినాఁడు. దుస్తులు విప్పలేదు. ఎవ్వరిని పలుకరింపలేదు. ఈమూఁడు రోజులనుండి యెంతో దిగులుతో — అన్నముగూడఁ దినక — తన రాకకై నిరీక్షించుచున్న భార్యతోనైన ఒక్క మంచి మాటమాటాడలేదు. ఎదురుగా

ద్వారము చెంత నిలఁబడియున్న యిల్లాలిని చూచీచూడనట్లు తప్పుకొని - కాలుగాలిన పిల్లివలె నచ్చట గడియసేపైనను నిలువక - సరాసరి బయటికివచ్చి ఆసుపత్రికివెళ్ళెను. అల్లుని క్రొత్తతీరునకు మంగపతిరావు నాయుడు చకితుడయ్యెను. నాగమణి భరింపరాని దుఃఖముతో క్రుంగిపోయెను. తన బిడ్డ సంసారమున కేదో ముప్పు వాటిల్లనున్నదని మంగమ్మ లోలోపలఁ గుమిలిపోయెను.

ఆసుపత్రికి వెళ్ళిన మధుసూదనరావు - ఏవో కొన్ని మందులు తీసుకొని ఒక గంట లోపలనే మరలివచ్చి — గదిలో మందులు సర్దుకొనుచుండెను. నాగమణి కన్నీరు కార్చుచు గదివాకిట నిలబడియేయున్నది. నాయుడు బిడ్డ దుఃఖమును జూడలేక - మనసు పట్టలేక - లోనికిఁబోయి- అల్లుని కెదురుగా నిలఁబడి - "నాయనా! మధూ! అంత తొందరపడుచున్నా వెందులకు? అమ్మగారి కెట్లున్న దేమి?" అని ప్రశ్నింప నతఁడు మామగారివంకఁ గన్నెత్తియైనఁ జూడక- " ఏమంత బాగాలేదు. జ్వరము తీవ్రముగా వస్తున్నది. వదలి రావలసిన రోగి కాదు" అని ముక్తసరిగా సమాధానము చెప్పెను.

నాయు:అయితే మళ్ళీ వెళ్ళవలెనా యేమి?

డాక్ట:- అవును. ఇప్పుడే వెళ్ళవలెను. బండి వాకిటనే ఉన్నది కదా?

నాయు:అంత తొందరేమి? మూడురోజులనుండి అక్కడనే ఉన్నావుగా? మందులిచ్చి పంప గూడదూ? ఇల్లూ—

వాకిలీ - సంసారమూ - మఱచిపోతే యెట్లా నాయనా? నీకోసము బెంగపెట్టుకొని నాగు - మూడుగోజులనుండి అన్నమైనా ముట్టుటలేదు. ఏదో దాని దిగులు తీర్చి మరీపో. ఈ వార్ధక్యములో నామనసు కష్టపెట్టకు మధూ!

డాక్ట:-సంగతి సందర్భాలు తెలుసుకోకుండ అనవసరముగా మాట్లాడకండి. వ్యాధి తీవ్రతను బట్టి ఉండవలసివస్తే మూడుగోజులేమిటి? ఎన్నిరోజులైనా ఉండాలి. అది మా వృత్తిధర్మము. ఈ మాత్రానికి దిగులెందుకు ? ఏడుపెందుకు ? మళ్ళీ రానా యేమి ? అదిగాక మీ అమ్మాయి దిగులూ - మీ దిగులూ - తీర్చటానికి ఆ సన్యాసి ఉన్నాడుగా? ఆయన మీ పాలిటికి గురుదేవుడు. నాకంటె మీకు మఱీ ముఖ్యుడు. కావలసిన వాడు. దగ్గఱ చుట్టము. ఆయనతోనే ఊరేగండి. నేనుంటే యేమి? లేకుంటేయేమి?

అని మనసు నొచ్చునట్లుగా మాట్లాడి - గదినుండి యీవలకువచ్చి - మధుసూదనరావు భార్య యడ్డగించు చున్నను, లెక్కచేయక - ఆమె కన్నీటివదనమును జూచి నైన జాలిపడక - అన్నమైనఁ దినిపొమ్మని అత్తమామలు బ్రతిమలాడి నప్పటికి సరకుచేయక - వీధివాకిలిదాటి-బండి నెక్కి కోటకు తరలిపోయెను.

అల్లుని వర్తనములో - మాటలధోరణిలో -ప్రకటిత మగుచున్న వైపరీత్యమునకు నాయుఁడు దంపతులేమియుఁ దోచక దిగాలు పడిరి. అతఁడు మ్రాయలమారి రూపలతా

దేవి వలలో పడినాఁడనీ - ప్రపంచమునే సన్యసించి యస్ఖలిత బ్రహ్మచర్యమును నడపుచున్న రాజయ్య శీలమును గూర్చి శంకించుచున్నాఁడనీ- అది యంతయు నా సినీమాసుందరి దుర్బోధయేయనీ- ఇఁక తమ బిడ్డ కాపురము కూలిపోయినట్లే యనీ -వారు నిశ్చయించుకొని చేతులారఁ జేసుకొన్నదానికి విచారపడఁ జొచ్చిరి. చిట్టచివర - భర్త పలికిన పలుకులకు మనసు గాయపడి - నాగమణి - దృగ్గోచరముగాని బాధకు గురియై - పుక్కిలింతలగుచున్న దుఃఖముతో జీవితముపైఁ విరక్తినొందెను.

నాఁటి సాయంకాలము - నాలుగు గంటలకు -మంగపతిరావునాయుడు దైన్యమును - దుఃఖమును - రాశిపోయుచున్న కుమార్తెను ఓదార్పఁజాలక - ఆమెను జూచుచు గృహములో నుండలేక — చిత్తశాంతిఁగోరి బయటికిఁ బోయెను. అతఁడు తిన్నగా భాషామందిరమున కేగి —— యోగినీ మాతతోఁ దనబిడ్డస్థితినిఁ గూర్చి ఒకయరగంటసేపు ముచ్చటించెను. నాగమణికిఁ [illegible]పదను తెలిసికొని జానకి చాల విచారపడెను.

అటనుండి కదలి నాయుడు నాగులదిబ్బవంకఁబోయెను. ఆనాఁడు- నాగరాజు- తమకెదురుగావచ్చి పడగ-నేలమీఁద ముమ్మారు గొట్టిన చోటును జూడఁగనే సుబ్రహ్మణ్యస్వామి ఆ పెండ్లివిషయమై తన యసమ్మతిని ఆ రూపమున వెల్లడించినాఁడనీ - తనీ మౌర్ఖ్యమే యింతటి యనర్థకమునకుఁ గారణమనీ - అతఁడిప్పటికి గ్రహింపఁగల్గెను. వెంటనే

యతఁడు సుబ్రహ్మణ్యస్వామిగుడికిఁ బోయి - క్షమాపణ గోరుచు నా దేవునిఁ బెక్కుగతులఁ బ్రార్థించెను.

అప్పటికి అయదు గంటలయినది. రవి యస్తగిరికిఁ జేరుచుండెను. కడుపార పచ్చిమేతలు మేసి బరువులెక్కిన పాలపొదుగులతో గోగణములు కొండలనుండి మరలి వచ్చుచుండెను. పంటపొలముల కేగిన పల్లెపడుచులు- గడ్డిమోటల బరువుతో సన్నని లేనడుములసియాడ - ఎలప్రాయం పుఁగులుకులు తొలుకాడ - మందగమనములతో నడచెంచుచుండిరి. ఆసాయం సమయ లక్ష్మికి - నాయుడుపేట జానపదులు - పెక్కుదెఱఁగుల స్వాగతములు చెప్పుచుండిరి.

ఆ మనోహరదృశ్యములను దిలకించుచు - మంగపతిరావు నాయుఁడు - నాగులదిబ్బదాటి - తిన్నగా ఆసుపత్రికిఁ బోయెను. అచ్చట నెవ్వరును లేరు. తలుపు లన్నియు మూసియున్నవి. మధుసూదనరావు శీలమును గుఱించి దుర్వార్తలు బయలు దేఱినది మొదలు - పొరుగుపల్లెలనుండి రోగులెవ్వరు వచ్చుటలేదు. అతనివృత్తి చాలపఱకు దెబ్బతిన్నది. ఆసుపత్రి పాడుగొట్లాడు చుండెను.

కాపలాదారు - రంగడు మాత్రము - నాయుఁడుగారు వచ్చుటను జూచి ఒక మంచమునుదెచ్చి - ముందు వరాండాలోవైచెను. మంగపతి మంచములోఁ గూలబడెను. రంగడు చేతులు గట్టుకొని నిలఁబడియుండెను. కొంచెము సేపటికి నాయుడు చుట్టముట్టించుకొని - రంగనిఁ గూర్చుండుమని - అతనితో సంభాషణ నుపక్రమించెను.

నాయు: కోటలోని విశేషము లేమి రంగడూ?

రంగ : ఏమున్నవి బాబూ! అమ్మగారు ఒక యేడాది పాటు ఇక్కడనే ఉంటుందట!

నాయు: అమ్మగారు కులాసాగా ఉన్నారా?

రంగ : ఆ! కులాసాగానే ఉన్నారు.

నాయు:అమ్మగారిని సీ వెప్పుడు చూచినావు?

రంగ : ఈరోజు ప్రొద్దుననే. డాక్టరుబాబును బండియెక్కించి పంపుతూంటే చూచాను.

నాయు:అమ్మగారికి తగిలిన గాయాలు నయమైనవా? జ్వరము తీవ్రముగా వస్తున్నదటకదూ?

రంగ : గాయాలెవరికి? జ్వరమెవరికి బాబూ! మీ రెవరిని గురించి మాట్లాడుతున్నారో నాకు తెలియుట లేదు.

నాయు:అదికాదు రంగడూ! నాలుగురోజులుక్రిందట బండి బోల్తాపడి – అమ్మగారికి గాయాలు తగిలినవనీ – చాల ప్రమాదముగా ఉన్నదనీ – పున్నమ్మ వచ్చి చెప్పి – డాక్టరుబాబును దీసుకపోయినది. కడచిన మూడురోజుల నుండీ మాఅల్లుడు అక్కడనే ఉన్నాడు. ఈరోజు ఉదయమున వచ్చి – ఏవో మందులు తీసుకొని – జ్వరము తీవ్రముగా ఉన్నదనీ రోగిని వదలి వచ్చుటకు వీలు లేదని చెప్పి యీ బండిమీదనే తిరిగి కోటకు వెళ్ళినాడు. ఇదంతా యేమిటి రంగడూ! నిజముగా మీ అమ్మగారు కులాసాగానే ఉన్నదంటావా?

రంగ : నిజము బాబూ! నిజము. మా అమ్మగారికి గాయమూలూ లేవు - జ్వరమూ లేదు. పున్నమ్మ చెప్పినదంతా పచ్చి అబద్ధము. ఎందుకట్లా చెప్పిందో నాకు తెలియదు.

రంగని మాటలు మంగపతికి దిగ్భ్రమ గలిగించినవి. అతని కేమియుఁ దోచ లేదు. ఏజబ్బు లేనప్పుడు మధుసూదన రావు కోటకుఁ బోవలసిన యవసర మేమి? అచ్చట నుండ వలసిన పనియేమి? ఈ కపట నాటకములోని యంతరార్థ మేమి? డాక్టరు నిజముగా రూపలతా దేవికి వశ్యుఁడైనాఁడా? కులీనయయ్యు నామె యిట్టి దుర్వర్తనమున కొడిగట్టినదా? ఇట్టి యాలోచనలతో నాయుడు తల తిరిగిపోయినది. తమ యనుమానము రూఢియైనట్లతఁడు గట్టిగా నమ్మెను. అట్టి నమ్మకముతో నతఁడు మరల సంభాషణ సాగించెను.

నాయు: నీ మాటలు నిజమని నమ్మవచ్చునా రంగడూ?

రంగ : అనుమాన మెందుకు బాబూ! నేను చెప్పినదంతా నిజమే. ఆ పాడు పున్నమ్మ మాదిరి అబద్ధాలు చెప్పను. మిమ్మల్ని మోసగిస్తే నాకేమి ఒరుగుతుంది బాబూ!

నాయు: వాడు పున్నమ్మ అన్నావే? ఆమె మంచిది కాదా యేమి?

రంగ : మీవంటి గొప్పవారితో అనరాదుకాని యేపుండు పుట్టినా గొప్పవారిలోనే పుట్టుతుంది. వారిని ఎవ్వరూ అనలేరు. పున్నమ్మ బుద్ధిమంచిది కాదు. అంతకంటే మా అమ్మగారి బుద్ధికూడా. అయినా వారికేమి? కావలసినంత డబ్బుఉంది. ఏపని చేసినప్పటికీ చెల్లుతుంది. కోటలో

జరిగేపనులు తలచుకొంటే గుండెపగిలి పోతుంది బాబూ! ఏదో తరతరాలనుంచీ చేస్తున్నపని గనుక వదలలేకుండా ఉన్నానుగాని యీ అమ్మగారి కొలువంటే నాకెంతో అసహ్యమని పిస్తున్నది. వెనుకటి గౌరవమంతా చెడి పోయింది బాబూ!

మంగపతిరావు నాయుడు రంగని మాటలలోనున్న యాదార్థ్యమును గుర్తించి యతనితో మరెట్టి ప్రస్తావన చేయలేదు. తనలోదానే యేమేమో తలపోయుచుఁ గొంచెముసేపటికి మంచమునుండి లేచి "రంగడూ! పోయి వస్తాను. మనసంభాషణ మాత్రము ఎవ్వరికీ చెప్ప" వద్దని హెచ్చరించి - తిన్నగా ఇంటిత్రోవ పట్టెను. ఎడతెగని యాలోచనలతో - అనుమానాలతో - అతనితల దిమ్మెక్కెను. తన బిడ్డగతి యేమాయని వెచ్చనూర్చుచు రాత్రి యేడు గంటలగుసరికి అతఁడిల్లుచేరెను.

ఆ రాత్రికి డాక్టరు కోటనుండి తిరిగిరాలేదు. నాగమణి దుఃఖమునకు మేరయేలేదు. తల్లి బలవంతముమీఁద నాపగటి పూట యేమితిన్నదో కాని రాత్రి ఆమె భుజింపలేదు. రంగడు తనతోఁ జెప్పిన సంగతులు తల్లి గూఁతులకుఁ జెప్పక నాయుఁడు తనలోనే జీర్ణించుకొనెను. అసలు సంగతి తెలిసిన నాగమణి మఱింత బావురుమనునని యతని భయము. ఆరేయి చాల ప్రొద్దుపోవువఱకు బిడ్డతోపాటు అతఁడుగూడ నిద్రపోలేదు. ఈదుస్థితికంతకూ దానేగదా మూలకారణమని మంగమ్మ లోలోపలఁ జాల బాధపడెను.

ఆ రేయి యెట్లో తెల్లవారినది. ఉదయము రెండు మూడు గడియలు ప్రొద్దెక్కినప్పటికిఁ బెద్దిరెడ్డి వారియింటికిఁ వచ్చెను. ఈ నాలుగైదురోజులనుండి అతఁడు గురుదేవు నొద్దనే యుండుటచేత నతనికీసంగతు లెవ్వియుఁ దెలియవు. అతనిని జూడఁగనే మంగపతి ఆడుదానివలె బావురుమని యేడ్చెను. మంగమ్మ గొల్లుమనెను. నాగమణి హాలులో నొకమూల —— నేలమీఁదఁ బండుకొని వెక్కి వెక్కి యేడ్చు చుండెను. అసలు సంగతి యేమిటో బోధపడక పెద్దిరెడ్డి నిర్ఘాంతపోయి చూచుచుండెను.

కొంతసేపటికి మంగపతిరావునాయుడు తెప్పరిల్లుకొని "నాయనా! పెద్దిరెడ్డీ! నీ గురుదేవునకు అన్యాయము చేసి నందుకు మాకన్ని విధాలా నష్టాలూ- కష్టాలూ- ప్రాప్తించి నవి. చివరకు నాబిడ్డ జీవితమంతా దుఃఖమయమైపోయినది. ఆమె యేడుపు చూడఁజాలక - మా మనస్సులు చెఱువు లగుచున్నవి. ఆ మాయలమారి జమీందారిణి వలలోఁ జిక్కి —— మధుసూదనరావు కోటవిడిచి వచ్చుటలేదు. నిన్న —— వచ్చినట్లే వచ్చి —— వెంటనే వెళ్ళినాఁడు. అతని ప్రవర్తన మంతా మారిపోయినది. సూదిమాదిరిగా వచ్చి దబ్బనమై చురకత్తిగా మారిపోయినాడు. నాగమ్మ సంసారము నట్టేట గలిసినట్లే. ఇప్పుడేమనుకుంటే యేము న్నది? ఇదంతా చేతులార చేసుకొన్నకర్మ" అని కన్నీరు పెట్టుకొనెను. డాక్టరు వర్తనమంతయుఁ దెలిసికొని పెద్దిరెడ్డి విస్తుపోయెను.

అప్పుడు నాగమణి — ఒకవిధమైన విరక్తితో ఏడుపుమాని లేచి కూర్చుండి—నిశ్చలదృష్టితో పెద్దిరెడ్డివంక జూచుచు—"పెద్దిరెడ్డీ! నేనుగూడ నీతోబాటు గురుదేవు నొద్దకు వచ్చెదను. నన్ను తీసుకొనిపో. కుళ్ళుకంపు గొట్టు చున్న యీ యింటిలో నేనుండలేను. నా పాడు జీవితాని కింక సుఖములేదు. నాపాపఫలాన్ని — ఎప్పుడో చచ్చిన తరువాత గాక — బ్రతికి ఉండగనే అనుభవిస్తున్నాను." అని మనసు నీరగునట్లు పలికెను.

పెద్ది:- ఇంత విరక్తియెందుకమ్మా! ఇటువంటి మాటలు మాట్లాడకు, ఈ వేళ గురుదేవునొద్దకు నీరాక అంత మంచిదికాదు. నీ భర్తకు గురుదేవుడంటేనే సరిపడదు. ఆయన అనుజ్ఞలేకుండా నీవు వస్తే మరింత కోపకారణ మవుతుంది.

నాగ:- కానీ ఇంతకంటే జరిగేదిమాత్రము ఏముంది? గురు దేవునివద్దకు వెళ్ళటానికి ఒకరి యనుజ్ఞయెందుకు? ఆపాటి స్వాతంత్ర్యము నాకు లేదా? ఇదేమీ చేయరానిపని కాదు. ఏమంటావునాన్నా?

నాయు:నీ భర్తసంగతి నీకంటే నా కెక్కువ తెలుసునా తల్లీ! నన్నేమీ అడుగకు. పాడుసలహాలు చెప్పిచెప్పి—చేయ రాని దుర్బోధలు చేసిచేసి—నీమనసు విఱిచి —యింత వరకు తెచ్చినది చాలు. నేనేమీ చెప్పలేను, మంచి చెడ్డలు నీకునీవే ఆలోచించుకో!

నాగ : అయితే తప్పక వస్తాను. పెద్దిరెడ్డీ! అమ్మా! గురు దేవునకు పాలూ – పండ్లు సిద్ధముచెయ్యి, అన్నిటికీ భగవంతుడే ఉన్నాడు.

అనిపలికి నాగమణి ఒకవిధమైన ఉల్లాసముతో లేచి-స్నానాదికములు ముగించుకొని – ఒక గంటలోఁ బ్రయాణమునకుఁ సిద్ధపడినది. ఆమెపోక అల్లునకు కోపకారణమగు నన్న భయము మంగపతికి లేకపోలేదు. కాని యేమనుటకు నతనికి నోరురాలేదు. అదిగాక పరమ పవిత్రుఁడైన గురు దేవుని సందర్శనమునలన నామెకొంత మనశ్శాంతిచేకూఱు నేమో యనికూడ నతఁడు మిన్నకుండెను. మంగమ్మ సిద్ధ పఱచిన పాలు – పండ్లు తీసుకొని పెద్దిరెడ్డి ముందు బయలు దేఱెను. నాగమణి యతని ననుసరించెను. నాయుడు వారిని గొంతవఱకు సాగనంపి వచ్చెను. వారిద్దఱు జాము ప్రొద్దెక్కు నప్పటికి గురుదేవు నాశ్రమమును జేరుకొనిరి.

తలవనితలంపుగా నా గ మ ణి యచ్చటికి వచ్చుట గురుదేవునకుఁ జాల యాశ్చర్యముఁ గలిగించెను. అతఁ డామెను జూచి "ఇట్లు వచ్చితివేమి నాగూ!" అని పవిత్ర హృదయముతోఁ బ్రశ్నించెను. నాగమణి అవనతముఖియై-కన్నీరు బొటబొట గార్చుచుఁ – కొంచెము సేపటివఱకు మాటాడలేక – యెట్టకేలకు మనసు నిబ్బరించుకొని – పొరలి పొరలి వచ్చుచున్న దుఃఖము నాపుకొని "నాతప్పు క్షమించు గురుదేవా!" అని యతని పాదములచెంత మోకరిలఁబడెను.

గురు : అందఱి తప్పులూ క్షమించువాడు భగవంతు డొక్కడే, మనము ఆయన చేతి కీలుబొమ్మలము. క్షమించే అధికారము మనకు లేదు.

నాగ : అట్లా కాదు గురుదేవా! నేను నీయెడ మహాపరాధము చేసినాను. నిన్ను ప్రేమించి–నమ్మించి– మోసగించినాను. నీ జీవితసుఖాన్ని చెడగొట్టినాను. నా మూలాన నీవు సన్యాసివై నావు. నావంటి పాపాత్మురాలు మఱొచ్చటనూ లేదు. నా ప్రేమ మలినమైనది. నా బ్రతుకు తుచ్ఛమైనది. నా కంటె జానకి యెన్నోరెట్లు పవిత్రురాలు. ఆమె ప్రేమ నిష్కళంకమైనది. నిశ్చలమైనది. ఆమెకున్న జ్ఞానము నాకు లేదు. ఆమెతో పోల్చిన నేనెందుకూ కొఱగాని ఒక నీచురాలను. నా పాప ఫలాన్ని నేనిప్పుడే అనుభవిస్తున్నాను.

నా తల్లిదండ్రులను సంతోషపెట్టాలని వారు చెప్పిన వన్నీ విన్నాను. నీ మీఁది మనసు మార్చుకోమంటే–మార్చుకొన్నాను. నిన్ను చూడవద్దంటే – నీతో మాట్లాడ వద్దంటే–సరేయని మానుకొన్నాను. ఇష్టములేక పోయినప్పటికీ – ప్రేమించి మఱొక పురుషుని పెండ్లాడాను. అయితేయేమి? ఇందువల్ల నా తల్లిదండ్రులు సుఖపడ్డది లేదు. నాకంటే వారే యెంతో దుఃఖపడుతున్నారు. ఎవ్వరినీ సంతోషపెట్టలేని నా జన్మ యెందుకు? ఈ నికృష్టపు బ్రదుకుకంటె మరణమే మేలనిపిస్తున్నది.

గురుదేవా! నామనస్సుకు శాంతిలేదు. నా జీవితానికి సుఖములేదు. నా భర్త నన్ను ప్రేమించుటలేదు. ఇల్లు నా పాలిటికి నరకమైపోయినది. ఏడ్చియేడ్చి నా కన్నులు వట్టి పోయినవి. ఓర్చియోర్చి నా హృదయము బరువెక్కినది. తపించి తపించి నామేను కందిపోయినది. ఒక మహాశూన్య ప్రపంచములో నేనిప్పుడు సంచరిస్తున్నాను. నా గమ్యస్థాన మేమిటో నాకే తెలియుటలేదు. నేనెందు కొఱకు జీవించవలెనో నాకేతోచుటలేదు. గురుదేవా! నా తప్పులన్నీ మన్నించు. నాకొక త్రోవను చూపు. ఈ పాపాత్మురాలిని కనికరించు. నాకు మనశ్శాంతిని కలిగించు.

గురు : వెనుకటి గాథలు త్రవ్వవద్దు నాగూ! నేనిప్పుడు విరాగిని. ప్రపంచ విషయాలతో నాకెట్టి సంబంధమునూ లేదు. నీవిప్పుడు నా సహోదరివి. ఆ పవిత్రభావముతోనే నిన్ను పలుకరిస్తాను - గౌరవిస్తాను - పూజిస్తాను. నీ సుఖము కొఱకు- అవసరమైతే-నా ప్రాణాలుకూడా ధార పోస్తాను. ఇదినా పవిత్రప్రేమకు నికపోఫలము.

ఒకప్పుడు వ్యక్తిగతమైన నా ప్రేమ ఇప్పుడు పరిమితి నొంది - విశ్వవ్యాప్తమై పరమార్థమునందు లగ్నమైనది. ఇందుకు నీవు పూజనీయవు కాని దోషివికావు. నా జీవితానికి ఒక వెలుగుదారి చూపించిన మహాపుణ్యవతివి.

జానకితో నిన్ను నీవుపోల్చుకోరాదు. ఆమె చరిత్రయే వేఱు - ఆమె త్రొక్కిన మార్గమే వేఱు. అంతటి మనో నిశ్చలత అందఱికీ ఉండదు. ఉండరాదు కూడా. ఆమెతో

పోల్చుకొని జీవితముపై విరక్తినొందుట నీవంటి గృహిణికి తగదు. భారతరమణికి గృహమే స్వర్గము. ఆస్వర్గమును చక్కబెట్టుటే ఆమెను పరమధర్మము.

ఎవ్వరికిగాని కష్టాలు కలకాలముండవు. చీకటి కొన్నాళ్ళు వెన్నెల కొన్నాళ్ళు - ఇదిసృష్టిధర్మము. నీవు చదువుకొన్న దానవు. అంతో యింతో లోకవ్యవహారము తెలిసిన దానవు. ఇటు భర్తను - అటు తల్లిదండ్రులను - సంతోషపెట్టుటే నీ జీవిత పరమార్థముగా భావించుకో. ఈ పరమార్థసిద్ధికొఱకు నీ జీవితాన్ని వినియోగించు.

నీభర్త నిన్ను ప్రేమించకపోవచ్చు. దుష్పథగామి కూడా కావచ్చు. అంతమాత్రముచేత నీ ప్రేమ చలింప రాదు. మలినముకారాదు. ఎట్టివిషమ ఘట్టమునందైనను భర్తను పరిత్యజించుట భారతమహిళకు తగదు. ఆమెకు భర్తతోడిదే లోకము. అట్లని ధర్మాతిక్రమము జరిగినప్పుడు కూడా మిన్నకుండమని కాదు నాసలహా. చేతనైనంతవఱకు భర్తను మంచిమార్గములో పెట్టుటకు ప్రయత్నించాలి. మితి మీఱినప్పుడు చేయునది యేమీలేదు.

నీ భర్త చదువుకొన్నవాడు. సరసుడు. చెప్పితే గ్రహించుకోగలడు. ఒకవేళ తప్పుదారిని బోతే నీవు దిద్ద వచ్చు. నీతండ్రి మందలించవచ్చు. అతనికి వ్యక్తిత్వములేక పోలేదు. తనగౌరవాన్ని తానే పాడుచేసుకొంటాడని అను కోను నాగూ! ఎన్నికష్టాలువచ్చినా నీజీవితపరమార్థము నుండి చలించకు. ఒక్కసారి మహాసాధ్వి-సుమతీదేవిచరిత్ర

జ్ఞప్తికి తెచ్చుకో. ఇంతకంటె నేను చెప్పేదియేమీ లేదు. కష్టాలు సహించు — నీకు మనశ్శాంతి కలుగుతుంది.

అని గురుదేవుఁడు మృదుమధుర వచనములతో నామె హృదయ పరితాపమును జాలవఱకుపశమింపఁజేసెను. నాగమణి కలతచెందిన మనస్సులోఁ గొంత యూరటనొందెను. పెద్దిరెడ్డి గురుదేవుని మనోనిగ్రహమునకు ముగ్ధుఁడయ్యెను.

ఆ సాయంకాలము నాగమణి పెద్దిరెడ్డితో బయలుదేఱి ప్రొద్దుగ్రుంకు నప్పటికి గృహమునకు మరలివచ్చెను. పెద్దిరెడ్డి భాషామందిరమునకుఁ బోయెను.

ఆ రాత్రికిఁ గూడ డాక్టరు రాలేదు. అయినప్పటికి నాగమణి విచారమునకు లోనుగాక — తల్లిదండ్రులతోఁ గూడి భుజించినది. ఆమె ముఖమున దుఃఖచిహ్నములు కన్పింపలేదు. ఒకవిధమైన నూతనోల్లాసము — సంతృప్తి ఆమె మాటలలో తోఁచసాగెను. ఆమెలోఁ గలిగిన ఈ మార్పునకుఁ దల్లిదండ్రు లెంతో సంతోషపడి — అది యంతయు గురుదేవుని ప్రభావమే యని చెప్పుకొనిరి.

## ౧౨

నాలుగు రోజులు గడచినవి. డాక్టరు కోటనుండి తిరిగి రాలేదు. యెట్టి వర్తమానమును లేదు. అసలతఁడు కోటలోనే యున్నదీ — లేనిదీ కూడ తెలియలేదు. ఏమియుఁ దోచక నాయుడు దంపతులు తికమక పడుచుండిరి. నాగమణి మాత్రము నిమ్మకునీరెత్తినట్లు ఎట్టివిచారమునకు లోను

గాక-ఆ విషయమును గుఱించి యెట్టి ప్రస్తావనయుఁ జేయక-ఒకవిధమైన గంభీరముద్ర వహించియుండెను. కుమార్తె మనోభావమును లేశమైనను గుర్తింపఁజాలక - ఆమె మనసు లోతులలోనికిఁ జొచ్చుకొని పోలేక - తల్లిదండ్రులు మఱింత తహతహపడఁ జొచ్చిరి.

ఇది యిట్లుండ డాక్టరు జమీందారిణితో లేచిపోయి నాడని గ్రామములో నొక పెద్ద యలజడి బయలుదేరెను. ఈ విషయమును గురించి పిన్నలు పెద్దలు - గోరంతలు కొండంతలు చేసి వింతగాఁ జెప్పుకొనసాగిరి. నాయుఁడుగారికిఁ దగిన ప్రాయశ్చిత్తము జరిగినదిలే యని కొందఱనిరి. నాగమణి సంసారము నలుగురిలో నవ్వులపాలైనదని మఱికొందఱనిరి. ఈ కాలపు చదువులవల్ల గలుగు ఫలితము లింతే లే యని వేఱొక కొందఱనిరి. జమీందారీ కుటుంబ గౌరవమును పాడుచేయుటకే యీ దుష్ప్రచారాలు పుట్టినదని యింకఁ గొందఱనిరి. ఈ యలజడి వలన నాయుఁడు తలయెత్తుకొని గ్రామములోఁ దిరుగ లేకుండెను. అతని స్థితి సాటివారిలోఁ జచ్చిన చావుగా నుండెను. నాగమణి మాత్రము రోషతాపములకు గుఱిగాక —— ఈ యలజడి నంతను ఓర్పుతో భరించెను.

మఱి రెండురోజులు గడచిన తరువాత మూఁడవనాటి మధ్యాహ్నము——చుక్క తెగిపడినట్లు——మధుసూదనరావు ఎచ్చటనుండియో యింటికి మరలివచ్చెను. ఒక బండిగాని-ఒక వాహనముగాని — యేమియు లేదు. కాలి నడకతోనే యతఁడు వచ్చెను. అతనిరాఁక మంగపతిరావున కాశ్చ

ర్యము గలిగించెను. గాని యతఁడేమియు మాటాడలేదు. డాక్టరు సరాసరి తనగదిలోనికిఁ బోయి — దుస్తులువిప్పి - యేమియు నెఱుఁగని పెద్దమనిషివలె హాలులోనికి వచ్చి—ఒక కుర్చీలోఁ గూర్చుండెను. తల్లిగూఁతులు తలుపుచెంతఁ నిలఁబడి చూచుచుండిరి. భర్తను పలుకరించుటకు నాగమణికి ధైర్యము చాలలేదు. అతఁడుగూడ నామెను పలుకరించ లేదు. చివరకు మంగపతియే సంభాషణ నుపక్రమించెను.

నాయు:ఎక్కడనుండి యీరాక మధూ!

మధు : మద్రాసునుండి.

నాయు:ఎప్పుడు వెళ్ళినావు?

మధు : అయిదురోజులైనది.

నాయు:మఱి యింటికి కబురుకూడా పంపలేదేమి నాయనా? నీకోసము మేమెంతో తహతహ పడుచున్నామే? అంత యవసర మేమి వచ్చినది?

మధు : చాల అవసరమైన పని మీదనే వెళ్ళినాను. కబురు చేయుటకు కూడా వ్యవధి లేకపోయినది.

నాయు: వెళ్ళది యీ గ్రామముమీదుగానే కదా? దిగి చెప్పుటకు కూడా వ్యవధి లేకపోయినదా?

మధు : వ్యవధి ఉంటె యెందుకు చెప్పిపోను? ఆమాత్రపు లోకజ్ఞానము నాకూ ఉంది.

నాయు:సరేలే నాయనా! ఏదో పెద్దవాడను గనుక స్వతంత్రించి అడిగాను. కోపమెందుకు? లే. స్నానము చేసి భోజనము చెయ్యి. నాగూ! బావకు నీళ్ళుతోడు.

మధు : అక్కఱలేదు. విజయవాడలో భోజనము చేసే వచ్చాను.

అని యతఁడు సంభాషణము ముగించినట్లుగా లేచి-తిన్నగా వరాండాలోనికివచ్చి-సిగరెట్టు ముట్టించుకొని పొగఁ బీల్చుచు - ఏమో ఆలోచించు వానివలెఁ గొంచెముసేపు స్తంభమునానుకొని నిలఁబడి ఒక విధమైన చిరాకుతో మరలఁ దనగదిలోనికిఁ బోయెను. నాగమణి కూడ అతని వెనుకనే పోయి - మెత్తగా పక్కవైచి - "రాత్రి నిద్ర లేదేమో? కొంచెము సేపు విశ్రమించండి! అనియొక విధమైన గంభీర ముద్రతతోఁ బలికెను. మధుసూదనరావు మఱేమియు మాటాడక ఆమెవంకఁ గన్నెత్తియైనఁ జూడక - శయ్యపై బరుండి కన్నుమూసెను. అతని వర్తనమునకు వింతపడక నాగమణి తలుపులుమూసి బయటికిఁ బోయెను.

నాఁటిసాయంకాలము - అయిదు గంటలకు - కాఫీ పని ముగించుకొని - డాక్టరు వరండాలో ఒక కుర్చీలోఁ గూర్చుండి పత్రిక చూచు చుండెను. మంగపతి నాయుఁడు-అల్లునకుఁ గొంచెము దూరములో - మెట్లదగ్గఱగా - ఒక పడక కుర్చీలో మేనువాల్చి - చుట్టత్రాగు చుండెను. లోపలి హాలులో రొట్టెలు చేయుచున్న తల్లికెదురుగాఁ గూర్చుండి-నాగమణి యేమేమో చెప్పుచుండెను.

ఆసమయమున నొకగుఱ్ఱపుబండివచ్చి వీధి వాఁకిట నాగినది. అందుండి వయసు మీఱిన పురుషుఁడు దిగి - సరాసరి వరాండాలోనికివచ్చి - డాక్టరుగారికి నమస్కరించి-

"అయ్యా! మీరు వెళ్ళినప్పటినుండి అమ్మగారికి తలబాధ యెక్కువైనది. రాత్రిళ్లు నిద్రపోవుటలేదు. తాము మద్రాసు నుండి యీరోజువస్తామని చెప్పినారట. వస్తేతీసుకురమ్మని బండిపంపినారు. రాత్రిళ్ళు బాగా నిద్రపట్టేటట్లు మంచి మందులు గూడా తెమ్మన్నారు" అనిచెప్పెను. డాక్టరు వెంటనే లేచి గదిలోనికిఁబోయి దుస్తులు వేసికొనుచుండెను.

మంగపతిరావునాయుఁడేమియుఁ దెలియనివానివలె హాలులోనికిఁబోయి "అమ్మా! నాగూ! మీబావతో నేను గూడ కోటకుపోయి అమ్మగారిని చూచి వస్తాను. నాచొక్కా-కోటూ తలగుడ్డ-తీసుకురా? నాపని త్వరగా చూడు తల్లీ!" అని గదిలోనున్న అల్లునకు వినబడునట్లు పలికెను. నాగమణి తండ్రిమాటలు నిజమే యనుకొని ప్రక్కగదిలోనికిఁబోయెను.

అంతలో మధుసూదనరావు హాలులోనికివచ్చి — మామగారినిచూచి – "ఈచీకటివేళ మీరెందుకు? నేను పోయి చూచివస్తానుగా! రాత్రికి అక్కడ ఉండను లెండి!" అని పలికెను.

నాయు: నీ వక్కడ ఉంటావనికాదు నాయనా! ఏదో నీతో కూడా వచ్చి అమ్మగారిని చూస్తాను.

మధు: ఇప్పుడంత తొందరయెందుకు? వ్యాధి నిమ్మళించిన తరువాత చూడవచ్చు.

నాయు:అదికాదు, మధూ! అమ్మగారికి ఇంతజబ్బు చేసిన సంగతి తెలిసికూడా పోయి చూడక పోతే మర్యాదగా ఉంటుందా? అసలాదెబ్బ తగిలినప్పుడే నీతోపాటు పోయి

చూడనందుకు నేనెంతో బాధ పడుతున్నాను. ఇప్పుడు గూడా రాకపోతే ఆమె యేమనుకొంటుంది ?

మధు : ఏమీ అనుకోదు. మీతరఫున నేను పోతున్నానుగా? నేను మీఅల్లుడ్నన్న సంగతి ఆమెకూ తెలుసు? మీకూ-నాకూ — భేదమే లేనప్పుడు మీరు రాలేదని యెందు కనుకొంటుంది? మీరు శ్రమపడ నక్కఱలేదు. మీ బదులు అన్నివిషయాలూ నేనే చూచుకొంటాను.

నాయు:ఈ ముదుసలికి అంతకంటె కావలసిన దేమున్నది నాయనా! అయినా ఒక్కసారి వచ్చి - చూచి పలుకరించి - వస్తాను. అంతకంటె నేనుచేసేది మరేమీ లేదు. మనమిద్దఱమూ కలసిపోతే ఆమెమఱెంత సంతోషిస్తుంది. ముసలివాడనయినా యీపాటిశ్రమకు తట్టుకోగలను.

మధు : మీ రేమనుకొన్నాసరే. మీరు నాతోవచ్చుట అంత మంచిపనికాదు.

నాయు:ఎందుచేత మధూ !

మధు : ఇట్టి ప్రమాదస్థితిలో మీరామెను చూడరాదు. మీరేకాదు ఇతరులెవ్వరూ చూడరాదు.

నాయు:చూస్తే రోగము హెచ్చుతుందా ?

మధు : అవును. ఆసంగతి డాక్టర్లకు తెలుస్తుంది కాని మీ బోటివాళ్లకు తెలియదు. ఆమె జీవించాలని మీరుకోరితే నావెంట రాగూడదు.

నాయు:బలేగట్టి డాక్టరువు మధూ! ఒకఘోరమైన తప్పిదాన్ని కప్పిపుచ్చుటలో నీకుగల ప్రజ్ఞనూ - సమర్థతనూ —

మెచ్చుకోక తప్పదు. పున్నమ్మ-నీవు - ఆజమీందారిణి-
కలిసి కోటలో ఆడుతున్న దొంగనాటకమంతా నాకు
తెలియదనుకొన్నావు కాబోలు ! మీగుట్టంతా నాకు
తెలిసిపోయింది. బండి లేకుండ - బండి బోల్తా పడకుండ-
పున్నమ్మ - జమీందారిణి తలకూ—చేతికీ - గాయాలు
కల్పించింది - ఆ కల్పిత గాయాలకు నీవు రోజులకొద్ది -
అక్కడనేఉండి - చికిత్స చేస్తున్నావు. చికిత్స చేసిన
కొద్ది ఆవ్యాధి ముదురుతున్నది కాని తగ్గుటలేదు. నీవు
దగ్గఱ లేకపోతే ఆరోగము ప్రబలమవుతుంది. ఇతరు
లెవ్వరైనా చూస్తే ఆ గుట్టు బయట పడుతుంది. అంతే
కాదు డాక్టరుగారూ? ఇందుకనేగా నన్ను రాకూడ
దంటున్నది? ఈ తీరున ఎంతకాలమని ప్రపంచాన్ని
మోసగిస్తావు? ఎంతకాలమని యీ పాపిష్టిరోగానికి చికిత్స
చేస్తావు? నీ చదివిన చదువంతా యిట్టిమోసాలకూ —
యిట్టి కుతంత్రాలకూ — యిట్టి దొంగ చికిత్సలకూ—
ఉపయోగపడుచున్నది. ఇదేనా నీ చదువరితనము? ఇటు
వంటి దుర్వర్తనమేనా నీవు కళాశాలలో వందలు గుమ్మ
రించి నేర్చుకొన్నది? ఒక్కసారి ఆత్మపరీక్ష చేసుకో.
పండువంటి సంసారాన్ని పాడుచేసుకొకు. ఆత్మవంచనకు
పాల్పడి గౌరవాన్ని చెడగొట్టుకోకు. నీ వ్యక్తిత్వాన్ని
చంపుకోకు. నిన్ను నమ్ముకొనియున్న మమ్మల్ని దుఃఖ
సముద్రములో ముంచకు.

నాయనా! మధూ! ఈ ముదుసలి మాటలు పాటించు. నీవాదుష్టురాలి కడకు పోరాదు. ఆమెవల్లనే యీ కుటుంబానికి ఇన్ని కష్టాలువచ్చినవి. చివరమాట చెప్పుతున్నావిను. ఇక నీవెంత ప్రయత్నించినా ఆ నీచురాలికక్షుకు మమ్మల్ని మోసగించి పోలేవు. ఈ జానపదులు గిర్జిస్తే ఆజమీందారిణి యిక్కడ ఒక్కగడియసేపైనా ఉండలేదు. నీ గౌరవముకూడా దక్కదు. ఇప్పటికే గ్రామములో నీకు రావలసినంత చెడ్డ పేరు వచ్చింది. ఇకనైనా తప్పుదిద్దుకొనుట మంచిది.

అని నయమున—భయమున – అల్లుని మందలించి-మంగపతిరావు సరాసరి వరాండాలోనికి బోయి-ఆ యాగంతకునిం జూచి — డాక్టరుగారు వచ్చుటకు వీలులేదు. ఒక్క క్షణమైనా ఆగక బండి తోలుకొనిపో. మీ మోసమంతా తెలిసిపోయిందనీ - జమీందారీ కుటుంబానికి అప్రతిష్ట తెస్తు న్నావనీ—మీ అమ్మగారితో చెప్పు. పో ముందు వెళ్ళిపో. మరెప్పుడూ బండితోలుకొనిరాకు. జాగ్రత్త!'' అని గద్దించి పలుక నతండు నోరెత్తక — తృటికాలమైనను అచ్చట నిలువక చరచర వీధి వాంకిలి దాటిపోయి — బండినెక్కి - 'బ్రతుకు జీవుడా' యని కోట దారిపట్టెను. క్షణములోబండి యదృశ్యమయ్యెను.

నాయుడుగారి యింటిలో తలవనితలంపుగా ఒక పెను గాలి వీచి-అందఱిని అల్లకల్లోలపఱచి—శాంతించినట్లయినది. ఆ వృద్ధుని మాటలకు డాక్టరు నిలువునం గంపించి పోయెను. అతండు నోరెత్తుటకుంగూడ జంకి తప్పు నొప్పుకొన్నవానివలె

లోచన లేనండి! పాలుత్రాగి పన్నోళించండి!" అని తనకు గల చనువుకొద్దీ - ఒక విధమైన మందహాసముతోఁబలికెను.

డాక్టరు బదులు పలకలేదు. కుర్చీనుండి లేవలేదు. పాలు త్రాగలేదు. ఆమె వంకనైనా చూడలేదు. నాగమణి యతని మనసు గ్రహించినదానివలె - "ఏదో పెద్దవాడుగనుక మన మేలుగోరి యింతగా చెప్పినాడు. ఈ మాత్రానికి కోప మెందుకు? తప్పున్నప్పుడు ఆ మాత్రము అనతగడా యేమి? ఆయనకంటే మనకు పెద్ద లెవ్వరున్నారు?" అని మనసు నొవ్వకుండఁ బలికెను.

ఆ మాటలకు మధుసూదనరావు మొగము చిట్లించుకొని—"ఎంత పెద్దవాడైనా నోటికి వచ్చినట్లు అనవలసిన దేనా? అనవచ్చేమాట - అనరానిమాట - యోచించుకో వద్దూ? ఆ వచ్చిన మనిషి ముందటు నాపరువుతీసి వేస్తాడా? అసలు నాసంగతి ఆయన కెందుకు?" అని పలికెను.

నాగ : అల్లుని సంగతి మామకు గాకపోతే మరెవ్వరికి? పదుగురిలో నీగౌరవము పాడవుతూవుంటే ఆయన చూస్తూ వూరుకోగలడా?

మధు : నా గౌరవాన్ని గురించి ఆయన కెందుకు? తన గౌరవాన్ని తాను కాపాడుకొంటే చాలు.

నాగ : ఆయన గౌరవానికి ఏలోపమూ లేదు. కాపాడుకో వాల్సిన పనీలేదు.

మధు : నాసంగతి కూడా అంతే.

నాగ : మాటకు మాట అనుట సులభమే. కాని యిచ్చట జరిగేది కోటలో ఉండేవారికి ఏమి తెలుస్తుంది ? అటు వీధిలోకి పోయి వినండి – మిమ్మల్ని గురించి యెంతగా చెప్పుకొంటున్నారో ?

మధు : అనేవాళ్ళకూ — చెప్పుకొనే వాళ్ళకూ — బుద్ధి లేదంటాను. ఒకరి తప్పు లెన్నటానికి అందరూ పెద్దలే, తమ తప్పు మాత్రము తెలుసుకోలేరు. ఈ పల్లెటూరి మొగాలకు పరువు మర్యాద లేమి తెలుసు? వీరి మాటలు పాటిస్తే అంతకంటె బుద్ధి తక్కువపని మరొకటి ఉండదు.

నాగ : ఈ కాలానికి పరువు మర్యాద లేమైనా ఉన్నవంటే పల్లెటూరివారి దగ్గరనే ఉన్నవి. వారిని తెలుసుకో లేక బస్తీవారు ఆడిపోసుకుంటారు.

మధు : పల్లెటూరి దానవు గనుక అభిమానం కొద్దీ మాట్లాడు తున్నావు. నిజానికి — మీ నాన్నకు ఏండ్లు వచ్చినవే కాని—పరువుమర్యాద లేమిటో తెలుసూ ? తెలిస్తే అల్లుణ్ని పట్టుకొని అట్లా మాట్లాడుతాడా? నా గౌరవం పోయినాక నాకీ సంసార మెందుకు?

నాగ : ఆయన మాత్రము అన్నదేమున్నది? ఆ దుష్టురాలి కడకు పోవద్దన్నారు. ఇది తప్పా ? అనరానిమాటా ? పరాయి స్త్రీ దగ్గర — అందులో ఒక కట్టుబాటనేది లేకుండ సినిమా రంగానికెక్కి — అందరి సరసన కులు కుతూ — పోరాని పోకిళ్ళుపోతూ—స్వేచ్ఛగా సంచరించే

ఒక నీచురాలి దగ్గర మీరు ఉంటే మీ సంగతి నాకెక్కువ
కాదూ? నలుగురూ మిమ్మల్ని తేలికగా అనుకోరూ?

మధు : "నీచురాలు — దుష్టురాలు" అని ఏమేమో అంటు
న్నావు, నీవక్కడికి మంచిదాన వన్నమాట! నిజానికి
నీకంటే ఆమే బుద్ధిమంతురాలు. నీవలె ఆమె దొంగ
నాటక మాడుట లేదు.

నాగ : నేను దొంగనాటక మాడుతున్నానా? ఆమె మీద
మీకంత ప్రేమఉంటే ఉండవుగాక — నన్ను మాత్రము
ఆ సైరంధ్రితో పోల్చవద్దు. లేనిపోని అపవాదాలు నా
కంటగట్టవద్దు.

మధు : నీవు ఏమన్నప్పటికీ తప్పులేదు. కాని నేనొక్క
మాట అనగానే అంతకష్టమయింది కాబోలు! అందరి
సంగతీ అంతే అనుకోవాలి. నన్ను పరాయి స్త్రీదగ్గరకు
పోరాదన్నావు. నీవు పరపురుషుని దగ్గరకు పోవటంలేదా?

నాగ : నే నెవ్వరివద్దకూ పోలేదు.

మధు : అబద్ధ మాడుతున్నావు. నిన్ను ప్రేమించిన ఆనాగ
సన్యాసివద్దకు నీ వెన్నిసార్లుపోలేదు? అతడు పరపురుషుడు
కాడా? అతనితో స్వేచ్ఛగా సంభాషించుట — కలసి
మెలసి తిరుగుట — తప్పుగాదా? నా దృష్టానికి వ్యతిరే
కంగా నీవు నడువలేదా? ఆ దొంగ వేషం ఎందుకు? నీకూ—
నీ తండ్రికీ ఇది నచ్చింది గనుక తప్పుగాలేదు. నా కోక
మీకు నచ్చలేదుగనుక తప్పైపోయింది. అంతేనా? నీకల్ల
బొల్లి ఏడుపులు నాముందర చాలించు. నిన్ను నమ్మరాదు.

నాగ : నా తండ్రి అన్నదానికి ప్రతిగా అంటున్నారు కాని నావల్ల యేదోషమూ లేదు. అతడు దొంగసన్యాసి కాడు. నిజమైన తపస్వి. జితేంద్రియుడు. ఆమహాసీయునిగురించి తప్పుగా తలచుట మహాపాపము.

మధు : అవును. ఆయన ఒక మహాతపస్వి-కోడె వయసులో ఉన్న జితేంద్రియుడు. ఆ పడుచుపిల్ల జానకి ఒక మహా యోగిని — పుట్టువారికీ - పుట్టబోయ్యే వారికీ—మాత. నీవొక మహాపతివ్రతవు—లోకాన్ని ఉద్ధరించే దానవు. మీ కపటనాటకము నా ప్రోలనా?

కావిగుడ్డలు గట్టినవారందరూ జితేంద్రియులే. పొట్ట కొఱకు విషయవాంఛాసిద్ధికొఱకు- దొంగ వేషాలువేసే యీ కాలపు సన్యాసుల చరిత్ర యెవ్వరికి తెలియదు? పదుగురిలో నున్నప్పుడు పరమార్థమును గోరే మహాస్వాములు. ఒంటరిగా నున్నప్పుడు విషయసుఖాలలో మునిగితేలే మహా కాములు. ఇట్టి వారిని నిలువునా చీల్చినా పాపములేదు. నిజానికి ఈరాజయ్య నీప్రేమకొఱకుగాదూ సన్యాసి అయినది?

నాగ : ఆ మాట నిజమే. నా మోసమువల్ల అతడు విరక్తుడైనాడు.

మధు : తన రక్తాన్ని ధారపోసింది నీమీదిప్రేమకొద్దికాదూ?

నాగ : కావచ్చు. కాని ఆత్యాగము విషయవాసనతో కూడినది కాదు.

మధు : ఈ వేదాంతాలు చాలించు. ఆనాడు అర్జునుడు కూడా ఇటువంటి మాయవేషముతోనే తన ప్రేమతృష్ణ తీర్చుకొన్నాడు.

నాగ : ఆ కథకూ - ఈ కథకూ - సంబంధము లేదు. కాని పోని అతుకులు పెట్టి - ఒక మహాపురుషుని నిందించి — పాపాన్ని మూట గట్టుకొంటున్నారు. అతడు మీనవలె ఇంద్రియ దాసుడు కాడు. అతని ప్రేమ మలినము కాదు. అతని హృదయము చంచలము కాదు. అతని సన్యాసము బూటకము గాదు. అతడు అగ్నిహోత్రునివలె పరిశుద్ధుడు. శుకునివలె నిస్సంగుడు. అతని దేహములోని ప్రతిరక్త బిందువు పావిత్ర్యమును శోణికించుచున్నది. అతనినోటి వెంట వచ్చు ప్రతిమాటలోను విశ్వమానవ సౌభ్రాత్రము వెల్లివిరియుచున్నది. అతని నయనాంచలములనుండి వెలు వడు ప్రతిదృక్కులోను శాంతి సహనములు పవిత్ర ప్రేమ విశ్వాసములు—తరంగితము లగుచున్నవి. అతను నిజముగా ఈ కాలములో ఉండదగినవాడు కాడు. కాదు. ఆ ప్రేమతపస్విని దుష్టముగా తలంచుట మహాపరాధము. అతడు మన పాలిటికి గురుదేవుడు. ఆజన్మ పరిశుద్ధురాలగు జానకి మనకు మాత.

మధు : నోరుమూయుము. నీచురాలా! ఆదొంగసన్యాసి మీద నీకంత అభిమాన మెందుకో నాకు తెలియదను కొంటివా? నీ చిన్ననాటి వలపు మఱచిపోలేక — నీవా నీచునితో గూడి ఆడుచున్న రహస్య ప్రణయనాటకము నాకే కాదు - ఆ కోటలోని వారికీ - ఈ పేటలోని వారికీ- అందరికీ - తెలిసిపోయింది. దుష్టురాలా! స్వైరిణి ఆ ఝాపలత కాదు - నీవు. నీ మొగము చూడరాదు.

పౌమ్మావలకు పాతకీ ! నీవు తేనెపూసిన కత్తివి. విష సర్పగర్భకుసుమంబవు. నిన్ను — ఆ నీచుని ముక్కలు ముక్కలుగా కోసిననూ పాపములేదు. నాగౌరవాన్ని భ్రష్టముచేసి — నన్ను రచ్చకీడ్పించావు. నీ మొగము చూచిన పంచమహాపాతకాలు చుట్టుకొంటవి. పో బయటికిపో భ్రష్టురాలా !

నాగ : ఇది నాతండ్రియిల్లు. పొమ్మనుటకు మీకు హక్కు లేదు.

మధు : హక్కు. నీవంటి కులటకు హక్కుగూడ. పో ముందు బయటికి పో.

నాగ : నేను వెళ్ళను. నావల్ల ఏదోషమూ లేదు.

మధు : వెళ్ళవూ? ఇంతధిక్కారమా?

అని యొడలు తెలియని కోపముతో నతఁడు చివాలున కుర్చీలోనుండి లేచి - పరమకిరాత హృదయముతో నామె చెంపపైఁగొట్టి — మెడబట్టి ముందుకు నెట్టెను. ఆ త్రోపుకు ప్రమాదము జరుగవలసినదే కాని దేవుడడ్డుపడి కొద్దిలోఁ దప్పించినాఁడు. ఆమె మంచము పట్టుకొని నిలఁబడినది. కాని పందిరి స్తంభము కొట్టుకొని-ముఖమున కొద్దిపాటి బొప్పిమాత్రము గట్టినది.

భర్త యింత చేసినప్పటికి నాగమణి కంటనీరు పెట్టలేదు. ఆదెబ్బను ఆనిందా వాక్యములను-ఆ మానిసిక బాధను-ఓర్పుతో సహించినది. ఆమె యెట్టి వికారమునకు లోనుకాలేదు. ఇప్పటి యామె భావనలో మధుసూదనరావు ఒకానొక డాక్టరు. అతనిపైగల తొల్లింటి యనురాగ విశ్వా

సములు చాలవఱకు సడలిపోయినవి. వివాహము గాక పూర్వ మతనినేదృష్టితోఁ జూచినదో — ఏభావములతో పలుకరించినదో — ఆ దృష్టితోనే, ఆ భావముతోనేక — ఇప్పుడతనితో మాట్లాడినది.

“ డాక్టరు మహాశయా! నీ వింతటి మూర్ఖుడవనీ — హృదయము లేనివాఁడవనీ—నేనెన్నడూ అనుకోలేదు. ఒక కులట చెప్పిన దురుక్తులునమ్మి — పవిత్రమైన మన వైవాహిక బంధమును నీవే సడలించినావు. నిర్మలమైన హృదయముతో-పరిశుద్ధమైన వర్తనముతో-నిన్నారాధించినందుకు-ఇంతపరుషముగా నన్ను నిందించి — నాగృహిణీత్వమునే గాక — యీ సమస్త ప్రపంచానికి ఆదర్శనీయమైన పవిత్రభారత గృహిణీత్వమునే మలిన మొనర్చినావు. ఏదోష మెరుగని నా మొగము చూచుటే మహాపాతకమన్నావు. పోనిమ్ము, ఇందుకు నేను రోషపడను. ఇంద్రియ లోలుడవై-ఒకానొక జారిణిమరోభ్ధలకు చెవియొగ్గి — నీవన్నట్టి మతిలేని మాటలు పాటిసేయను. నిన్ను బలవంత పెట్టను. నీ స్వేచ్ఛా వర్తమునకు అడ్డురాను. కాని ఒక్కటి మాత్రము చెప్పుచున్నాను. ఈ నీ దుష్ప్రవర్తనమునకు—ఈదుస్సాంగత్య దోషమునకు — ముందొకప్పుడు నీవు క్షమాపణ కోరక తప్పదు.

పతి కలుషించి నప్పటికి - గర్హించి నప్పటికీ - సతి పతిని నిరసింపరాదనీ— సతికి పతియే ఏడుగడయనీ —మన శాస్త్రాలు చెప్పుచున్నవి. నా గురుదేవుడట్లే బోధించినాఁడు.

ఈ పవిత్ర ధర్మానికి నేను కట్టుబడి ఉంటాను. నిన్ను ఒక్క-కానిమాటైనా అనను. కలనైనా ధర్మాతిక్రమణకు ఒడిగట్టను. ఎన్ని కష్టాలు వచ్చినా సహిస్తాను. కాని యీ నా సహన భావమును దోషనిరూపణకు కారణముగా మాత్రము గైకొన వద్దు. నేను మూర్ఖశాలను గాదు. ప్రాణమిచ్చియైనా నా సౌశీల్యాన్ని కాపాడు కోగలను.

స్త్రీ అబల కాదు. ఆదిశక్తి. ఆమె సాహసించిన, లోకాలు తల క్రిందలు కాగలవు కాని ఆమె మాతృ హృదయము ఆమె సాహసాన్ని అడుగునకు తొక్కి-వేస్తున్నది. ఈ రహస్యాన్ని తెలుసుకోలేక పురుషులు స్త్రీ తమ చేతిలోని కీలుబొమ్మయనీ–తమ కొఱకు సృష్టింపబడ్డ ఒక విలాస వస్తువనీ — ఆమెమీద సర్వాధికారాలు చలాయిస్తున్నారు. ఆమెకు ఆత్మగౌరవమూ వ్యక్తిత్వమూ - లేనట్లు తలపోస్తున్నారు. ఈ చులకనభావమే పురుషజాతి నైతిక పతనానికి మూలకారణము. ఇది తొలగనంత వఱకు నైతికముగా పురుషజాతి పైకిరాలేదు.

భారత మహిళా చరిత్ర అద్వితీయమైనది. ఆమె నైతిక శక్తికి స్వర్లోకవాసులే దాసోహమన్నారు. సృష్టిస్థితిలయకారకులైన త్రిమూర్తులు ఆమెయింట పసిపాపలైనారు. కర్మసాక్షి యంతటివాడు ఉదయగిరి నెక్క-లేక ఆమెయాజ్ఞకు లోబడినాడు. మృత్యుదేవత ఆమెకు ప్రాంజలించినది.

ఎన్ని ప్రళయ మారుతములు వీచినప్పటికీ పవిత్ర భారతనారీ సౌశీల్యము చెక్కు-చెదరలేదు. దుర్బల హృద

యులైన పురుషులవలె నైతిక పతనానికి ఒడిగట్టి- పరమత స్వీకారాలు చేయక - ఎందరెందరో భారత సతీమతల్లులు తమశీల సంరక్షణము కోసము సుకుమార గాత్రములను వీతి హోత్రున కర్పించినారు. దేశస్వాతంత్ర్యము కోసము ఎంద రెందరో వీర కాంతలు తమ రక్తధారలతో ఈ కర్మభూమిని తడపినారు. భారత కీర్తిసౌధానికి ప్రీలే పునాదులన్న మాట మఱువవద్దు.

నేను ఈ జాతికి చెందిన దానను. నాలో పవిత్ర భారత వీరనారీ రక్తము ప్రవహించుచున్నది. నా ధర్మాన్ని నేను నిర్వహింపగలను. నా నైతిక శక్తిని నేను నిల్పుకో గలను. నా హృదయాన్ని గుర్తింపక అకారణముగా నన్ను నొప్పించినావు. ఈ పచ్చిపుండు మానునది కాదు. నా మొగము చూడవద్దు. నేనూ చదువుకొన్నాను. నాకూ వ్యక్తిత్వమున్నది. గౌరవమున్నది. అందుకనే ఈ అపవిత్ర ప్రణయరంగమునుండి నిష్క్రమించుచున్నాను. పాపపుణ్య విచారణకు పైన భగవంతుడున్నాడు.''

అని తన తుది వాక్యమును ముగించి - నాగమణి ఒక్క క్షణమైనను అచ్చట నిలువక- బయటికిఁ బోయినది. శాపోపహతుడైన యొక నికృష్టునివలె డాక్టరు వెలవెలబారు వదనముతో - కంపిత గాత్రముతో ఏమియుఁ దోచక కుర్చీలో అట్లే కూలఁబడి పోయెను.

ఆ రేయి ఎట్లో వేగినది. దిక్కులు తెల్లవారుటతోఁ బాటు నాగమణి బ్రదుకుగూడఁ దెల్లవారినది. ఆమె మృదు

కపోలము కందగడ్డవలె నెఱ్ఱగాఁ గందిపోయినది. ఆమె విసీల నయనములు - రేయి నిద్దుర లేక -ఏడ్చి ఏడ్చి యెఱ్ఱవారి - వాచిపోయినవి. ఆమె ముఖము అవసాన మాలిన్యముతోఁ గళావిహీనమైనది. లోపల గదిలో — పృథివీమాత కౌగిటిలో - ఏ తెల్లవారు జాముననో- కొంచెము కన్ను మూసిన యామె కింకను మెలకువరాలేదు. మంగమ్మ పెందలకడనే లేచి-ఇంటిపనులు సవరించుకొని-ఏదో వస్తువు కొఱకులోపలి గదిలోనికిఁ బోయినది.

రాత్రి ఏమిజరిగినది తెలియక - అచ్చట కటిక నేల మీద పండుకొనియున్న కుమార్తెను జూచి - ఆమె ఎంతో వింతపడి - నిద్రలేపి — ఆమె వాలకమునకు మరింత భయపడి - "ఈ కటిక నేలమీద ఎందుకమ్మా నిద్రిస్తున్నావు?" అని ప్రశ్నించినది. నాగమణి యే సమాధానము జెప్పక - మెల్లగా లేచి - సరాసరి దొడ్డిలోనికిఁ బోయినది. మంగమ్మ యేమియుఁ దోచక ఆందోళన పడసాగినది.

అంతలో మంగపతిరావు భాషామందిరమునుండి మరలివచ్చి - భార్య చెప్పగా బిడ్డసంగతివిని - పెరటిలోనికిఁ బోయి - ముఖము కడుగుకొనుచున్న కుమార్తెనుజూచి "రాత్రి యేమి జరిగినదమ్మా? ముఖమున ఆ బొబ్బయేమి? ఎడమచెంప వాచియున్న దేమి? ఆ మూర్ఖుఁడు కొట్టెనా యేమి? ఏడువకు తల్లీ! జరిగినది చెప్పు" మని యెంతో గ్రుచ్చిగ్రుచ్చి యడిగెను. కాని యామె జవాబు చెప్పలేదు. అతడు సరాసరి డాక్టరు గదివద్దకు పోయినాఁడు. తలుపు బయటి గొళ్ళెము

పెట్టి యున్నది. అంతకు మరింత వింతపడుచు - గొళ్లెము దీసి - లోనికిఁ బోయినాఁడు. డాక్టరు గదిలో లేదు. అతఁ డెప్పుడు లేచిపోయినది ఎవ్వరికిఁ దెలియదు.

ఏదో అనుమానము మీఁద - మంగపతిరావు బ సొరుగులన్నియు గాలించి చూచినాఁడు. అందేమియు గన్పడలేదు. మంగమ్మ గూడ గదిలోనికిఁబోయి - పక్క గుడ్డలు సర్దుచు - దిండు క్రిందనున్న' యొక కాగితమునుదీసి భర్త చేతి కిచ్చినది. వణఁకుచున్న చేతులతో నతఁడందుకొని మడతవిప్పి - చూచినాఁడు. అదినాగమణి పేర లిఖింప బడిన యుత్తరము. అందిట్లున్నది.

శ్రీమతి నాగమణికి:—

ఇది నీ తండ్రియిల్లు, ఇందుండుటకు నా కధికారమ లేదు. నేను వెడలిపోవుచున్నాను. నాతో నీకుగల సంబ ధము నేటితో తెగిపోయినది. నీదారి నీవు చూచుకోవచ్చును నాకై వెదకవద్దు.

నీ ప్రేమ పవిత్రమైనది కాదు—నిశ్చలమైనదీ కాదు చిన్ననాడు రాజయ్యను మనసార ప్రేమించి — మోః గించినావు. ఇప్పుడునన్నుగూడా మోసగించి — నా గాః వాన్ని నాశనము చేసినావు.

పెండ్లిఅయినాక రాజయ్య మీ గ్రామానికి వచ్చే వఱకూ నీ ప్రవర్తన బాగానేఉంది. కాని అతడు వచ్చినప్పటి నుండీ నీ బుద్ధి మారిపోయినది. ఆ దొంగ సన్యాసి నీ ప్రేమ భిక్షగోరి తనరక్తాన్ని నీకు ధారవోసినప్పటినుండి చిన్ననాట

నీ వలపు చిగురించినది. నీ మనసు అతనిమీదికి పరుగులెత్తి నది. నీ తల్లిదండ్రులుగూడా అందుకు సమ్మతించారు. నీ వత నితో హాయిగా నీ యిష్టప్రకారము ప్రణయ నాటక మాడినావు.

నీ తప్పును కప్పిపుచ్చుటకై నీ తండ్రి నామీద లేని పోని నిందలుమోపి—నన్ను రచ్చకెక్కించాడు. నీవుకూడా అందుకంగీకరించి నన్ను తృణీకరించావు. ఒక మహాపతి వ్రితవలె ఉపన్యసించి—దుశ్శీలాన్ని కప్పిపుచ్చ చూచావు. కాని నీమోసము నా వద్ద సాగలేదు. నీవంటి భ్రిష్టురాలి పొత్తు నాకు తగదు.

తన కోర్కెను నెఱవేర్చుకోటానికే ఆ మాయజోగి-ఒక మహాయోగివలె నటించి-తన రక్తాన్ని నీకు ధారపోసి-నిన్ను బ్రతికించుకొన్నాడు. అందుకు ప్రతిగా నీ యౌవ్వ నాన్ని ఆతని కర్పించుకొన్నావు. అతని కోర్కె నెఱవేరింది. ఈ దొంగనాటక మింకెందుకు? నేటినుండి ఆ దొంగబావతో స్వేచ్ఛగా సంచరించుచు అవసరమైతే- నాకు విడాకులిచ్చి-పెండ్లిగూడా చేసుకో. నీ తల్లిదండ్రులు కృతార్థులవుతారు.

—డాక్టరు

ఆ యుత్తరమును జదివి మంగపతిరావు పట్టరాని కోపముతో "దుర్మార్గుడా! ఎంతకు తెగించినావు? ఏదో కావలసినవాడవని - బుద్ధి గడ్డితిని-పిలిచి పిల్లనిచ్చి పెండ్లిచేసి నందుకు తగిన గుణపాఠాన్ని నేర్పినావు. ఇంతకూ ఆ నీచు రాలు — జమీందారిణి — మొదటినుంచీ కొంపకు తిప్పలు

తెచ్చినది. అది నేటికి పూర్తి అయినది. నాగమ్మతల్లీ! చేతులార నీ గొంతుకు ఉరి బిగించాము. నీ జీవితాన్ని—రాజయ్య జీవితాన్ని పాడు చేశాము. ఇంకేమున్నది నా ఇల్లు సర్వనాశనమైపోయినది. నా బ్రతుకు నలుగురిలో నవ్వులపాలైనది. ఈ దుఃఖాన్ని భరించలేనమ్మా! ఇక నీ జీవిత మెట్లా తెల్లవారుతుందో?" అని గోడుగోడున ఏడువసాగెను. మంగమ్మ బిడ్డను కౌఁగలించుకొని భావురుమనెను.

నాగమణి ఆ యుత్తరమును గ్రహించి తనకుతాను చదువుకొని తన్నుగురించి ఏడ్చుచున్న తల్లిదండ్రులను జూచి — "ఎందుకు మీ రేడ్చుట? భావ జీవితముకంటె, జానకి జీవితముకంటె నా జీవిత మెక్కువా? వారు పోయిన త్రోవనే నా జీవితాన్ని సాగిస్తాను. యీ తుచ్ఛ సుఖాలపై నాకు రోత పుట్టినది. నా కేనాడో ఈ సంసారము అసహ్యమనిపించినది. నా మూలాన మీరు కష్టపడవద్దు. ఎవరికర్మ వారిది. ఊరుకోండి. మీరు వలపోస్తుంటే ఈకొంపలో ఉండలేను" అని సమాధానపెట్టి యోదార్చినది.

నాయుడు గుండె రాయిచేసుకొని యేదుపుమాని బయటికి వచ్చెను. ఆ దుర్వార్త బయటికి పోక్కకుండ వారు భద్రపడిరి కాని యది దాగలేదు. మధ్యాహ్న మగుసరికి గ్రామమంతట గప్పుమనెను. ఆ సాయంకాలము నాయుడు దొంగచాటుగా ఆసుపత్రికి వెళ్ళి రంగనితోఁ గలిసి మాట్లాడ - ఆరోజు ఉదయమే జమీందారిణి తన మోటారు బండిమీద విజయవాడకు బయలుదేరి పోయినదనీ డాక్టరు

సంగతి తనకు తెలియదనీ కారులో ఎవ్వరున్నది తెలియకుండ చుట్టును తెరలుగట్టి యున్నవనీ వాడు చెప్పెను. దానితో నా ముదుసలి నిలువున కృంగిపోయి నిరాశా దైన్యములతోఁ జీఁకటిపడు వేళకు నిల్లుసేరెను.

౧౯.

ఒక వారము రోజులు గడచినవి. డాక్టరు సంగతి ఏమైనది - ఎచ్చటికి బోయినది - తెలియలేదు. ఈ లోపల నాయుఁడు మనసు పట్టలేక - పెద్దిరెడ్డితోఁ గలసి - కోటకుఁ కూడ వెళ్ళివచ్చెను. కాని యచ్చటగూడ నతని యాచూకి చిక్కలేదు. కోటలోని ప్రతినిధి రంగడు చెప్పినదానికంటె నెక్కువ చెప్పలేదు. చివరకు వారందఱు జారిణియగు నా జమీందారిణితో నతఁడే మద్రాసుకో - ఏ బొంబాయికో - చేరియుండునని నిశ్చయించుకొనిరి. పున్నమ్మగూడ కోటలో లేకపోవుట వారికి మరింత యాశ్చర్యము గలిగించినది.

ఈ వారము రోజులనుండి నాగమణి బయటికి పోలేదు. కాని యెంతకాలమని యింటిలో క్రమ్మగలను? ఊరిలో బయలు దేఱిన యలజడి కూడ చాలవఱకు తగ్గిపోయినది. ఈ విషయమును గుఱించి యంతగాఁ జెప్పుకొనువారే లేరు. డాక్టరు దుర్వర్తనము అదివఱకే చాలకాలమునుండి గ్రామమంతట పాక్కియుండుటచేత నతని యప్పటి పోక యెవ్వరికి ఆశ్చర్య మనిపించలేదు. అందువల్ల ఒకనాటి సాయంకా

లము - నాగమణి - డాక్టరు వ్రాసిన యుత్తరమును గైకొని - యోగినీ మాతను జూడ - భాషామందిరమునకుఁ బోయెను.

విద్యార్థు లప్పుడే యింట్లకుఁ బోవుచుండిరి. పెద్దిరెడ్డి పంచలోఁ గూర్చుండి పత్రిక చదువుకొనుచుండెను. జానకీ మాత - అల్లంత దూరములో - ఒక సహకార పాదసము క్రిందఁగల తిన్నెమీఁద కూర్చుండి - ఏదో గ్రంథమును బఠించు చుండెను. నాగమణి ఆ యావరణములోఁ బ్రవేశింపఁగనే జానకి చూచి - యెదురుపోయి - కౌగలించుకొని - కన్నీరు నింపుచున్న యామెను బుజ్జగించుచు తిన్నెకడుకు తిన్నగాఁ దోడ్కొనిపోయి - తన ప్రక్కన కూర్చుండ బెట్టుకొని - "ఏడవకు తల్లీ! పెద్దిరెడ్డి చెప్పగా నీచరిత్రి విన్నాను. నిజముగా నీకు అన్యాయము జరిగినది. కాని మన ప్రయత్నము లక్కఱకురావు. విధిశాసనము ఎవ్వరికీ దాటరానిది.

అతడూ చదువుకొన్నవాడే. ఇంతటి నైచ్యానికి పాల్పడుతాడని ఎవ్వరమూ అనుకోలేదు. ఇదొక గ్రహచారము. అయినా సంస్కారము గలవాడు గనుక - తన తప్పును తెలుసుకొని - త్వరలోనే క్షమాభిక్ష కొఱకు తిరిగి వస్తాడని నా నమ్మకము-" అని చల్లని మాటలతో సేద దేర్చినది.

నాగమణి కొంత యూరటపొంది " మాతా! అతడు శాకపోయిననూ నాకంత విచారములేదు. కాని యీపాడు వ్రాతవల్ల నా మనస్సు ఉడికి పోతున్నది-" అని తాను

తెచ్చిన యుత్తరమును మాతచేతి కందిచ్చినది. జానకి ఆ యుత్తరమును తుదివరకుఁ జదివి — కన్నీరు జొటజొట కార్చుచు — "ఎంతటి ద్రోహచింత? గురుదేవునకా యిట్టి కళంక మాపాదించుట? నిప్పుకైనా త్రుప్పుపట్టునేమో కాని ఆ మహాపురుషుని శీలానికి మాలిన్య మంటబోదు. సమస్త మలినపదార్థములను పరిశుద్ధము చేయునట్టి సత్ప్రవర్తనుడు గురుదేవుడు. తమ నీచవర్తనమును పురస్కరించుకొని ఎదిరి వర్తనమును పరిగణించే ఈ యింద్రియదాసులకు గురుదేవుని తత్వము బోధపడదు తల్లీ!" అని యెంతో వెచ్చనూర్చినది.

నాగ :–మాతా! ఈదుస్సహ బాధను అనుభవిస్తూ నాయింటిలో ఉండలేను. జీవితమంటేనే నాకసహ్యమనిపిస్తున్నది, నాకేదైనా ఒకదారి చూపించు తల్లీ!

మాత:-ఇంతలోనే యింత విరక్తి యెందుకమ్మా! ఈమాత్రపు కష్టాల్ని సహించలేవూ? కష్టాలు కలకాల ముంటవా? అతడు తప్పక తిరిగి వస్తాడు. నీ కాపురము కుదుటపడుతుంది. కొంచెము ఓపికపట్టు తల్లీ!

నాగ :–అది కాదు మాతా! సంసారముపై నాకిచ్ఛలేదు. నామనస్సుకు శాంతిలేదు. నన్నొక దరిజేర్చు.

మాత:–నీవు గృహిణివి. ఇట్టి విరక్తి నీకు తగదు. అదిగాక నిన్నే దిక్కుగా నమ్ముకొని ఉన్న నీ తల్లిదండ్రులు ఈ మాట వింటే అలమటిస్తారు. వారికోసమైనా నీవు నా మాట వినకతప్పదు.

నాగ :-క్షమించుతల్లీ! నన్ను బలవంత పెట్టవద్దు. ఈ మురికి కూపములో పడలేను. నీతో పాటు భాషా మందిర సేవ చేస్తాను. నాకనుజ్ఞ యిమ్ము.

మాత:-నీవు నాకంటే పెద్దదానవు. నీకనుజ్ఞ యిచ్చే అధికారము నాకు లేదు. అదిగాక యీమందిరము గురుదేవునిది. నీవిషయములో నా కెట్టి అధికారమునూ లేదు. ఆయన అనుమతిమీదనే పెద్దిరెడ్డీ నేనూ సేవ చేస్తున్నాము. నీకంతటి ఇచ్ఛ ఉంటే గురుదేవుని అనుజ్ఞ పొందిరా తల్లీ! మనకందరికీ ఆ మహానుభావుడే పెద్ద. ఆయన సమ్మతి లేకుండ మనము ఏపనీ చేయరాదు.

ఆ హితవచనములు వినుసరికి నాగమణి హృదయములో నేదో యొక యపూర్వ సదాశయజ్యోతి తళుక్కున మెఱసినది. క్షణికమైన యీ వెలుగులోఁ దన్ను దాను తిలకించుకొని - గురుదేవు నొద్దకుఁబోవు సంకల్పముతో లేచి—"మాతా! నాకొక దారి చూపించినావు. గురుదేవుని కడకు పోయి అనుజ్ఞ పొందివచ్చెదను. ఆయన నాకు శాంతి భిక్ష పెట్టగల"డని సెలవు గైకొని వెడలిపోయెను.

మఱికొన్ని దినములు గడచిన తరువాత - ఒక నాటి పొద్దుపొడుపు వేళ - గురుదేవు నొద్దకుఁబోవు సంకల్పముతో నాగమణి ఒంటరిగానే బయలుదేరినది. తన పోకను తల్లిదండ్రులకుఁగాని మరెవ్వరికిఁగాని చెప్పలేదు. తాను వంటరిగా బోవుటకు లేశమైనను జంకలేదు. కొండదారి యని గాని క్రూరజంతువు లుండునని కాని ఆమె వెనుకాడలేదు. భాషా

మందిరమునకుఁ బోయివత్తునన్న సాకుతో బయలుదేరి గ్రామీణుల కనుమానము కలుగకుండునట్లు తిన్నగా నా త్రోవను కొంతదవ్వేగి సింగయ్య యింటిమీఁదుగా మలుపు త్రోవను తొక్కి నాగులదిబ్బ నతిక్రమించి రెండు గడియల ప్రొద్దెక్కు నప్పటికి పంట చెరువును దాటి అవ్వలిగట్టు చేరినది.

అచ్చటనుండి కొండల మీఁదికి చిట్టడవులలోనికి మల్లయ్య గుట్టకు పోవునట్టి మలుపుదారు లనేకములున్నవి. వానిలోఁ దన గమ్యస్థానమునకుఁ బోవునట్టి సరియైన త్రోవ యేదో యామెకు బోధపడలేదు. అడిగి తెలిసికొనుట కెవ్వరును దాపునలేరు. ఆమె మనస్సు చలించినది. కొంతవరకు ధైర్యముకూడ జారినది. కాని పట్టుపగలగుట చేతను సంకల్పము బలీయ మగుటచేతను ఆమె గుండె రాయిచేసుకొని మొండి ధైర్యముతో ఒక తప్పుత్రోవనుబడి ముందుకుఁ బోసాగినది. కొంతదూరము పోవుసరికి తన దారి తప్పినదని యామె గ్రహించుకొనెను. కాని యేమి చేయఁగలదు? భగవంతునిపై భారమువైచి గురుదేవుని స్మరించుచు చిన్నచిన్న తిప్పలెక్కి దిగుచు మధ్యమధ్య తిప్పలసందుఁబడి పోవుచు ముండ్లు గ్రుచ్చుకొనుచున్నను కాళ్లు లాగుచున్నను శ్రమకు సహించుచు గమనము నాపక పోయి పోయి ఒక చిన్న లోయలోఁ బ్రవేశించినది.

అప్పటికి దాదాపు జాము ప్రొద్దెక్కినది. సరియైన త్రోవ అప్పటికి చిక్కలేదు. ఏమైనను గానిమ్మని ఆమె

ముందు దృష్టితోఁ బోవుచునేయున్నది. ఏ ప్రమాదమును లేకుండ ఆ లోయ నతిక్రమించి ఒక గుట్ట ప్రక్కలుపునఁగల చిట్టడవి మైదానములోనికివచ్చి దృష్టిసారించి నలుదిక్కులు కలయఁజూచినది. ఒక ఫర్లాంగు దూరములో గురుదేవుని కుటీర మామెకు దృగ్గోచరమైనది. 'అమ్మయ్య' అని ఆ యెలనాగ ఒక్క దీర్ఘనిశ్వాసము పుచ్చినది. చెదరిపోయిన ఆమె హృదయ మప్పటికిఁ గుదుటపడి యొకవిధమైన మహోల్లాసముతో నుప్పొంగి పోయినది. ఆమె కెక్కడిలేని ధైర్యము సేకూరినది.

ఆ యుప్పొంగుతో నాగమణి కొంతమేర నడచినదో లేదో చేరువ పొదలోనుండి ఒక పులి గాండ్రుమన్నది. హఠాత్తుగా వినఁబడిన యా యరపునకు గుండె చెదరి బెదరి ఆ యబల నిలువునఁ గంపించుచు — "పులి! పులి! చచ్చితిని — చచ్చితిని. గురుదేవా! రక్షింపుము—రక్షింపు" మని యెలుగెత్తి పెద్దపెట్టున నాక్రోశించుచు ప్రాణభయమునఁ బరుగిడుటకుఁ బ్రయత్నించినది కాని కాలు సాగలేదు. ఆమె భయవిహ్వలయై స్మృతిదప్పి పడిపోయినది.

కుటీరములోనున్న గురుదేవుఁ డా యార్తనాద మెవ్వరిదో విన్నంతనే గ్రహించి వెంటనే యొక పొడుగాటి బల్లెమును పుచ్చుకొని మెఱపు మెఱసిన చందాన నచ్చటికి వచ్చెను. పులి యామె తలపై దుముకఁ బోవుచుండెను. ఆప్పపాటుకాలములో గురుదేవుఁడు గుఱిచూచి బల్లెమును బలముకొద్ది విసరివైచెను. ఆతని లక్ష్యము తప్పలేదు. బల్లెము

సూటిగాఁబోయి పులి డొక్కలో మొదలంట గ్రుచ్చు కొన్నది. కాని వ్రేటుతిన్న యా క్రూరజంతువు బల్లెపు పోటును లెక్కచేయక తన క్రౌర్యమంతయుఁ గుప్పవోయు నొక్కయుదుటున గురుదేవునిపైకి లంఘించి వాడిగోళ్లు వక్షమున గ్రుచ్చి కండలతో సహా వ్రేవులూడఁ బెఱికి పడిపోయెను. గురుదేవుఁడు గూడ 'హా' యని నేల కొఱఁగెను. తనకు మృత్యువు ముంచుకొని వచ్చుచున్నదని యా వృద్ధ తపస్వి గ్రహించి ఆరిపోవుచున్న కంఠముతో "హే భగవాన్! నా జీవిత కార్యము ముగిసినది. నన్నింక నీలోఁ జేర్చుకో!" అని కన్నుమూసెను. అతని జీవితాధ్యాయ మింతటితో ముగిసినది. వివశయై పడిపోయిన నాగమణి కింకను స్మృతి కలుగ లేదు.

పులి గాండ్రుమనుట - ఎవ్వరో పెద్దపెట్టున నాక్రోశించుట - గుట్టలమీఁద కట్టెలు గొట్టుచున్నవారు విని - ఆయుధాలు పుచ్చుకొని — తలకొకదారిగా 'పులి! పులి!' యని యఱచుచు - పరుగు పరుగున నచ్చటికి వచ్చిరి. కాని వారు వచ్చులోపలనే జరగవలసిన కథ యంతయు జరిగిపోయినది. వారి రాకవలన నాగమణికి మాత్రము మెలకువగలిగినది. ఆమె మెల్లగా కన్నులువిచ్చి - లేచి కూర్చుండి - దిగ్భ్రమ నొందినదానివలె వారివంక వెఱ్ఱిచూపులతోఁ జూచుచు — "మీ రెవ్వరు? పులి యేమైనది? నే నెట్లు బ్రతికినాను?" అని ప్రశ్నించినది.

వారిలో నొకఁ డామెను గుర్తించి- "నీవా నాగన్న తల్లీ! ఇక్కడి కెందుకొచ్చావో కాని నీవు బయలుదేఱిన వేళ మాత్రము మంచిది. నీతల్లి కడుపు చల్లగా గండము తప్పి బ్రతికినావమ్మా! అదిగో! పులి చచ్చిపోయినది. ఆయన యెవ్వరో కాని నిన్ను రక్షించటానికి వచ్చి చచ్చిపోయినాడు. నిజముగా ఆయన నీపాలిటికి దేవుడు-" అని చెప్పటయే తడవుగా "ఎవ్వరా మహాపురుషు?" డనుచు నాగమణి లేచి- చూడఁబోయి - నెత్తుటిలో దొప్పదోగుచున్న గురుదేవుని గుర్తించి - కెవ్వున నార్చి - శవముపైఁబడి - "హా! గురుదేవా! రాజయ్యబావా! నన్ను రక్షింపవచ్చి పులినోటి కండయై పడిపోతివా? అయ్యో! అయ్యో! ఇంకేమున్నది? అయ్యలారా! ఇత డెవ్వరో కాదు. నా చిన్ననాటినుండి మీతో కలసి మెలసి తిరిగిన మా రాజయ్యబావ. పోండి. ఎవ్వరైనాపోయి త్వరగా నా తలిదండ్రులను తోడ్కొని రాండి. ఆలస్యము చేయకండి" అని మొరపెట్ట నిద్దఱు ముగ్గురప్పుడే పరుగెత్తిపోయిరి.

పొరలి పొరలి వచ్చుచున్న దుఃఖముతో నాగమణి మఱి మఱి విలపించుచు- "అయ్యో! అయ్యో! ఈ పాడు వివాహము జరిగినప్పటినుండీ నిన్ను నోరార 'బావా' యని పిలుచుటకు గూడ నోచుకోక పోతినే? చిన్ననాట నిన్నెంతో ప్రేమించి - నమ్మించి - చివరకు - మోసగించి నీ ప్రణయ జీవిత సౌధాన్ని కూలద్రోసిన యీ పాపిష్టి మఱదలి కోసము ప్రేమ తపస్వివై- ఒకప్పుడు నీవన్నమాట ప్రకారము - నీ

రక్తాన్ని ధారపోశావు. ఈనాడు ప్రాణాలే యిచ్చావు. నీ మాట నీవు నిలబెట్టుకున్నావు. ఈ తుచ్ఛురాలివి ఎందుకంతగా ప్రేమించితివి బావా! నీచావు కన్నులార చూచి కూడా నా ప్రాణాలు పోవేమి బావా? నాకు మొండి ఆయుర్దాయము ఉన్నది. చావను. అయ్యో బావా! బావా!

నీవల్ల శాంతి సందేశము విందామని వచ్చినందుకు ప్రాణాలుండగా నిన్ను కడసారి చూచి-పలుకరించు భాగ్యము కూడా నాకు లేక పోయినదే? నే నెంతటి మహాపాపినో? ఈ హీనురాలి మూలాన పరమ పవిత్రుడవైన నీవు - ఎట్టి యపనిందకు గుఱియైతివి బావా? నా పుట్టువు మాసిపోను - నీవంటి పరిశుద్ధ వర్తనుని అకారణముగా పొట్ట బెట్టుకొంటినే. ఆపాడు పులి నన్నెందుకు చంపదాయె? దానికి గూడ ఈ పాపాత్మురాలి దేహము ముట్టరానిదయ్యె గాబోలు!" అని సంతత ధారగాఁ బ్రవహించు తన వేడి కన్నీటితో నా మృత కళేబరమును స్నానము చేయించుచుండెను. ఆమె దుఃఖాలాపములను వినుచున్న వారందఱికిఁ గూడ గుండెలు చెఱువులయ్యెను. కొందఱామెను ఓదార్పఁ జొచ్చిరి.

ఆ తీరున షుమారు రెండు గంటల ప్రొద్దు పొడచునప్పటికి - ఆ దుర్వార్తవిని నాయుడుపేట గ్రామమంతయు నచ్చటికిఁ గదిలి వచ్చినది. నాగమణి తన తండ్రి మున్నగు వారినిఁ జూచి- "ఇంకేమున్నది నాన్నా! బావ మనకు దూరమై పోయినాడు. జానకీ మాతా! పెద్దిరెడ్డీ! మీ గురుదేవుని పొట్టబెట్టుకొన్నాను. అయ్యో! మంగమ్మ తల్లీ! నా

శాంతి కలుగునట్లు ప్రార్థనలుగావించిరి. మందిర విద్యార్థులు గురుదేవుఁడు రచించిన ప్రేమగీతములు పాడిరి.

అది యంతయు ముగిసిన తరువాత జానకీ మాత శాంతిదేవతవోలె సమాధి ముందర నిలఁబడి — "గురుదేవునిచే నెలకొల్పబడిన యీ భాషామందిరము — నేటినుండి— 'రాజమందిరము' అను పేరుతో వర్ధిల్లుగాక! గురుదేవుని భౌతిక శరీరము నశించినప్పటికీ నిత్యమైన ఆ మహానీయుని పవిత్రాత్మ మనకూ — మనతోడి మానవులకూ — శాంతిని ప్రసాదించుగాక!" అని పలికి యీ పవిత్రసమాధి మీఁద పువ్వులు దోయిలించి – కన్నీటిబిందువులు రాల్చెను. అందఱు "గురుదేవునకు జై" యని ఘోషించిరి.

## ౨౦

ఆనాటి రాత్రి తెల్లవారక పూర్వమే యెవ్వరికిఁ దెలియకుండ మటుమాయమై పోయిన డాక్టరు మధుసూదనరావు స్వైర విహారిణియగు నా జమీందారిణితోఁ గలసి చెన్నపట్టణమునకుఁ బోయి అచ్చట నామె భవనము నందే నివసింపఁ జొచ్చెను.

చెన్నపట్టణము ఒక మహానగరము. తూర్పు సముద్ర తీరమునఁ గొన్ని శతాబ్దముల క్రిందట ఆంగ్లేయులచే వ్యాపారార్థము నిర్మింపఁ బడినది. ప్రస్తుతము మన రాష్ట్రీయ ప్రభుత్వమునకుఁ కేంద్రస్థానము. ఓడ వర్తకమునకు, టోకు వ్యాపారమునకు మూలస్థానము. అందలి విశాలములైన

రాజ వీధులు, తారుపూతలతో నునుపులు దేలి నల్లని మెరుఁగులు గ్రిక్కుచుండును. వేలకొలఁది ప్రజలు ఇసుక పైచి నను రాలకుందురు. రాత్రులు వెన్నెలలు కుప్పలువోయు విద్యుద్దీప కాంతులతో ఆ మహాపట్టణము ధగధగ మెరసి పోవుచు స్వర్గపురమునుగూడ మరపించుచుండును.

ఆ నగరరాజము నవనాగరకతకుఁ బుట్టినిల్లు. అందు రకరకాల ప్రజలు లక్షలకొలఁది నివసించుచుందురు. వినోదాలకుఁ గొరఁత లేదు. యెన్నెన్నో శ్రీరామ మందిరము లున్నవి. సినీమాలున్నవి. నాటకశాల లున్నవి. అడుగు దూరమైనను నడువవలసిన పని లేకుండ ట్రాములు, బస్సులు, జట్కాలు, రిక్షాలు మొదలైన ప్రయాణసాధనము లెన్నో యున్నవి. సాయంకాలము చల్లని గాలిలో విహరించుటకు పెద్దపెద్ద పార్కులు సుదీర్ఘమైన సముద్రతీరము బహిరంగ స్థలములు వున్నవి. గొంది గొందికి — అడుగడుగునకు — అరవల కాఫీహోటళ్లు ఉన్నవి. అచ్చట లేనిది మరెచ్చటను లేదని చెప్పవచ్చును.

సముద్రపు టొడ్డుననే ప్రధాన న్యాయస్థాన మున్నది. ఆ భవనము పై భాగమునఁ జాలయెత్తున ఓడలకు దారిచూపు దీప స్తంభమున్నది. అందలి విద్యుద్దీపము వలయాకారముగాఁ దిరుగుచు రాత్రులు సముద్రముమీఁదఁ గొన్ని మైళ్ళ వరకుఁ దన కాంతిని ప్రసరింపఁ జేయుచుండును. ప్రభుత్వ భవనములుగూడ సముద్రతీరముననే యున్నవి. క్రొత్తవారికి ఆ మహాపట్టణములో దిక్కు తెలియదు.

డాక్టరు మధుసూదనరావునకు - రూపలతాదేవికి — చిన్నప్పటినుండి యీ మహానగరము కొట్టినపిండి గనుక వారికచ్చట తెలియని క్రొత్తలేలేవు. వారెఱుఁగని త్రోవలే లేవు. ప్రతి సాయంకాలము కారులో చల్లగాలికొరకు బీచికి పోవుచు రేడియో సంగీతములు వినుచు - సినిమా చిత్రములు చూచుచు - వారు స్వేచ్ఛగాఁ గాలము గడుపఁజొచ్చిరి. ఆ విలాసములలో మునిఁగి తేలుచు - రూపలతా సౌందర్య మధువును ద్రావుచు — మధుసూదనరావు నాయుడుపేట గ్రామమునే మఱచిపోయెను.

రూపలత ప్రసిద్ధికెక్కిన సినిమా తారయగుట చేతను- ఒక ఫిల్ము కంపెనీకి యజమానురాలగుటచేతను - అనుదినమామెనొకడను లెక్కలేనంతమంది నటీనటులు - గాయకులు - నర్తకులు - దర్శకులు - ఛాయాశబ్దగ్రాహకులు — కథకులు — వచ్చిపోవుచుందురు. వారందఱితోను ఆమె స్వేచ్ఛగాఁ గలసి మెలసి తిరుగుచుండును. ఒక్కొక్కప్పుడు చీట్లపేక వినోదాలలోను - ద్యూత క్రీడలలోను — మధుసేవలలోను — మునిగిఁ తేలుచుండును. మఱొకప్పుడు ఏ నటునితోనో — ఏ దర్శకునితోనో - కలసి యెచ్చ టెచ్చటికో పోవుచుండును. ఏ రాత్రికో ఒడలు తెలియని నిషాతో మరలి వచ్చుచుండును.

మొదట మొదట మధుసూదనరావు తన్ను గుఱించి యేమనుకుంటాడో యని ఒక విధమైన భయముతో రూపలత నియమబద్ధముగానే ప్రవర్తించినది. కాని కాలము గడచిన కొద్ది అతని మీఁది మోజుతగ్గిపోయి - అతనినొక క్రీడావస్తు

వుగా భావించి లెక్కచేయక - తన యిష్టప్రకారము ప్రవర్తింప జొచ్చినది. అదికూడా మఱికొన్ని రోజులకు హద్దు మీఱి పోయెను. ఎంతెంత సొమ్ము వ్యయమగు చున్నను ఆమె భోగలాలసతకు మేర కనుపింప లేదు. మధుసూదనరావు ఎంత దుశ్శీలుఁడైనను తాగుబోతు మాత్రము కాడు. అతనికా వాసనయే గిట్టదు. అతనిలో ఉన్న సుగుణ మిది యొక్కటే. అందువల్ల రేయింబవలు మధుపానములో మునిఁగి తేలు రూపలతాదేవి వర్తన మతని కసహ్యమని పించినది. అదిగాక మట్టు మర్యాదలు మాని యెక్కడెక్కడి వారితోఁ గలసి మెలసి తిరుగుట కూడ నతనికి నచ్చలేదు. క్రమక్రమముగా నామెమీఁద నతని కొక విధమైన యేహ్య భావము గలుగఁ జొచ్చెను. ఆమె యడుగులకు మడుగులొత్తు వున్నమ్మకుఁ గూడ స్వైరవిహారము చాల కష్టమనిపించినది.

ఒకనాటి మధ్యాహ్నము - భోజనములైన తరువాత రూపలత మేడమీఁది గదిలోఁ గూర్చుండి — ఏవో సినిమా తారల బొమ్మలు చూచుచుండెను. మధుసూదనరావు గూడా ఆ గదిలోనే ఉండెను. కొంచెముసేపైన తరువాత - ఆమె కభిముఖముగాఁ దనకుర్చీ లాగుకొని - ఆమెతో ప్రసంగింపఁ జొచ్చెను.

మధు : రూపా ! నీవీ త్రాగుడు మానుదువా ? ఎంతో సొమ్ము వ్యర్థమగుచున్నది.

రూప : నీసొమ్ము కాదుగా ? నీకంత కష్టమెందుకు ?

మధు : నీ నా అనే భేద మెందుకు? ఎవరి సొమ్మయినా ఒక టే.

రూప : నా సొమ్ము నేనుఖర్చు పెట్టుకోటానికి నీశాసన మేల? నిన్నడిగినప్పుడు అందువు గానిలే!

మధు : అదికాదు రూపా! పదిమందిలో తిరుగ నేర్చినప్పుడు పరువు మర్యాదలు పాటించవద్దూ?

రూప : నీకున్న పరువు మర్యాదలు నాకు లేకపో లేదులే? అధిక ప్రసంగము చాలించు.

మధు : నన్నంతగా నమ్మించి యిచ్చటికి తీసుకొని వచ్చినది యీ మాట అనుట కేనా?

రూప : నామీద అంతమోజు పడి యిచ్చటికి నాతో లేచి వచ్చినది యీ అధికారము చలాయించుట కేనా?

మధు : నన్నింత చులకన చేసి మాట్లాడుట పవిత్రప్రేమ లక్షణము కాదు రూపా!

రూప : ఇంద్రియదాసుడవై – పండువంటి సంసారాన్ని పాడు చేసుకొని – ఒక పరాయి స్త్రీతో లేచివచ్చుట కూడా పవిత్రప్రేమ లక్షణము కాదు డాక్టర్! పవిత్రప్రేమ! ఆ మాట ఉచ్చరించుటకు నీకు నోరెట్లు వచ్చినది? నీకు పవిత్రప్రేమ ఉన్నగదా నాకు లేదనుట? ఈ విషయములో ఉభయులమూ ఒక టేబల్లో చదువు కొన్నాము. పవిత్ర ప్రేమ అనేది – పల్లెటూరి మనుష్యులైనప్పటికి ఆ రాజయ్యకూ – జానకికీ – చెల్లుతుందికాని మనవంటి

వారికి చెల్లదు. మనము అవినీతికి పట్టుగొమ్మలము డాక్టర్ !

మధు : అయితే నన్ను పెళ్ళిచేసుకొంటానని చెప్పిన మాట లన్నీ బూటకాలే నన్నమాట ?

రూప : ఈ ప్రపంచమే ఒక పెద్ద బూటకము. మన జీవితమే ఒక నాటకము. ఇక మనమాటలు చెప్పాలా ? అయినా నీకు పెండ్లెందుకు ? ఇదివఱకు చేసుకొన్న పెండ్లి ఇంత చక్కగా వెలిగించావు. ఇక నన్ను పెండ్లాడి కాని స్వర్గానికి నిచ్చెనవెయ్యావు ? పెండ్లి! ఈ క్రొత్త బంధ మెందుకులే ? ఉన్నబంధాలు చాలు డాక్టర్! నాతో కలసి ఉండుట నీకు కష్టమనిపిస్తే నీదారి నీవు చూచు కోవచ్చు.

మధు : సినీమా సుందరివైనందుకు నీ పాత్ర చక్కగా నటించావు. నా బ్రదుకు తెరమీది కెక్కించి పదిమందికీ చూపించావు. నీ తత్వ మెట్టిదో యిప్పటికి బోధపడ్డది రూపా !

రూప : పదివేల నమస్కారాలు.

అని రూపలత యచ్చటనుండి లేచి క్రిందికి దిగి పోయెను. డాక్టరు నిర్జీవ ప్రతిమవలె కుర్చీకి చేరగిలఁబడెను. అతఁడిప్పు డేస్థితిలో నున్నది యతనికే బోధపడలేదు. ఆనాఁ డతనికి జరిగిన యవమాన మలేఖ్యము. అందుకతఁడుపొందిన యసూాన మనోవ్యథ అనూహ్యము.

ఆ మఱునాఁటి యుదయము- తొమ్మిదిగంటలప్పుడు- మధుసూదనరావు క్రింది యంతస్తు గదిలో బనిచేయుచున్న పున్నమ్మ దగ్గఱకుఁబోయి "మీ అమ్మగారెచ్చటకు పోయినది పున్నమ్మా? కాఫీకూడ త్రాగినట్లు లేదే?" అని ప్రశ్నించెను. పున్నమ్మ ఒక విధమైన చిరాకుతోఁ దనకుఁ దెలియదనెను.

మధు : నీకు కూడా నామీద కోపమెందుకు పున్నమ్మా?

పున్న : నీ మీద కాదు బాబూ! మా అమ్మగారిమీద నే. ఆమె ప్రవర్తనము నాకు నచ్చలేదు.

మధు : అందుకేగా నిన్న అంత రాద్ధాంతము జరిగినది.

పున్న : అంతా నాకు తెలుసు. ప్రక్కగదిలోనే యుండి మీ సంభాషణ మంతా విన్నాను.

మధు : అంతా నీకు తెలిసిందిగా! నన్నేమి చెయ్యమంటావు పున్నమ్మా?

పున్న : నేనా బాబూ సలహా చెప్పేది? నన్నేమీ అడుగవద్దు.

మధు : అదేమిటి పున్నమ్మా? కన్నీరు నింపుతున్నావెందుకు? సలహా అడుగుటకూడ తప్పైనదా? పోనీలే.

పున్న : అదికాదు నాయనా! ఈ పాపాని కంతకూ నేనే కారణభూతురాలను. నావల్లనే నాయుడుగారి కుటుంబానికీ - రాజయ్యకూ - నాగమణికీ - జానకికీ - చివరకు నీకూ - యింత చేటు వచ్చింది. ఇదంతా యీ పాడు దేవిగారి మెరమెచ్చుల కోసము చేసి- ఇప్పుడు పశ్చాత్తాప పడుతున్నాను. నా పాపానికి నిష్కృతి ఉన్నదో లేదో!

అని కన్నీరు తుడుచుకొని – అమ్మగారు భర్తకు మందుపెట్టి వెర్రులెత్తించి దేశాలపాలు కావించిన సంగతి – తాను మొదటినుండి రాజయ్యపట్ల కానిపోని కసిపూని కావించిన ద్రోహము–నాగమణి అతనికి దక్కకుండ పన్నిన మాయ పన్నాగము – అశుభము శుభము తెలియని జానకిని మోసగించిన విధము–రాజయ్యకు జానకికి సంబంధమున్నట్లు కల్పించిన కుట్ర – అతనిని కోటకుఁ గొనివచ్చుటకై ఆడిన దొంగనాటకము – ఏ పాప మెఱుఁగని నాగమణి శీలమును గుఱించి అతనికిఁ గావించిన దుర్బోధ– రాజయ్య సన్యాసము దొంగ సన్యాసమని యతనిని నమ్మించిన కుతంత్రము – మొదలైన సమస్త విషయములు పూసగ్రుచ్చినట్లతనికి వినిపించి "ముందేమి పురుగులు పడి చచ్చిపోతానో చెప్పలేను కాని నా పాప ఫలాన్ని ఇప్పుడే రుచి చూస్తున్నాను. నన్ను క్షమించు డాక్టరు బాబు!" అని యతని రెండుకాళ్ళు పట్టుకొని ప్రార్థించినది.

పున్నమ్మ చెప్పినదంతయు నామూలాగ్రము పొల్లుపోకుండ విన్న మధుసూదనరావు —— చివరకొక్క పెద్ద నిట్టూర్పుపుచ్చి– "ఎంత ద్రోహము జరిగినది పున్నమ్మా! పాప పుణ్య విచారణకు పైన భగవంతు డున్నాడని ఆ రేయి నాగు చెప్పినమాట ఇప్పటికి సార్థకమైనది. ఈ చివరి గడియలోనైనా నీకీ సద్బుద్ధిపుట్టి యీ మోసమంతా చెప్పబట్టి సరిపోయింది కాని లేకపోతే యీ కటిక చీకటిలోపడి ఆమరణాంతము దిక్కూ దెసతోచక పాడు హృదయముతో

నేను క్రుళ్ళిక్రుళ్ళి కంపుగొట్టి - తపించిపోవలసిన దేకదా? నీవు సామాన్య పరిచారికవుకావు. నాకు జ్ఞాన చక్షువునొసంగి— సత్యజగతిని చూపించిన యొక మహా దేవతవు. దేవదేవుడు నీ తప్పులను మన్నించుగాక! ఈ దుష్టురాలి మొగమింక చూడను. ఆజన్మ పవిత్రుడైన రాజయ్యే ఈ నీచురాలిని గురించి చెప్పినదంతా నిజమే'' అని పలికెను.

పున్న: నన్ను కూడా నీవెంట తీసుకుపో బాబూ! నేనిచ్చట ఉండలేను.

మధు :-నీకేమి కష్టము కలిగింది పున్నమ్మా?

పున్న:-ఏమని చెప్పేది? అనుదినమూ తన యింటికి వచ్చే త్రాగుబోతు లందఱికి తలలంటమనీ - కాళ్ళు పిసుకమనీ- పానపాత్ర లందించుమనీ - నిద్రపొయ్యేదాకా విసరుమనీ- యేవేవో చేయరాని పనులు చెపుతుంది. కాదంటే కస్సుమంటుంది. ఒకసారి బద్ధకించి పడుకొంటే కాళ్లతో తన్ని కొరడాతో కొట్టింది. గతిలేక పొట్ట కొఱకు ఎంత వ్రూడిగాని కొప్పుకున్నా ఈలాటి నీచమైన పనులు చేయ లేను బాబూ! ఈ పాడుకొలువు లేకపోయినా రెక్కల మ్ముకొని బ్రతుక గలను. నీవెంటవస్తే అంత అన్నము పెట్టలేవూ?

మధు :-అదెంతపని పున్నమ్మా! ఆమాత్రమైనా కృతజ్ఞత చూపకపోతే నీఋణమెట్లు తీరుతుంది? అయినా నా పరిస్థితి చక్కబడే వఱకూ నీవిచ్చటనే ఓపికపట్టిఉండు. తరువాత నిన్ను తప్పక పిలిపించుకుంటాను.

అని మధుసూదనరావు పున్నమ్మను సమాధాన పఱచి మాట ముల్లె సర్దుకొని – ఆ నీచురాలి కొఱకు వేచి యుండక – పున్నమ్మకు మాత్రము చెప్పి — అప్పుడే యెచ్చటికో బయలుదేరి పోయెను.

## ౨౧

గురుదేవుఁడు సిద్ధిఁబొంది దాదాపు ఆరు నెలలు దాటినవి. నాయుఁడు పేటలోని వారందరు — మంగపతిరావును గాదని శక్తికొలఁది చందాలు వేసికొని — సమాధిమీఁద నొక దివ్యమైన మంటపమును గట్టించిరి. చివరి కామాత్రపు భాగ్యముగూడఁ దనకుఁ దక్కకపోయెనే యని నాయుఁడు చాల పరితపించెను. గురుదేవుని పిత్రీయమైన యా కొద్ది యాస్తికూడ మందిరమునకే సంక్రమించెను.

పెద్దిరెడ్డి తన సొంత ద్రవ్యమును వెచ్చించి — ఒక సిద్ధహస్తుని చేత గురుదేవుని తైలచిత్రమును వ్రాయించి-మందిరములో ఆవిష్కరించెను. ఆ తైలచిత్రమునుబట్టి చాల ఫొటోలు తీయించి – అభిమానులందరికీ పంచిపెట్టెను. గురుదేవుని ప్రేమగీతములను సేకరించి గ్రంథరూపమున ముద్రించెను.

రాజమందిరమునకు సర్వాధికారిణి జానకీమాత. ఆ మందిర కార్య కలాపము లన్నియు నామె యాదేశానుసారము నిర్వర్తింపఁబడుచుండును. పెద్దిరెడ్డి ప్రధాన విద్యాపతి. జానకీమాతతో సంప్రదించి విద్యావిధానము నంతటిని అతఁడే నడుపుచుండును. చక్కని వసతులు – ఉత్తమ విద్యా

బోధన — బోధనకు వలసిన సమస్త పరికరములు — క్రమ శిక్షణ – అన్నియుఁ గుదురుకొని యుండుటచేత ఆ మందిరము విద్యార్థుల సంఖ్యలోను బోధకుల సంఖ్యలోను క్రమక్రమాభివృద్ధిఁ గాంచి సర్వతోముఖముగా శోభించెను. ఉత్తమ విద్యాసముపార్జనకై దూరపు భూములనుండికూడ విద్యార్థులు రాఁదొడంగిరి.

గురుదేవుఁడు మృతినొందినప్పటినుండి జానకీమాత కఠిన నియమానుష్ఠానమునకు బూనుకొనెను. ప్రతిదినము బ్రాహ్మ ముహూర్తముననే లేచి – స్నానాదికములు ముగించుకొని – ప్రభాత సంకీర్తనము చేయును. తరువాతఁ దాను స్వయముగా గ్రుచ్చిన పూలమాలలతో గురుదేవుని తైలచిత్రమును — సమాధిని అలంకరించును. ధూపదీప హారతు లిచ్చును. ఆ తరువాత సమాధిముందుఁ గుశాస్తరణముపైఁ గూర్చుండి — గీతాశాస్త్రమును బఠించును. అది ముగిసిన తరువాత మందిర కార్యకలాపములో నిమగ్నయగును. మధ్యాహ్నము పాలు — పండ్లు గురుదేవునకు నైవేద్య మొసఁగి – అవి మాత్రము ఆరగించుచు దేహధారణ గావించుకొనును. సాయంకాలము దైవభజన మొనర్చి – గురుదేవుని ప్రేమగీతములుపాడి సమాధిపూజలు చేయును. రేయి తొలి జాము గడచినమీఁద – మంటపములో సమాధి ప్రక్కన — కటిక నేలమీఁద – కొంగు పఱచుకొని శయనించును. పెద్దిరెడ్డి మఱికొందఱు వయోజన విద్యార్థులు – మందిరములందే నిదురింతురు.

ప్రతి దినము సాయంకాలము - నాగమణికూడ - మాతతోఁగూడి సమాధిపూజలలోఁ బాల్గొనుచు - గురుదేవుని ప్రేమగీతములను బాడుచు - ప్రొద్దుపోవు వఱకుఁ దదీయ సేవలలో నిమగ్న యగుచుండును. అంతగాఁ గఠిన నియమములు పూనకున్నను - ఒక మాదిరి నియమబద్ధమైన జీవితమునే యామె గడుపుచుండును. గురుదేవుని నైవేద్యమునకు నిత్యము పాలు తెచ్చి యిచ్చును. ఏవిధమైన యలంకారములను గయిసేయక - ఎట్టి యభిరుచులకు లోనుగాక - విరక్తురాలివలె మెలఁగుచుండును. మందిర విద్యావిషయములందుఁ దగినంతగాఁ దోడ్పడుచుండును. ఈతీరున నామె దైనందిన జీవితము దొరలిపోవుచుండెను. ఆమె తల్లిదండ్రులు మాత్రము కంటికి కడివెడుగా వలపోయుచుండిరి.

ఒకరోజు సాయంకాలము తపాలా బంటోతువచ్చి - మందిరమునకు సంబంధించిన యుత్తరములు - పత్రికలు - ఇచ్చిపోయెను. చదువుదమని పెద్దిరెడ్డి పత్రికమడత విప్పెను. మొదటిపుటలో - తాటికాయలంత అక్షరాలతో - "రాజమ్మపేట జమీందారిణి - రూపలతాదేవి హత్య" అని ముద్రింపఁబడియున్న శీర్షికను జూచి - చకితుఁడై - మహాశ్చర్యముతో దాని నామూలాగ్రము చదివెను.

ఈ నెల 13 వ తేది రాత్రి షుమారు 7 గంటలప్పుడు రూపలతాదేవి అను పేరుగల ఒక సినీమాతార - రాయిపేట బీచినుండి - రిక్షాలో పోవుచుండగా - ఎవ్వరో రోడ్డుప్రక్కన పొంచియుండి - ఆమెను రివాల్వరుతో కాల్చి చంపినట్లు తెలి

యువచ్చినది. హంతకుఁడు చిక్కలేదు. దర్యాప్తు జరుగుచున్నది. శవపరీక్షనుబట్టి ఇది హత్య యని ఋజువైనది.

ఈమె రాజమ్మపేట జమీందారిణి. పేరు రూపలతా దేవి. వయస్సు దాదాపు ముప్పదియైదేండ్లు. ఒక సుప్రసిద్ధ సినీమాతార. రూపలతా పిక్చరు అను పేరుగల ఒక ఫిల్ము కంపెనీకి యజమానురాలు.

ఈమె భర్త పిచ్చివాడై దేశాలపాలైనాడనీ - కొంత కాలమునుండి ఈమెతోఁగలసి - ఈమె సొంత భవనములో ఒకానొక డాక్టరు - పేరు మధుసూదనరావు - నివసించుచున్నాడనీ - అతడు పదిరోజుల క్రిందటనే యెచ్చటికో లేచిపోయినాడనీ - ఈ హత్యకూ అతనికీ యేలాటి సంబంధము లేదని తేలిపోయినది. ఆమె పరిచారిక పున్నమ్మ అరెస్టు చేయబడినది.

అది చదివి పెద్దిరెడ్డి పట్టరాని సంతోషముతో జానకీమాత కా సంగతి చెప్పెను. ఆమె యెట్టి వికారమునకు లోనుగాక ప్రశాంతవదనముతో జాలిచూపుతో "పాపము! యెంతగొప్ప కుటుంబములో పుట్టితేనేమి? చివరకు దిక్కులేనిచావు చచ్చినది. ఏది యెట్లు జరుగునో చెప్పలేము. అంతయు దైవాధీనము. నాగమ్మ కాపురము ఇంక చక్కబడవచ్చు" నని నిట్టూర్చినది. పెద్దిరెడ్డి ఒక్క పరుగులో నాయుడుగారి యింటికిఁబోయి - ఆ వార్త వారందఱికి వినిపించెను. మంగపతిరావు పట్టరాని తమకముతోఁ పత్రికను గైకొని - అదియంతయు జదివి - "దుర్మార్గురాలికి తగిన

శాస్తి జరిగినది. నా మనస్సు ఇప్పటికి చల్లఁబడ్డది'' అని తన సంతృప్తిని ప్రకటించెను.

నాగమణి యేమియు మాటాడక మౌనము వహించెను. మంగమ్మ యెక్కుడలేని సంతోషముతో ''మా పీడ వదలిపోయినది పెద్దిరెడ్డీ! ఇంక మా నాగమ్మ సంసారము బాగుపడుతుంది. ఈ నాటితో ఆ దుష్టురాలి పాపమంతా బద్దలై పోయినది-'' అని బిడ్డవంకఁ జూచెను. అప్పుడుగూడ ఆమె మాటాడలేదు. మంగపతిరావు నాయుడు పెద్దిరెడ్డితో సంభాషణ సాగించెను.

నాయు:రెడ్డీ! ఈవార్తవిని మాత యేమన్నది?

పెద్ది:- మంగమ్మతల్లి అన్నమాటే అన్నది.

నాయు:ఆ తల్లిమాట తప్పదు. దుర్మార్గురాలు! తన పాప ఫలాన్ని అనుభవించిందిలే!

నాగ:- తప్పంతా మనదగ్గఱ పెట్టుకొని ఆమెను దూషిస్తావెందుకు నాన్నా? మొదట్లోనే రాజయ్య బావ చెప్పిన మాట విన్నట్లయితే యిదంతా యిట్లా యెందుకు జరిగేది? బావ యెందుకట్లా మరణించేవాడు?

నాయు:నిజమమ్మా నిజము. మా బుద్ధి గడ్డితిన్నది. తప్పంతా మీ అమ్మది - నాది.

పెద్ది:- ఇందెవ్వరి తప్పూ లేదు. ఇదంతా విధివిలాసము. దానినెవ్వరూ తప్పించలేరు. జరిగినదానికి విచారపడే కంటే జరుగనున్న దానిని గుఱించి ఆలోచించుట లెస్స. ఇప్పుడెంత విచారపడినా గురుదేవుడు బ్రతికి వస్తాడా? ఏమిటా

లేదు. నాగమ్మా! గురుదేవుని తరువాత మన కందఱికీ పూజ్యురాలు మాత. ఆమె చెప్పినట్లు మన మందఱమూ నడచుకొంటే గురుదేవుని పవిత్రాత్మ సంతోషిస్తుంది.

దేవుడింకా మన పాలిట ఉన్నట్లు యీ హత్యా కాండలో డాక్టరు తగుల్కోలేదు. అదే జరిగి ఉంటే మనము చేసేది యేమీ లేదు. మనకే ఊరట ఉండేది కాదు.

మంగ:- మంచిమాటన్నావు నాయనా! నా ఆయుస్సుకూడా పోసుకొని మాతాజీనిల్లు బ్రతుకును.

నాయు:- ఇంతకూ డాక్టరు ఏమైనదీ - ఎక్కడికి లేచి పోయినదీ- తెలియలేదే?

పెద్ది:- రెండు మూడు రోజులు ఓపిక పట్టితే అంతా తెలుస్తుంది. ఆమెతో ఏదో జగడపడకపోతేనే డాక్టరు లేచిపోయి ఉంటాడు. ఎకాయెకి యిక్కడికి రావటానికి మొగము చెల్లకపోవచ్చు. నా ఊహ సరియైనదైతే అతని దగ్గఱ నుంచి తప్పక ఉత్తరము వస్తుంది. అతనిని గుఱించి మీరేమీ దిగులుపడవద్దు.

వారి సంభాషణము తనకు రుచింపనట్లు నాగమణి యచ్చట నుండక - లేచి - తిన్నగా మందిరమునకుఁ బోయినది. పెద్దిరెడ్డికూడ సంభాషణ ముగించి యామె వెనుకనే బయలుదేఱి పోయెను.

రూపలతాదేవి హత్యావార్త అప్పటికప్పుడే నాయుఁడు పేటలో నలుమూలలఁ బ్రాకిపోయెను. ఆమె దారుణ మరణమునకుఁ గంటఁ దడిపెట్టిన వారొక్కరును

లేరు. ఇంక నైనా డాక్టరుకు మంచిబుద్ధి కలుగవచ్చుననీ — నాగమ్మ కాపురము కుదుటపడ వచ్చుననీ — ఆ ముసనళ్ళ కష్టాలు గట్టెక్కే రోజులు సమీపించినవనీ — దుర్మార్గ మెప్పటికి కొనసాగదని — యందఱు చెప్పుకొనిరి.

కొద్దిరోజులు గడచినతరువాత — ఒకనాడు — నాయుఁడు పేర నొక యుత్తరము వచ్చినది. అదికవరు. ఎంతో యాత్రముతో నాయుఁడు దానిని చింపి చూచెను. అది బందరునుండి డాక్టరు వ్రాసినది. ఆవృద్ధుఁడు పట్టరాని సంతోషముతో తల్లిబిడ్డలకు దానిని చదివి వినిపించెను.

పూజ్యులైన మామగారికి — నమస్కారములు.

నావంటి ద్రోహి తమకు ఈ యుత్తరము వ్రాయుట తగదని నాకు తెలుసు. అయినా పెద్దలు — అనుభవజ్ఞులు అయినమీరు నాతప్పును మన్నిస్తారనే భావనతో వ్రాయుటకు సాహసించాను.

పరమ నీచురాలైన ఆ జమీందారిణి వ్యామోహము లోపడి — ఇంద్రియ దాసుడనై — మీపట్ల — మీ కుమార్తెపట్ల — నేను చేసిన ద్రోహమూ — చూపిన తిరస్కారమూ — ఎన్నటికీ మన్నింపరానివి. మఱువరానివి.

మొదట దుర్మార్గురాలైనప్పటికీ చివరి గడియలో మంచిబుద్ధిగలిగి — పున్నమ్మ — నాకు నిజమంతా చెప్పి — జ్ఞాన భిక్ష పెట్టినది. నేను కండ్లుదెఱచి యదార్థజతిని తిలకించి — నా ద్రోహమును తెలుసుకొన్నాను. ఆక్షణమే ఆ తుచ్ఛురాలి మొగము చూడరాదని లేచివచ్చినాను. నేనిప్పుడు

పడుచున్న మనోవ్యథ యిట్టిదని వ్రాయలేను. పాపాత్ములారా లికి తగిన శాస్తి జరిగినది.

నేను కూడా మహాపాపినే. నాకుగూడా యిటువంటి శాస్తి జరుగవలసినదే కాని భగవంతుడు నన్నెందుకు బ్రతుకనిచ్చాడో చెప్పలేను. బ్రతికి యీ పరితాపాగ్నిలో కుమిలిపోవుటకంటె మరణించుటే మేలనిపిస్తున్నది.

విద్యావతి - ప్రేమవతి - శీలవతి - అయిన మీ కుమార్తెకు నావంటి పరమనీచుడు భర్తయనిపించుకోటానికి గూడ తగడు. ఆ గుణవతిని గొట్టిన దెబ్బ నా హృదయములో ఇప్పుడు శల్యమువలె గ్రుచ్చుకొని తీఱని బాధ కలిగించుచున్నది. నా పాడుచేయి ఏదో ప్రమాదానికి గురియై విఱుగనన్నా విఱుగ లేదేయని యెంతో పరితపిస్తున్నాను. నాగమణి నా తప్పు మన్నించకపోతే బ్రతుకను.

జానకీ రాజయ్యల పవిత్రచరిత్రలు తెలుసుకొన్నాను. వాళ్ళమీదపడి నా క్షమాపణ చెప్పుకోక పూర్వమే గురుదేవుడు దివంగతుడైనందుకు నేనెంతో విచారపడుతున్నాను. మాతకు క్షమాపణ పూర్వకమైన నా నమస్కారాలు చెప్పండి.

మీరందరూ నా తప్పును మన్నిస్తారని విశ్వసిస్తున్నాను. ఇదే నా వేడుకోలు! — డాక్టరు.

అది చదువుట పూర్తియగు సరికి ఏదో పనిమీంద పెద్దిరెడ్డి యచ్చటికి వచ్చెను. సమయానికి వచ్చినావనుచు నాయుడు యుత్తరమును పెద్దిరెడ్డి చేతికిచ్చెను. అతఁడు

దానిని చదువుకొని – "అయ్యగారి కిప్పటికి తలతిరిగి నోట్లోకి వచ్చినది. నా యూహ నిజమైనది. ఎంత దుర్మార్గురాలైనా పున్నమ్మ చివరకు మంచిపని చేసినది. భగవంతుడే ఆమె కీబుద్ధి పుట్టించాడు. ఇదంతా మన మేలుకే" అనెను.

నాయు:సంగతులన్నీ తెలుసుకొన్నావుగదా, నీ సలహా యేమిటి రెడ్డీ?

పెద్ది :– ఒకరి సలహాతో పనిలేదు. అంతా నాగమ్మయిష్టము.

నాయు:ఏమంటావు తల్లీ!

నాగ:– నేననేది యేమీలేదు. నన్నేమీ అడుగవద్దు. అంతా మీ యిష్టము.

నాయు:అట్లాఅంటే కాదమ్మా! నీకూ మంచిచెడ్డలు తెలుసు. నీ భర్త మనస్సు నీకు బోధపడ్డట్లు మా కెవరికీ బోధపడదు. అదిగాక యిదంతా నీకు సంబంధించిన విషయము. కాబట్టి నీ యిష్టమేమిటో చెప్పు తల్లీ!

నాగ:– మళ్ళీ నన్నడుగుతావెందుకు నాన్నా! ఎప్పుడైనా నీ యిష్టానికి కాదన్నానా?

నాయు:యిష్టానికి తలఒగ్గబట్టే యింత జరిగింది. అందుకు నే నెంతో కుమిలిపోతున్నాను. ఇంకా నాయిష్ట మెందు కంటావు తల్లీ! ఏదో నాపని అయిపోయింది. చేసినంత వలుకు చేశాను. ఇక చేయగలిగింది యేమీ లేదు. ఈ కామాటమంతా నీ కప్పగిస్తున్నాను. కొడుకువైనా కూతురువైనా నీవే. నీకంటె మాకు వేరు దిక్కు లేదు.

నిన్ను నమ్ముకొనే మేము తరించాలి. కాబట్టి మంచి చెడ్డలు గుర్తించి నీవే చెప్పుతల్లీ!

అని యా వృద్ధుఁడు కన్నీరు నింపెను. తండ్రి దైన్యమునకు నాగమణి కూడ అశ్రువులు రాల్చినది. కాని తన ఇష్టమేమో చెప్పినదికాదు. అప్పుడు మంగమ్మ ఆ సంభాషణ మందుకొన్నది.

మంగ:—నీ తండ్రి మనసు కష్టపెట్టక — నీ యిష్టమేమో చెప్పు తల్లీ! నిజానికి ఈ పాపమంతా నాదే. ఇందుకు నేనూ కుళ్ళికుళ్ళి చస్తున్నాను. కీడో—మేలో—జరిగిపోయిందేమో జరిగిపోయింది. ఏ గ్రహచారము చాలకనో రావలసిన కష్టాలన్నీ వచ్చినవి. ఏదో చెడిపోయిన నీ సంసారము మళ్ళీ కాస్త పచ్చపడితే చూచి సంతోషిస్తాము. అంతకంటే ఈ జన్మలకు కావలసినది ఏమున్నది తల్లీ!

పెద్ది:— ఇదంతా యెందుకు వచ్చిన కంఠశోష? మనమందరమూ మాత దగ్గరకు పోదాము పదండి. ఆ తల్లి ఎట్లా చెప్పితే అట్లా నడుచుకొందాము. ఇందుకు నాగమ్మ కూడా కాదన లేదు.

అని యతఁడు లేచెను. అందుకు సమ్మతించిన దానివలె నాగమణికూడ తన తల్లిదండ్రులతోఁ బాటు లేచెను. వారందరు మందిరమునకు బయలుదేరి పోయి మాతను గలసికొనిరి. నాయుఁడు డాక్టరు వ్రాసిన లేఖ మాత కందిచ్చెను. ఆమె దానిని తుదివరకుఁ జదివి—ఒక్క వేడి నిట్టూర్పు పుచ్చి "అతడు సహజముగా విద్యావంతుడు. కొంత సంస్కారము

గలవాడు. ఏనో తప్పుదారి త్రొక్కినప్పటికీ - పశ్చాత్తాపమువల్ల వాస్తవమును తెలుసుకొని - ఇప్పుడు నిజముగా పశ్చాత్తాప పడుచున్నాడు. పశ్చాత్తాప పడ్డవానియందు ఏ తప్పులేదు అంటావు. దేవుడే అతనిని క్షమిస్తాడు. కాబట్టి అతని తప్పును క్షమించి రమ్మని వ్రాయుట నా కర్తవ్యము.

నాయు: ఇందుకు అమ్మాయి యేమంటుందో? ఆమె ఇష్టము తెలియక బాధపడుతున్నాము.

మాత: మీరు బాధపడ నక్కరలేదు. మీ అమ్మాయి ఇందుకు కాదనలేదు. క్షమించుట మన ఆర్య సాంప్రదాయము. అగత్య శ్రేయస్సునుగూడ మన భారతనారి క్షమిస్తుంది. ఇంతటి గొప్ప గుణము మరెవ్వరికీ లేదు. నాగమ్మ తనజాతి గౌరవాన్ని పాడుచేయదు.

నాగ: మాతా! నీ మాటకు అడ్డులేదు. ఆయన రాకను మాత్రము సమ్మతిస్తున్నాను.

నాయు: బ్రతికించావు తల్లీ!

అని మంగపతిరావునాయుడు తప్పులెల్ల క్షమించితిమి ఇంటికి రావలసినదని అల్లునకు జాబు వ్రాసెను. నాగమ్మ చెప్పిన సమాధానములోగల యంతరార్థమును మాతాపుత్రికలు మాత్రమే గ్రహింపఁగలిగిరి. ఆ సాయంకాలము నాయుఁడు దంపతులు గూడ గురుదేవుని పూజలలోఁ బాల్గొనిరి.

ఉత్తరము వ్రాసిన నాల్గవరోజు-ఉదయము పదిగంటలకు- మధుసూదనరావు చాల చిన్నబోయిన మొగముతో మామగారింటికి వచ్చెను. అల్లునిఁ జూడగనే మంగపతిరావు

గభాలున లేచిపోయి - కౌగలించుకొని - "నాయనా! మధూ!..." అని యిఁక మాటాడలేక బావురు మనెను. అతఁడుకూడ మామను గాఁగిలించుకొని- గన్నీరు నించెను. మంగమ్మ వెక్కి వెక్కి యేడ్చెను. నాగమణి - ఎట్టివికార మునకు లోనుగాక - ప్రశాంత గంభీర వదనముతో- నిశ్చల దృష్టితో- భర్త మొగమువంక నొక్కసారి చూచి- గిఱ్ఱున ప్రక్కగదిలోనికిఁ బోయెను. కొండప్ప దంపతులు "సుఖముగా వచ్చితివి బాబూ!" అని క్షేమ సమాచారములడిగిరి.

ఈ తొలిఘట్టము ముగిసిన తరువాత డాక్టరు స్నానాది కములు ముగించుకొని - మామగారితోఁ గలిసి భుజించెను. తరువాత తల్లి గూఁతులు భుజించి యింటిపనులు చక్కఁ బెట్టుకొని హాలులోనికి వచ్చిరి. కొండప్ప దంపతులు గూడ నచ్చటికిఁ జేరిరి. నాయుఁ డంతకుముందే అచ్చట కుర్చీలోఁ గూర్చుండి - చుట్టద్రావు చుండెను.

మధుసూదనరావు వారిని జూచుటకు మొగము చెల్లకనో యేమో తన గదినుండి బయటికి రాలేదు. గది లోనికిఁ బోయి పలుకరించి రమ్మని మంగమ్మ కుమార్తెను తొందర పెట్టెను. కాని యామె అటనుండి కదలలేదు. కొంత సేపటికి-యేమనుకున్నాడో యేమో-మధుసూదనరావే హాలులోనికి వచ్చి వారందఱి యెదుట తన తప్పు నొప్పుకొని క్షమాపణ కోరెను. నాయుఁడు దంపతు లతనిని క్షమించి యాశీర్వదించిరి. నాగమణి మాత్రము-భర్త మొగమువంకఁ జూడక పెడమోము పెట్టి మౌనముద్ర వహించెను.

ఆ సాయంకాలము– ఎప్పటియట్లు – గురుదేవుని పూజ లలోఁ బాల్గొను నిమిత్తము–నాగమణి రాజమండ్రినుండి ముప్పా పోయినది. ఆమె పోయిన కొంచెము సేపటికి మధుసూదన రావు కూడ బయలుదేరి అచ్చటికి పోయెను. అనసి నసుక నాయుఁడు దంపతులు కూడ కదలిపోయిరి. ఆనాఁడు గురు దేవుని పూజార్థము చాలమంది గ్రామీణులు కూడ అచ్చటికిఁ జేరిరి. వారందరితో బాటు డాక్టరు కూడ ఎంతో భక్తి శ్రద్ధలతో సమాధి పూజలలోఁ బాల్గొనెను.

పూజానంతరము – మధుసూదనరావు – సమాధి మ్రోల మోకరిలఁబడి – చేతులుజోడించి – గురుదేవా! నీవు ఆజన్మ పవిత్రుడవు. ప్రేమ మయుఁడవు. నీ పవిత్రతను తెలుసుకోలేక నీచ హృదయుడనై – నిన్ను నిందించిన మహా పాపిని నేను. క్షంతవ్యుడనుగాను. కాని దయామయుఁడవని నీ క్షమాభిక్ష కోరుచున్నాను. నా ద్రోహ బుద్ధిని మన్నించి నన్ను అనుగ్రహింపుము.

జానకీమాతా! నీవొక దేవతవు. నీ మహాత్మ్యమును గుర్తింపలేక – ఒక తుచ్ఛురాలి దుర్బోధనలు నమ్మి – నిన్ను చాల నీచముగా భావించిన నా మహాపాపమునకుఁ బ్రాయ శ్చిత్తము లేదు. అయినా నీవు మాతృమూర్తివి. నా యపరా ధమును క్షమించి – నీ పవిత్ర మాతృప్రేమామృతాభి షేచనముతో నన్ను పునీతుని గావింపుము మాతా! నాకు నీ కృపాభిక్ష పెట్టుము.''

గభోలుప్రని యతఁడు లేచి-యామెకు నమస్కరింపఁబోయెను. మహాయోగినీ మాత అతనిని వారించి "నాయనా! నీ తప్పును క్షమించుటకు పైన దేవుడున్నాడు. క్రింద నా గురు దేవుడున్నాడు. నా కా యధికారము లేదు. నీ వెప్పుడు నిజమైన పశ్చాత్తాపమునకు లోనైతివో అప్పుడే పునీతుడ వైతివి. గురుదేవుని పవిత్రాత్మ నిన్ను అనుగ్రహించుగాక!" అని యాశీర్వదించెను.

ఆ తల్లి యాశీర్వాదములు బొంది-అతఁడు-సమాధి ప్రక్కనే కొద్దిదవ్వులో - అవనత ముఖయై నిలబడియున్న నాగమణిని సమీపించి - ఆమె రెండు చేతులు పట్టుకొని - ఎంతో దీనభావముతో - "నాగూ! అని నిన్ను సంబో ధించుటకు గూడ నా కర్హత లేదు. కాని అంతకంటె తియ్యని పదము నాకు తోచలేదు. నేను మహాపరాధిని. ఇంద్రియ లోలుడనై ఒక జారిణి దుర్బోధలకు చెవియొగ్గి - నిన్నన్న మాటలు - నీకు గావించిన మహావమానము- మఱువరానివి. నీవన్నట్లు నాదురుక్తులవల్ల నీ పవిత్రమ హృదయములో కలిగిన పచ్చిపుండు మానునది కాదు. కాని నేనిప్పుడు వెలుగు లోనికి వచ్చితిని. నీ పవిత్ర సౌశీల్యమును గుర్తించితిని. నా మలీమస హృదయము ప్రగాఢపరితాపాగ్నిలో పరితప్తమై శుద్ధిసంస్కారమును పొందినది. నేనిప్పుడు నిష్కల్మష హృదయముతో - యోగినీమాత పాదములానగా - గురు దేవుని పవిత్రాత్మసాక్షిగా - నిన్ను ప్రార్థించుచున్నాను. నా యపరాధమును క్షమింపుము. క్షమించునంతవఱకు నీ

చేతులు విడువను. నీ క్షమాభిక్ష లభింపని మరుక్షణమందే యీ గురుదేవుని సమాధి ప్రక్కన నా సమాధి కూడా తయారు కాగలదు. ఇందుకు భగవంతుడే సాక్షి'' అని యందఱి గుండెలు నీరగునట్లు ప్రార్థించెను. కొన్ని నిముసముల పాటు అచ్చటనున్న ప్రజాసమూహామే గాక ప్రకృతి మాత గూడా నిశ్చలత్వము వహించినది.

ఎట్టకేలకు నాగమణి – వంచినతల పైకెత్తి – అశ్రు ధారాసిక్తములైన తన చూడ్కులను భర్త మొగమున నిలిపి – ''ఆరేయి – యీ ప్రణయ రంగమునుండి నిష్క్ర మించుచున్నాను – అని నేనన్న మాటలు మరచితిరా? ఇప్పుడునుగూడా నా సమాధాన మదే'' యని పలికెను.

మధు : ఆరేయి నీవన్న మాటలన్నీ గుర్తున్నవి. పాపపుణ్య విచారణకు పైన భగవంతుడున్నా డన్నావు. అది యేనాడో సార్థకమైనది. ముందొకప్పుడు నీవు క్షమాపణ కోరక తప్పదన్నావు. అది ఇప్పుడు సార్థకమైనది. ఇక నీవిప్పుడన్నదికూడ సార్థకము కావలసినదే కాని – అపవిత్ర ప్రణయరంగమునుండి – అని కదా నీవన్నది? ఆ యపవిత్రత నానుండి తొలగిపోయినది. అదిగాక – నిష్క్రమించు చున్నానని అన్నావేగాని పునః ప్రవేశము లేదని చెప్పలేదు. అయినా ఇప్పుడా ప్రసక్తి యెందుకు? ముందు నాకు కావలసినది నీ క్షమాభిక్ష. నీవు నా తప్పును క్షమిసే నే యీ నా బ్రదుకు? నాగూ!

నన్ను క్షమించానను ము. అంతకంటె నేను మరేమియూ కోరను. ఆ ఒక్క మాటతో నా మనోవ్యధను దీర్పుము.

మాత:-నాగమ్మా! గురుదేవుని అనుజ్ఞయైనది. పవిత్రుడైన నీ భర్తను క్షమించుము.

నాగ:- మాతృ వచనమును — గురుదేవుని అనుజ్ఞను శిరసా వహించితిని.

మధు:- నాజీవితము ధన్యమైనది. గురుదేవునకు జై! జై!

ఆమందిర ప్రాంగణ మంతయు జయ జయ ధ్వానులతో మారుమోగినది.

ఓం. శాంతిః



Printed at Geeta Art Printers, Palakol. 1500 C—Dec, 55.